# ఆంధ్రగ్రంథమాల పుస్తకములపట్టిక

మానవహృదయాన్ని కదలించే కథానము



గుబ్బి: హేమారెడ్డి

# మల్లమ్మ

జయమ్మ....హొన్నప్ప భాగవతర్.... వీరన్న.... నటించినది....

## జనవరి 14 నుండి విడుదల

| | |
|---|---|
| బెజవాడ - శ్రీ మారుతీ సినిమా | తెనాలి - రత్న టాకీస్ |
| గుంటూరు - రాధాకృష్ణ టాకీస్ | ఏలూరు - కేసరి పిక్చర్ ప్యాలెస్ |

ఏక డిస్ట్రిబ్యూటర్లు :

చమరియా టాకీ డిస్ట్రిబ్యూటర్సు, బెజవాడ.



# విషయానుక్రమణిక

## జనవరి, 1946



## చిత్రములు

త్రివర్ణచిత్రము : శక్తి; సాధారణ చిత్రములు : సేవామందిర దృశ్యములు






సంపుటము 23 | జనవరి, 1946 | సంచిక 1
పార్థివ పుష్యము

# స్వవిషయము

భగవదనుగ్రహమువల్లను, ఆత్మీయుల ఆదరాభిమానములవల్లను భారతి జీవిత యాత్రలో మరొక్కయేడు గడచినది. ఇరువది రెండేండ్లు నిండి ఇరువదిమూడవ యేడు ఆరంభమైనది. అనంతమైన కాలవాహినిలో ఇది ఒక బిందుప్రాయమైన పరిమాణమే కాని, అనుక్షణ విజృంభమాణములైన విషమపరిస్థితులనుబట్టి పరికించినయెడల ఇది కూడ ఒక మహావిశేషముగానే మాపాలికి తోచుచున్నది. అందునను, ఎదురీత ఈదవలసిన నేటి దేశకాలములలో ఇది ఒక మహాభాగ్యముగానే మేము పరిగణించుచున్నాము. అందువల్ల ఇది తప్పక మాకు ఒక మహాపండుగదినము.

భారతి యింత నిరాతంకముగా, జయప్రదముగా, జనమెప్పుగా ముందునడక తీయుటకు ప్రత్యక్షముగాను, పరోక్షముగాను కారకులైన అఖిలాంధ్రమహాశయులకును కృతజ్ఞతావందనములను సమర్పించుట ఈ పండుగనాడు మాకు అవశ్యాచరణీయమైన విధి. వారి ఇతోధికాశీర్వాద బలముతో మేము మున్ముందు ఇతోధిక సేవ అవశ్యము చేసితీరగలమని మా యంతరాత్మ గట్టిగా విశ్వసించుచున్నది. ఆ శుభోదర్కమునకై ఆత్మీయులకందరికిని అంజలిఘటించుచున్నాము.

ఆదిని భారతి సంకల్పించుకొన్న లక్ష్యములను, ఆదర్శములను పదేపదే ఏకరువుపెట్టి, చర్విత చర్వణము చేయవలసిన అగత్యము కానరాదు. ఆనాటి లక్ష్యశుద్ధితోనే, ఆ లక్ష్యసిద్ధికొరకే నేడును భారతి పాటుపడుచున్నది. తన కర్తవ్యమును ఏమరక, తప్ప

త్రోవలబడక, పాతక్రొత్తల మేలుకలయికకై బహుధా శ్రమించుచున్నది. ప్రత్యక్షవిషయమునకు ప్రమాణము అవసరమని యనుకొనము.

ఈ కర్మయోగమునందు ఫలాకాంక్షకంటె సేవాభాగ్యమే మహాభాగ్యముగా మేము ఆదినుండి అనుసంధించుచున్నాము. అదియే భారతికి అంగరక్ష, ఆత్మరక్ష!

మా సేవాపథిలో మే మెంతమాత్రము కృతార్థులమయినదియు నిర్ణయింప కర్తలు సహృదయులే.

మా సంకల్పసిద్ధికి ఫలమా అన్నట్లు దేశమునందు శుభచిహ్నములు పొడకట్టుచుండుట ఆశాద్యోతకముగా నున్నది. రాజకీయ, పారిశ్రామిక, సాంఘికాదిరంగము లన్నింటితోపాటు సాహిత్యరంగమునందును నవ్యచైతన్యము, నూత్న వికాసములు వెల్లివిరియుచున్నవి. క్రొత్తక్రొత్త ఉద్యమములు బయలుదేరుచున్నవి. భావోద్యమమును వెన్నంటి అతివాస్తవికత, అభ్యుదయ సాహిత్యము, ప్రజాసాహిత్యము మొదలైన నానావిధోద్యమములు ప్రజల నుఱ్ఱూతలూగించుచున్నవి. పరిణామమునుమాట యెట్లున్నను ఈ ఉత్సాహవికాసములకు మేము మిక్కిలి హర్షించుచున్నాము.

ఈ విప్లవోద్యమముల మంచిచెడ్డలను నిర్ణయించుట మా పనికాదు. అది కాలమే నిర్ణయించగలదని మా విశ్వాసము. ఇటువంటి విప్లవములు త్రికాలములకును సర్వసామాన్యములు. ఆంధ్రసారస్వతము ఇటువంటి ఎన్ని విప్లవముల ధాకలకు తలలొగ్గి నిలిచినదో విషయజ్ఞులకు ఎఱుకలేనిది కాదు. ఇవి పుటపాకసమానములు. నిజమైన సారస్వతము - శాశ్వతబ్రహ్మకల్పమైన సారస్వతము నిగ్గుదేరి నిలుచుటకు ఇవి ప్రకారాంతరముగా తోడ్పడగలుగునని మా విశ్వాసము. పాతక్రొత్తల మేలుకలయికకు ఇవి ఊతయిచ్చునని కూడ మా నమ్మకము.

ఇక, పోతే, సారస్వతప్రయోజనముల మాట. ఈ విషయమున విభిన్నవాదము లున్నవి. వాని చర్చ కిది తావుకాదు. కాని సామంజస్య అసామంజస్యముల నిర్ణయమును కూడ వ్యుత్పన్నలోకమే క్రమశః చేయగలదన్నచో ఏ వివాదము నుండదు.

ఏది యెట్లున్నను, ఇటువంటి మహాచైతన్యము పుట్టినందుకు మేము చాల హర్షించుచున్నాము. దేశమెల్లెడల ఈయేడు జరిగిన సభలు, సమావేశములే ఈ చైతన్యమునకు ప్రత్యక్షతార్కాణ. ఈ ఉత్సాహము సత్పథమునుబట్టి, ఆంధ్రతేజమునకు, ఆంధ్రప్రతిభకు చక్కని ఉదాహరణగా కలకాలము ఉండిపోవలెనని ఆశించుచున్నాము.

క్రొత్త సంవత్సరము క్రొంగ్రొత్తదీధితు లెత్తి ఆంధ్రమహాజనులకు అష్టైశ్వర్యాభివృద్ధిప్రదమై వెలయుగాక!

# అభినవకవిత

## శ్రీ పిల్లలమఱ్ఱి వెంకట హనుమంతరావు

మానవుడు లౌకికానందము పొందుటకై నిత్య నవీన మార్గముల నన్వేషించుచుండును. దీనికి తార్కాణముగ నాతని వేషభాషలలోని మార్పు కన్పించును. అట్లే సాహిత్యమందుకూడ నూత్న మార్గముల నాయా కవులు కాలానుగుణముగ సృజించుకొందురు. మతములోకూడ ననేక భేదములు ప్రతీయమానములగుచున్నవి. సంఘ సంస్కారి వచ్చి యెప్పటికప్పుడు సంఘమును మరమ్మతుచేయుచుండును. మార్పన్నిట సహజగుణము. కాని ప్రాథమిక సూత్రములకే విధమైన క్షతి యుండకుండునంతవరకా మార్పు సమ్మతమగుచుండును.

ఈనాడు నిత్య వ్యవహారములో 'రొమాంటిసిజమ్' అను పదము విరివిగా నుపయుక్తమగుచున్నది. సామాన్య మానవధర్మములకును, ప్రకృతికిని, సభ్యతకును దూరముగానుండి, అప్పటికి నస్వాభావికముగా, నసభ్యముగా, విప్లవకారకముగా సంచరించు పద్ధతిని 'రొమాంటిసిజమ్' అనుచున్నాము. సంఘములోను, సాహిత్యములోనునిది యన్వయమగుచున్నది. ఇట్టి పద్ధతి కాలగతిలో సహజముగా నిమిడియుండును. ప్రతి సమాజములో—ప్రతి సాహిత్యములో నీవిధమైన భావచేతన మగుపించుచునే యుండును. కాలము జడముగాదు. అది ప్రవాహమువలె చేతనమునకు లోనైనది. కాలవాహిని కెదురీదజూచుట యవివేకము. ఎప్పటికప్పుడు నూతన వికాసముల మానవుడు గ్రహించుచుండవలెనేకాని మడికట్టుకొని కూరుచుండరాదు. నూతన భావచేతనము సాహిత్య సమాజములలో కల్గుచుండుట జాతియొక్క ప్రతిభను వెల్లడించును. ఈనాటి భావచేతన మొకనాటికి ప్రాతబడి ప్రాచీనమగును. తత్కాలమునకు భావచేతనము విప్లవభ్రాంతి చేకూర్చి కొంత అలజడి కల్గించినను, అది పరిపాటయిపోయి మానవమనసులలో స్థిరపడిన పిమ్మట బాధలేదు. ఎంతటి భావచేతనమైనను ప్రధాన మానవసూత్రముల నతిక్రమింపరాదు. అట్లతిక్రమించినచో నది జాతిలో నిమిడిపోలేదు.

మన సాహిత్యము నవలోకించినచో నెన్నెన్నియో యుద్యమములు వచ్చినట్లు తెలియుదుము. అది మొట్టమొదట పురాణాది సంస్కృత గ్రంథముల ననువదించుటతో ప్రారంభమైనది. దాని ననువాదోద్యమ మనదగును. తరువాత స్వకపోల కల్పనముల కాలవాలమైనది. దానిని కల్పనోద్యమ మనవచ్చును. అటుపిమ్మట గీతికి ప్రాధాన్యము కలిగిన రచన వచ్చినది. అది నాదోద్యమమగును. తరువాత వచ్చినది అభినవకవిత. ఇది భావోద్యమముగా ప్రసిద్ధిబడసినది. ఈవిధమైన భావోద్యమ మాంగ్లసాహిత్య సంసర్గము వలన వచ్చినట్లు తెలియును. ఆంగ్ల సాహిత్యములో కూడ నిది సంక్రమించుటకు దానిపై మరొక సాహిత్య ప్రభావము కారకము. ఇట్లు దీని మూలమును గమనించి, సూత్రములనుకూడ నరయుదము.

కవిత్వము మానవజీవితవాహినితో పరుగిడునది. అది సచేతనము. కవిత్వము జీవితమునకు భావవ్యాఖ్యాన మన్నారు. విజ్ఞులు. కావుననే కవిత్వము జీవితమునకు నద్దమువంటిదను నిర్వచనము పొసగినది. మానవజీవిత మనేక కవుల చేతులలో వివిధ వ్యాఖ్యానముల నంది వినూత్నపరిణామముల నందుచుండును. ఈ జీవితము క్షణికమైనను కవి తన శక్తిచే దానిని శాశ్వతముగా కావ్యభిత్తికపై చిత్రించును. సత్య జీవితమునకు ప్రతిమాస్థితి నొసగుటయే కళాధర్మము. ఈ విధముగా చిత్రితములైన ప్రతిమలన్నియు భిన్నప్రకృతులు కలవిగా పరిణమించుచుండుట సత్యము; కొన్ని క్రమపరిణామమునకు దారితీయునవిగా

నుండును; కొన్ని వేఱితోడను సంబంధములేక ప్రత్యేక వైలక్షణ్యము కలదిగా వర్తిలును; మఱికొన్ని వికృతరూపములను పొంది, లోక విరుద్ధములుగా నుండును. పైవానిలో క్రమ పరిణామము కల్గినవి కవితాలోకమున నెట్టి కల్లోలము కల్గింపక ప్రకాశించునవి. విశిష్టమైన వికృతమూర్తుల ప్రకటించునవి విప్లవ కారకములై పృథక్త్వము కల్గియుండును. ఏకకాలావచ్ఛేదకములుగా నీ రెండు ప్రకృతులు సాహిత్యములో భాసించుచునే యుండును. మొదటిది స్థిరము; రెండవది భావచేతనము! భావచేతనమే మొదట ప్రభవించునది. అది క్రమముగా సమగ్ర స్వరూపమును పొంది యొక స్థాయిగొని సిద్ధమగును. ఇది సాహిత్య ధర్మము. కావున భావచేతన కారణమై, పరిణామావస్థలో క్రమముగా స్థిరత్వము వహించును.

ప్రతిభాషా సాహిత్యములో నీ ప్రవృత్తి వెలయుచునే వచ్చినది. జర్మనీ దేశమందు 'కాంటు' అను తత్త్వజ్ఞుడు లోన తత్త్వమును విచారించి మనకు బాహిరముగా కన్పించు వస్తువులలో నొక యతివస్తువు దాగియున్న దని చెప్పినాడు. తరువాత 'ఫిక్టె' యను మఱియొక వేత్త యా యతివస్తువును 'అహం' అను పదార్థమని నాడు. ఎవరే సిద్ధాంతె మొనర్చినను 'మానవత్వము' వశింపజేయరాదని 'షెల్లింగు' ప్రవచించినాడు. 'నొవాలిస్' అనువాడు 'రొమాంటిక్' కవులలో ముఖ్యుడై ప్రేమగాథల నసంఖ్యాకములుగా చిత్రించి తనివిదీరక, లోకోత్తర సౌందర్యమునకై యఱ్ఱు జాచినాడు. తుదకీ లోకమందు పాక్షికమైన సౌందర్యమే పొడగట్టునని విసువు చెందినాడు. కావుననే కాబోలు మన ప్రాచీను లాదర్శకతోద్యమమునకే ప్రాధాన్యమిచ్చియుందురు.

ఫ్రాంసు దేశములో సాంఘిక రాజకీయ వేత్తయగు రూసో మనీషి. ఇతడు స్వాతంత్ర్యోద్యమమును ప్రబోధించినాడు. ఈతని ప్రభావమే జర్మనీ స్వతంత్ర గీతములకు తగిలినది. సాహిత్యములో రూసో యలజడి కలిగించినాడు. పూర్వసాహిత్య సూత్రములమీద సంపూర్ణముగా తిరస్కార భావము రేకెత్తించినాడు; నిత్యానువర్తమైన ప్రకృతి నారాధించినాడు. మానవులపై జుగుప్స యభివృద్ధిచెందినది. ధర్మచ్యుతి సాహిత్యములో — మతములో — రూసోవలన కలిగినది. ఈ 'రొమాంటిక్' ఉద్యమమునకు బాగుగా దోహదమిచ్చినవాడు 'రూసో' యని చెప్పవలెను. ఇతడే 'భావచేతన'కు ప్రవక్త. ఆదినములలో రూసోను విప్లవకారునిగా పరిగణించిరనిన నాశ్చర్యముగాదు.

క్రమముగా నింగ్లాండు దేశమున కీగాలి సోకినది. ఆసాహిత్యములో స్పష్టముగా నీమార్గానుయాయు లనేకు లగుపించుచున్నారు. కీట్సు, బైరన్, షెల్లీలలో నీభావచేతనము మూర్తీభవించినది. వీరు ప్రణయకవిత్వమును వ్రాసినారు. అసభ్యశృంగారము నైతము వర్ణించినారు. బైరన్ నియమోల్లంఘన మొనర్చుటలో దిట్ట. అతని కవిత్వమే దీనికిసాక్ష్యము; విశృంఖల విహారమొనర్చి స్వతంత్ర జీవితమును గడిపి గర్వించినాడు. తరువాత వచ్చినవారిలో 'స్విన్బర్న్' పైవారి యంశలన్నియు గ్రహించి కవితా వ్యాపారము సాగించినాడు.

ఈ విధముగా భావోద్యమము ప్రతిదేశవాఙ్మయములో నుదయించినది. ప్రాచీన ధర్మోల్లంఘనము, ఛందోనియమాతిక్రమణము, స్వేచ్ఛాకాంక్ష, ప్రణయోపాసనము, ప్రకృతి పరిశీలనము, అహం ప్రత్యయము, మనస్తత్త్వ చిత్రణము, పతితోద్ధరణము, ఆత్మభావ వ్యక్తీకరణము లనునవి యీ భావోద్యమము యొక్క ప్రధాన సూత్రములని తెలియును. ఈ యుద్యమము సాహిత్యము నొక విలక్షణమైన నూత్న మార్గమును బట్టించినది.

ఆంధ్ర సాహిత్యములో నైత మీవిధమైన కవిత యీ యిరువదవ శతాబ్దపు ప్రథమ సంవత్సరములలో నంకురించినది. ఆంగ్లకవుల రచనలు విద్యాప్రణాళికలో స్థానముగొన్నవి. తప్పనిసరిగా నాంధ్ర విద్యార్థులు వానిని పఠించినారు. తత్ఫలితముగా వీరికి నాంగ్లభావకవు లభిమానులైనారు. మన సాహిత్యములో నట్టి ఆత్మపరమైన కవిత లేదని గుర్తించినారు. ఆంగ్ల విద్యా ప్రభావమువలన పాశ్చాత్య వేషము పైవారి యాచార వ్యవహారములమీద ప్రతిఫలించినది.

సంఘములోకూడ మార్పువచ్చినది. స్త్రీ విద్య కారణముగ సహవిద్య వచ్చినది. అతఃపూర్వములేని నూతన సన్నివేశములు సంఘ వ్యవహారములో తారసిల్లినవి. వీనికితోడు విద్యార్థుల వయసు తోడైనది. యువకవులు స్వానుభవ భావ్యముల చెప్పదొడగినారు. ఆంగ్లవిద్యాభ్యాసకుల కేవల హృదయచ్ఛాయలకు స్వరూప వైచిత్రి నిర్మింపక విమువరా దనుకొనినారు. అంతకు పూర్వము మన సాహిత్యములో కవి ఉత్తమపురుషలో కవిత చెప్పలేదు. ఈ నూతన భావోద్యమము కారణముగా కవి ప్రత్యక్షుడైనాడు. ఆత్మప్రణయమే కథావస్తువైనది; ఇందు విప్రలంభమేకాని సంయోగమున కవకాశమే కానరాదు. ప్రణయోద్దీపన భావములలో చేరునట్టి కోకిల, సముద్రతీరము, ఉద్యానము, శరద్రాత్రులు. మున్నగునవి వారి వర్ణనమున కాస్పదమైనవి. పురాణములవలె కథను చెప్పుట క్రమముగా సన్నగిలిపోయి, ప్రబంధములలోవలె శబ్దాడంబరము, సన్నివేశకల్పనము, పాత్ర చిత్రణము మొదలైనవానికి ప్రాధాన్యము తగ్గిపోయి, కేవలమొక్కక్షణములో కలిగిన స్వాత్మానుభవమును చక్కని భావముతో మేళవించి యుద్వేగముతో చెప్పుట నవ్యకవితా లక్షణమైనది. సంఘములోని స్వేచ్ఛా ప్రవృత్తితోపాటు కవితలోకూడ స్వేచ్ఛపాడమినది; గానయోగ్యమైన మాత్రా ఛందమునకు గౌరవము హెచ్చినది. అడుగడుగునకు ప్రకృతిప్రబోధలను గ్రహింపుచు వచ్చిరి.

ఏవంవిధ కవితా ప్రభాతకాంతు లాంధ్ర దేశమున మొట్టమొదట తిరుపతి వేంకటకవులపై బడినవి. కాని వాని ప్రభావము వారిని సంపూర్ణముగాలో గొనలేదు. 'ప్రాచీనమార్గమునకు భరతవాక్యము, నవ్యమార్గమునకు నాందీవాక్యము' వీరిలో శ్రుతిగొన్నవని తెలియుచుము. తరువాత నూతన భావచేతనము సమగ్రముగా వారిశిష్యులలో కల్గినదని చెప్పవచ్చును. ముఖ్యముగా శ్రీ రాయప్రోలు సుబ్బారావు, శ్రీ గురజాడ అప్పారావు లీ మార్గమునకు తెలుగు దేశములో ప్రవక్తలనవెల్లును. ఈ విధమైన కవితను 'అభినవ కవిత' అనినారు. వీరిరువురి కవితలో పై పేర్కొనిన లక్షణములన్నియు గోచరించును. రాయప్రోలు వారి లలిత (1909), తృణకంకణములు (1914), గురజాడ వారి 'ముత్యాలసరములు' (1910) అభినవకవితకు సంపూర్ణోదాహరణములు; భావవస్తురచనలలో మార్పు గాన్పించినది. అదేకాలములో శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మలుకూడ నాధోరణిలో రచనసల్పినారు. అటు పిమ్మట శ్రీయుతులు పింగళి లక్ష్మీకాంతము, కాటూరి వేంకటేశ్వరరావు, దువ్వూరి రామిరెడ్డి, సాహితీసమితి సభ్యులు, అబ్బూరి రామకృష్ణరావు, అడివి బాపిరాజు, విశ్వనాథ సత్యనారాయణ, బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావు మొదలైనవారు నూత్న భావచేతనకు లోనై రచనలు సాగించినారు.

ఆంధ్రభాషలో భావోద్యమము కారణముగా బయలుదేరిన సాహిత్యప్రవాహమును పరిశీలించినచో నది వివిధమార్గములలో ప్రవహించినట్లు తెలిసికొందుము. ఆయా మార్గములకు ద్రష్టలులేకపోలేదు. ఒక్కొక్కమార్గమున కనుచరు లెప్పుడు బయలుదేరుదురో అప్పటి కవి నిలకడకెందినట్లు గ్రహింపవలెను. నవ్యాంధ్రకవిత్వములో పొడసూపుచున్న భిన్నమార్గముల నీ క్రింది విధముగా నెన్నవచ్చును :

1. ఇంగ్లీషు కవిత్వమున కనువాదములు.

2. ఆంధ్రుల ప్రాచీనప్రాభవమును తలచి ప్రబోధించు రచనములు.

3. ఆత్మపరము ప్రణయమును చిత్రించుకవిత; స్త్రీ వ్యక్తిని గౌరవించు రచనలు.

4. ఆంధ్రులకు సన్నిహితములగు ఆచారవ్యవహారములను వర్ణించు కవిత.

5. ఆత్మీయభావములకు ప్రకృతియందలి రహస్యములను లగించిన రచనము ; అర్ష ధర్మప్రతిపాదనము సూత్రముగా నున్న కవిత.

6. భారతదేశ స్వాతంత్ర్య రక్తితోకూడిన రచనములు.

7. సంఘసంస్కారము నిమిత్తముగా వచ్చిన రచనము.

8. పతితోద్ధరణమే సూత్రముగా నున్న కవిత.

9. ఉత్తమమానవత్వసిద్ధికి సత్యాహింసలు సూత్రములుగా నున్న కవిత్వము.

10. లౌకికసౌఖ్యమే ప్రధాన ధర్మమని ప్రబోధించు రచనలు.

ఇక నీవిధమైన దశవిధమార్గములకు ప్రవక్తలన దగువారిని గూర్చి విచారింతము.

మొదటి మూడు మార్గములకును రాయప్రోలువారు ప్రవక్తలని చెప్పుకొనవలెను. ఆంగ్లములోని 'హెర్మిట్' అను కావ్యమును నవ్యకవితాసరణిలో 'లలిత' అను పేరుతో ననువదించి రాయప్రోలువారు ప్రథమమార్గమునకు శ్రీకారము చుట్టినారు. ఇదిగాక యాంధ్రదిగ్విజయ స్తంభమును జ్ఞప్తికి దెచ్చి తిరిగి ప్రతిష్ఠింపజాలిన ప్రథమాంధ్రనవ్యకవికూడ వారే. అటు పిమ్మటనే హంపీక్షేత్రము ఆంధ్రప్రశస్తి, రాష్ట్రగానము, ఆంధ్రతేజము మొదలైన రచనములు వచ్చినవి. ప్రణయపరమైన భావముల నూహించి యందు వినూత్నమార్గమును సృజించిన నవ్యుడుకూడ రాయప్రోలువారే. నవ్యకవితలో నియమోల్లంఘన మొక సూత్రముగా నెన్నితిమి. రాయప్రోలు సుబ్బరాయకవి శృంగారరసమును గూర్చి ప్రత్యేక సిద్ధాంతమును కల్పింపజాలినాడు; శృంగారరసీకరణమునకు నాయికానాయకుల మధ్యనున్న మోహమే స్థాయిభావముగా నుండనక్కరలేదనియు, సోదరీసోదరుల మధ్యనున్నట్టి వాత్సల్యము, స్వామిసేవకుల మధ్యనున్నట్టి భక్తియు స్థాయిభావములగుట కేల యభ్యంతరమనియు భావించినాడు. ఆయనకావ్యములీ సూత్రమున కుదాహరణములగును. తమోగుణముతోడను, రజోగుణముతోడ, నున్న మోహము లేక కామము క్షాళితమైనగాని పవిత్రమైన ప్రేమగా పరిణమింపదు. అదియే ఉత్తమమైన శుద్ధసత్వప్రేమయగును. ఆంగ్లములోని 'Love is divine' అనునదియు, భగవంతుడు ప్రేమస్వరూపుడను సూక్తియు నట్టి శుద్ధప్రేమకే వర్తించునవి. అందువలననే మాలిన్యరహితమైన ప్రణయభావము ప్రణయస్థితికి తీసికొనిపోవు నను విశ్వాసము రాయప్రోలువారి కున్నట్లు కనుగొందుము. ఈ విధముగా మొదటి మూడుమార్గములకు సుబ్బరాయకవి ప్రవక్తయైనాడు.

ఆంధ్రులకు సన్నిహితములైన యాచార వ్యవహారములకు చక్కని రూపు కట్టుటకు బసవరాజు అప్పరాయకవి మొదట ప్రయత్నించినాడు. అప్పరాయకవి భావోన్మాది. జాతీయముగా భావింపగల సమర్థుడు. ఆయన వ్రాసిన నాగులచవితి-వటపత్రశాయి-మొదలైన రచన లిందుల కుదాహరణములు. ఈ భావమును పెంపొందింపజేసినవారు లేకపోలేదు. శ్రీకొంటాలి ఆంజనేయులు వ్రాసిన 'పెండ్లికూతురు', విశ్వనాథవారి 'మూగనోము', రాయప్రోలువారి 'సంక్రాంతి', బాపిరాజుగారి -'గంగిరెద్దు' కవికొండలవారి 'కోతలపాట' మొదలైనవియూ శ్రేణికి చెందినవే. ఈ విధమైన హృదయంగమమైన భావమునకు (నేడెవరు నంగీకరింపకపోయినను) బసవరాజువారి ప్రభావము లేకపోలేదని మనవి.

నవ్యకవులు ముఖ్యముగా ప్రకృత్యుపాసకులు ఆత్మభావమునకు ప్రకృతిలోనున్న గుప్తభావములను జోడింపగల ప్రతిభ నవ్యకవులలో చాలమందికున్నట్లు ద్యోతిలును. ప్రకృతిలోని వస్తువుల రెంటిని గైకొని వానిని నాయికానాయకులుగా రూపకకల్పనముచేసి చిత్రించుటలో ప్రధానుడు రామరాజభూషణుడు. అతని వసుచరిత్రమే యిందులకు తార్కాణము. నవ్యపథములో నట్టి భావమునే నేయమర్యాదలలో నడిపించిన విశ్వనాథవారు గణనీయులు. ప్రకృత్యుపాసనకత్యంతస్థానము కల్పింపజాలిన నవ్యకవులలో విశ్వనాథవారగ్రగణ్యులని చెప్పవలెను. ఆయన వ్రాసిన 'కిన్నెరసానిపాటలు', 'కోకిలమ్మపెండ్లి', అనునవి పై సిద్ధాంతమును ధ్రువపఱుపగలవు. ఇంతియగాక నూతనముగా వెలువడిన సాహిత్యములో నార్షధర్మనిష్ఠకలిగిన రచనలల్పసంఖ్యాకములే. ఇట్టి యార్షధర్మప్రతిపాదనాదీక్షతో వ్రాసినది యొచటనైన గన్పించినచో నది విశ్వనాథవారి రచనాప్రభావజనకములే యని చెప్పిన సత్యదూరముకాదు. కాబట్టి నవ్యకవిత్వములో విశ్వనాథవారిది విలక్షణమైన మార్గమునకు జెందినదిగా నెన్నవచ్చును.

కవిత్వములో కాలానుగతముగా మార్పులు వచ్చుచున్నదో సంఘములో సైత మటులనే క్రమ పరిణామము కన్పించుచున్నది. ముఖ్యముగా నవ్యులలో సంఘ సంస్కారమును సూత్రముగా పెట్టుకొని కృషి చేసినవారు శ్రీ వీరేశలింగము పంతులు. వీ రుపన్యాసములతోడను, వచనరచనలతోడను తత్ప్రచారమునకు బూనుకొనిరి గాని కవిత్వమును వాహికగా గ్రహింపరైరి. దీనిని శ్రీ గురజాడకవి పూరించినాడు. నవ్యకవితా పద్ధతులలో సంఘసంస్కరణాభిప్రాయమును వ్యక్తీకరింప ప్రయత్నించిన ప్రథమనవ్యకవి గురజాడ కవియే. ఆయన వ్రాసిన ముత్యాల సరములు చదివినవా రీ భావమును గుర్తింపకపోరు. ఇదిగాక గురజాడ కవి మఱియొక మార్గమునకును గురువని చెప్పవలెను. భారతదేశము పారతంత్ర్యమునకు గురియైనదిగదా! దీనికి చకితుడు కాని కవి ద్రష్ట కానేరడు. హిందీ భాషా కవులలోను, వంగభాషా కవులలోను పైభావమునకు చకితులై స్వాతంత్ర్యగీతముల నాలపించి ప్రజల ప్రబోధింపజూచినవా రనేకులున్నారు. మన నవ్యులలో నంతగా దీక్షబూనినవా రరుదుగా నున్నారని చెప్పకతీరదు. ఇట్టివారిలో శ్రీగురజాడకవి ప్రథముడే యగును. మత వైషమ్యముల దొలగించి స్వాతంత్ర్యకాంక్ష పొడముటకై యాతడు ప్రయత్నించినాడు. శ్రీయుతులు బలిజేపల్లి లక్ష్మీకాంతము, మంగిపూడి వేంకటశర్మ, గరిమెళ్ల సత్యనారాయణ, వేదుల సత్యనారాయణ మొదలైన వారిలో నీ స్వాతంత్ర్యేచ్ఛ పొడమినట్లు కనుగొందుము. వారి రచనలే యిందు కుదాహరణములు.

ఈ నవ్య కవితోద్యమమునకు పూర్వము కావ్య రచనలో నాయికానాయకులనుగా ఉదాత్తులైన వారిని—అంబరచుంబిత శిఖరములుగల భవనములలో హంసతూలికా తల్పములమీద కాలముబుచ్చు భోగులను—ఏరుకొనుట యాచారమైనది. దీని కపవాదముగా కొన్ని రచనలు వచ్చినవి. పల్లీయులను నాయికానాయకులుగా నేల గ్రహింపరా దను భావము కలిగి శ్రీ నండూరి సుబ్బారావు ఎంకి - నాయుడు బావలను సృజించినారు. ఈ విధముగా పల్లీయుల హృదయ సాగరములలో దాగియున్న భావరత్నములను వెలికి దీసికొనివచ్చిన నవ్యుడు శ్రీ నండూరికవి. పవిత్ర ప్రణయ ధర్మమును పామరులకు సైతము బోధించుటకై యాతడు ప్రయత్నించినాడు. ఉదాత్తులకు, మధ్యములకు, పామరులకు నుత్తమ ధర్మములను ప్రబోధించుటకును, ఆదర్శమార్గములలో వారి మనోభావములు వర్తిలునట్లు చేయుటకును ప్రయత్నించువారుగదా కవులు! పామరుల కభ్యున్నతి కలిగించుటకై పూనుకొనువా రరుదుగా నున్నారు. అట్టి కొలది నవ్యకవులకు మార్గదర్శి శ్రీ నండూరి సుబ్బరాయ కవి యని చెప్పవలెను. ఈ మార్గానుయాయులలో శ్రీయుతులు అడివి బాపిరాజు, భాగీనారాయణమూర్తి, గోఖలే, ప్రయాగ నరసింహశాస్త్రి, కందుకూరి రామభద్రరావు, కొనకళ్ల వెంకటరత్నము మొదలైనవారు కొందరు. వీరి రచనలలోని సిద్ధాంతము పతితోద్ధరణ మనవచ్చును. ఇట్లు శ్రీ నండూరి కవి యొక మార్గమున కుపదేష్ట యైనాడు.

మానవజన్మ మనితరోత్తమమైనది. ఈజగత్తులో నావరించిన మాయాతమస్సును మానవుడు తా నార్జించు జ్ఞానముచే పటాపంచలుచేసి పరబ్రహ్మము నెఱుగుటలో నుత్తమ సాధకుడు గావలెను. అరిషడ్వర్గములచే పీడింపబడుచు మానవుడు తమోరాశినుండి తప్పించుకొనలేక పోవుచున్నాడు. ఇంద్రియ నిగ్రహ మొక్కుమ్మడిగా నలవడునది కాదు. మనసు రాగము నుండి విరాగమునకు మార్పుచెందుటకు క్రమసాధనము కావలయును. ఈ క్రమ పరిణామము కల్గుటకే చతుర్విధాశ్రమములు నియమితములైనవి. ముముక్షువు లీ యాశ్రమములలో నియమముగానుండి తత్తద్ధర్మములను యథాక్రమముగా నిర్వర్తింపవలెను. మాయావృతమైన యీజగత్తునకావల నిల్వగలశక్తి యోగక లభించునా? అనాదిగా మనదేశమున నీసిద్ధాంతములు ప్రచారములో నున్నను వీనిపై నాదరము క్రమముగా నానాటికి క్షీణించుచువచ్చినది. నవ్యులకు సత్యా[illegible]

1. చెట్టపట్టాల్ పట్టుకొని
దేశస్థులంతా నడవవలెనోయి
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయి!—ముత్యాల సరములు.

సూత్రముగా పెట్టుకొనిన బౌద్ధమతముపై దృష్టిపోసాగినది. బుద్ధదేవుని జీవితమునుండి కొన్ని కొన్ని ఘట్టములను చిత్రించుటకు నవ్యకవులు గడగినారు. శ్రీ తిరుపతి వేంకట కవులు బుద్ధచరిత్ర వ్రాసినప్పటికీ నీ విధమైన భావమునకు ప్రచారము తెచ్చినవారు శ్రీ పింగళి కాటూర్లు. వీరు వ్రాసిన 'సౌందరనందమే' యిందుల కుదాహరణము. గురువుల భావములను శిష్యులు ప్రచారములోనికి దెచ్చుట సంప్రదాయమే కదా! ఈమార్గానుయాయులలో శ్రీయుతులు వేలూరి చంద్రశేఖరము, వేమూరి వేంకటరామనాథము, కల్లూరి కేశవస్వామి, సూర్యచంద్రులు, రాజలింగము, పన్యాల రంగనాథరావు మొదలైన వారెందరో యున్నారు. శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిలుకూడ జాతక కథాగుచ్ఛము వ్రాయుటచే నీభావము వారికిని సోకినదని చెప్పకతప్పదు. ఈ విధముగా బౌద్ధమత ప్రభావము నవ్యకవులపై నిండగా పడుటకు శ్రీ పింగళి కాటూర్ల సౌందరనందమే కారకమని చెప్పవలెను; ఈ భావమునకు ప్రచారకులై నూత్న మార్గ నిర్మాతలైనా రీ జంటకవులు!

భారతదేశము పాశ్చాత్యదేశములవలె లౌకిక చింత ముఖ్యముగా గలది కాదు. మన దేశములో నీవిషయమును గ్రహింపవలెనన్నను ముందుగా దేశసంప్రదాయము నెఱుగవలెను. ప్రధానముగా భారతదేశ మాధ్యాత్మిక తత్త్వముకలది. శరీరబలముకన్న మనోబలమును, సమాజమందలి గౌరవముకన్న స్వర్లోకములో సుఖిత్వమును, ఇంద్రియతుష్టికన్న నింద్రియనిగ్రహమును, ప్రపంచ సౌఖ్యముకన్న పారలౌకికానందమును భారతదేశీయు లనాదిగా కాంక్షించుచు వచ్చినారు. పాపభీతియు, దైవభక్తియు మనవారిలో మిక్కుటములు. అట్లే మన భారతీయ సంప్రదాయములో 'రేపు' అను పదమునకు యోగ్యమైన స్థానమున్నది: స్వార్థముకన్న పరహితార్థము పాటుపడువారు. పాశ్చాత్యనాగరకత సూత్రము లీ భావములన్నిటికి వ్యతిరిక్తములు. అయినను మనకు వచ్చిన నూతన విద్యాపద్ధతులవలన క్రమ క్రమముగా పాశ్చాత్య సంప్రదాయముపై మమకారము సంక్రమింప దొడగినది. లౌకికచింత ప్రబలినది; 'రేపు' అనుదానికై చింతించుట సభ్యతకు దూరమైనది.

ఇట్టి భావమును సంపూర్ణముగా చిత్రించిన కావ్యము మనకు గొప్ప మతగ్రంథమైనది. ఆ భావము పరిపాలించిన సంఘ మాదర్శమై నిలిచినది. ఈ విధముగా ఉమరు కావ్యము (పారశీక భాషలోనిది) ఆంగ్లేయ సమాజ సూత్రము లుపాదేయములైనవి. నవ్యకవులలో నీ భావమును బాగుగా ప్రచారము చేయగలిగినవాడు శ్రీ దువ్వూరికవి. కార్యరూపేణ యాభావము నందించిన ప్రథమ నవ్యకవి యాతడు. కాని 'పానశాల' అనువాదమగుటచే శ్రీ దువ్వూరికవికే ప్రాధాన్యమీయలేమేమో. ఏది యెట్లున్నను దువ్వూరివారి 'పానశాల' నవ్యులను చూఱగొన్నదని చెప్పవలసి యున్నది. రాయప్రోలువారు, చిలుకూరివారు, మాధవపెద్దివారు, రామచంద్ర అప్పరాయకవి, యీ కావ్యమునే పునః పునః అనువదించినారు.

వీరగాథలకును, కృషీవల జీవితమునకును రూపు గట్టిన కవి శ్రీ దువ్వూరి రామిరెడ్డి యని చెప్పవలెను. కాని శ్రీ కట్టమంచివారు 'ముసలమ్మ మరణము' వ్రాసి దువ్వూరి కవికి పూర్వమే యొక మార్గమున కుపదేష్ట లయినారని తెలియుదుము. బహుశః శ్రీ కట్టమంచివారి కావ్యము దువ్వూరికవిని దిద్దియుండనోపు! వీరగాథలపై దృష్టి మరలగా పల్నాటి వీరచరిత్ర జ్ఞప్తికి వచ్చి 'నాయకురాలు' అను పేరుతో కావ్యములు బయలుదేరినవి. ఆంధ్రులకు నేడీ విధమైన ప్రబోధ మత్యావశ్యకమైనది: రాజ్యపాలకులై వర్తిలిన జాతీయులు నేడీ విధముగా, గుర్తింపలేని దుస్థితిలో నుండుటచే నిట్టి వీరగాథలుగల కావ్యము లెన్నేని సృజింప వలసిన కాలముగా నిది గన్పించుచున్నది. కాని జాతిపరములుగా, దేశపరములుగా నుత్తమకావ్యములను నిర్మించుటలో మన నవ్యులేలకో వెనుకబడుచున్నారు.

ఇట్టి యాభినవ కవిత్వము పాశ్చాత్యకవిత కనుకరణముగా బయలుదేరి తరువాత ప్రత్యేకత గడించుకొని భిన్నమార్గములందు పొడసూపుచు నాంధ్రమున విలసిల్లుచున్నది. భావములో - వస్తువులో - రచనలో - అలంకారములో - ఛందస్సులో - భాషలో - దృక్పథములో - నన్నిట నవ్యతనలవరచుకొని యభినవకవిత తెలుగువారికిని సిద్ధమైనట్లు నిశితపరిశీలనపై తెలిసికొందుము. ఈ నాటి కిది యాంధ్రసాహితీచరిత్రలో నొక యధ్యాయమునకు యోగ్యమైన స్థానమును గడించుట కర్హత కలిగి చెన్నొందుచున్నది!

# నేటి తెలుగుకవిత్వపు పోకడలు*

శ్రీ గౌరావఝ్ఝుల వెంకటసుబ్బరామయ్య

తన సుఖదుఃఖములను ఇతరప్రాణులకు వినిపించుట లోకసహజము. కేవలము మానవులేకాదు, జంతువులు సైతము తమ మనోవ్యథను సంజ్ఞలద్వారా ఇతర ప్రాణులకు తెలుపుతవి. వాటిని ఇతరులు తెలుసుకోలేకపోతే, అది వేరుసంగతి. ఈ విధంగా పశుపక్ష్యాదులేకాక జడపదార్థములుగూడా మూకవాణిలో తమ వ్యథను, అంతరానుభూతిని వినిపిస్తుంటవి. అవి విని, వాటిలో తమ సానుభూతిని మేళవించి వ్యక్తపరచువాడే కవి; వ్యక్తపరచునదే కవిత్వము. అనగా ఆత్మప్రకాశనమే కవిత్వము. ఆ ఆత్మప్రకాశనేచ్ఛయే కవితోత్పత్తికి మూలకారణము.

కవి భగవత్సృష్టిలోని అణుఅణువునందూ సౌందర్యమును చూస్తాడు. ఆ విశ్వసౌందర్యమును మానసికంగా అనుభవిస్తాడు. ఆ అనుభూతియే కవిత్వరూపంలో వ్యక్తమవుతుంది. కాని నేటి కవి బాహ్యసౌందర్యంతోపాటు అంతర్వేదననుగూడా తిలకిస్తాడు. ప్రకృతియొక్క అంతర్వేదనలో తన హృదయావేదనను మేళవించడమే నేటి కవిత్వముఖ్యలక్షణము. హృదయవేదనానుభూతియే కవితకు ఉద్గమస్థానమంటాడు నవకవి. ప్రకృతిలో ప్రకృతి, అణువులో అణువు, బ్రహ్మాండంలో బ్రహ్మాండము, వ్యక్తములో వ్యక్తి, రోదనలో రోదనమవుతాడు నవకవి. పృథ్వియొక్క అణుఅణువునందూ, కాలంయొక్క ప్రతిక్షణంలోనూ, క్రియయొక్క ప్రత్యేకస్పందనంలోనూ జీవితలక్షణములను వెదకుట, వాటిలోని అంతర్వేదనకు తాదాత్మ్యమును ప్రకటించుటయే నేటి కవిత్వ ముఖ్యలక్షణంగా తోస్తుంది.

"రుధిరం ముదిరిన బధిరఛాయలు
వ్యథాపూర్ణకృతి వృథాప్రయాసల
క్షుధాజీర్ణస్మృతి
తెరచిన హృదయపు వీథుల్లో
ప్రళయతాండవం గావించేయ్
కన్నుల ధారలు కారిన చారలు
హృదయం నమలిన ఉగ్రపుకోరలు
ఆత్మ గ్రసించిన అనలజ్వాలలు
అవిగవిగో - అలాగే
పెనుభూతాల్లా కనిపించేయ్
తెరచిన హృదయపు చరియల్లో నా
ప్రళయతాండవం గావించేయ్"

అని కవి తన అంతరాళంలోని ఆందోళనను వ్యక్తపరిచాడు. అతని హృదయంలోని 'అధరంకదలని వృథాపూర్ణకృతి' కన్నీటిధారల్లో వ్యక్తమైంది. అతనిని 'హృదయంనమలిన ఉగ్రపుకోరలు' అనలజ్వాలలవలె కాల్చుచూ పెనుభూతాల్లాగు గ్రసించినవి. ఆహా! యేమి భావతల్లీనత! కవి భావంలో లీనమై శారీరిక క్రియలను వేరుగా భావించాడు. అతని క్రియాకలాపము అతని వశంలో లేదు. దీనినే భావతల్లీనతంటారు.

కవిహృదయంలో జిజ్ఞాస బైలుదేరుతుంది. ఆ జిజ్ఞాసయే అతనికి జీవాత్మ-పరమాత్మల సాన్నిధ్యము కొరకు తహతహలాడిస్తుంది. పరమాత్మసాన్నిధ్యము

---

* ఇందులో కవుల పేరు లివ్వకుండుటకు కారణము కవిశబ్దమునకు విశాలత కల్పించుటకే; వ్యక్తిగత మొనరించుట కిష్టములేకపోవుటే. పేరు లివ్వకుండా కవుల రచనలు వాడుకున్నందుకు క్షమిస్తారని నమ్ముతున్నాను. ఇందులో నాది యే ఒక కవితో తప్ప మిగతవన్నీ సోదరకవులవే. కవికవితకు నాభావనారంగును రుద్ది ఒక మాలగా కూర్చుటే నా ముఖ్యోద్దేశం. ఎంతవరకు సఫలుణ్ణయినానో!

నశ్లై జీవాత్మకు అనేకమెట్లు-అంతస్తులు-దుర్గమమార్గములు దాటవలసివస్తుంది. జీవాత్మ వాటిని గమించుట కసమర్థమని తేలుతుంది. ఇంతలో అతని వ్యథాహృదయము ప్రకృతిపర్యవేక్షణకు స్వాభావికంగా దిగుతుంది. అందులో అణుఅణువునంమా ఆ పరమాత్ముని దివ్యప్రకాశమును చూస్తాడు. ఆ దివ్యాంశములోని ఒక అణుమాత్రమైన తన జీవాత్మకు సంబంధాన్ని కల్పిస్తాడు. తరువాత విరహగీతిక లాలపిస్తాడు. ప్రకృతియొక్క అంతర్వేదనతో తన వేదనను శ్రుతిగొల్పుతాడు. హిమకణములను ప్రకృతిబాష్పములుగా తలచి తన కన్నీటిని స్వాగతంకొరకు పంపుతాడు.

“ఇంత విశ్వమ్ము నావలెనే తపించి
కరగిపోయిన దొక బాష్పకణము రాల్చి.”

కవి విరహాగ్నిలో తపిస్తున్నాడు. ఆ పరమాత్ముని దివ్యప్రకాశము అతని హృదయచక్షువుల కందలేదు. అందుకై ప్రకృతినిగూడా తనవలె విలపించు విరహిణిగా చూచాడు. తనవలె బాష్పములు రాలుస్తున్నట్లుగా మంచుకణములను చూచి భావించాడు. అతనికీ, ప్రకృతికీ మధ్యన మాయయొక్క ఆవరణ తొలగలేదు. ఆ ఆవరణయే తనను భక్తిసమాధిలో నిలిపి భగవత్సాక్షాత్కారమునకు, భావోన్నతికి పురిగొల్పుతున్నది. కవియొక్క దివ్యసమాధిని దర్శించండి—

“నిత్యకుసుమార్చనల దోగి నీసమాధి
ఏడులోకాల పరిమళ మేలుకొనిన
నాయెద గలట్టి వలపులు పోయిపోయి
కాగిలించును సప్తలోకాల తావి.”

తనవలెనే ప్రకృతిగూడా సమాధిస్థమై కనబడుతున్నది. అది ప్రకృతి కాదు. ఆ దివ్యపరమాత్ముని జ్యోతియే ఆ ప్రకృతి. అందులో ఏడులోకాల పరిమళము ఇమిడియున్నది. ఆ సప్తలోకాల తావిని-ఆ దివ్యప్రకాశమును - కవియొక్క వలపులు పోయి కాగిలిస్తవి. యేమి ఉత్కృష్టభక్తి! యెంత విశాల హృదయము! ఇందులో - ఈ కవిభావంలో - ఏడులోకాల తావి ఇమిడి పాఠకలోకాన్ని ఆనందమగ్నలను చేయటం లేదూ? దీన్ని యే రసహృదయం ఆస్వాదించజాలదు?

ఇంకా, కవి ప్రకృతిలో లీనమై తాదాత్మ్యతను-ఆ తాదాత్మ్యతలో సామీప్యసంబంధమును-ఆనందానుభూతిని కల్పించి జీవితపరమావధిని జేర ప్రయత్నించుచున్నాడు. ప్రకృతిలో ప్రేయసిని, ప్రేయసిలో ప్రకృతిని తిలకించి రెండిటి అభేదమునూ ప్రహాద్యంగా అనుభూతిచేసినాడు. ఆ విశ్వసౌందర్యంలో ప్రేయసిసౌందర్యమును కలిపి ఏకవస్తువుగా గ్రహించినాడు. ఆ ప్రేయసి యెవరో కాదు. కవి ఆరాధ్యదేవత - సౌందర్యఖని-కవితాప్రశంతికి జన్మస్థానం-కవి సృష్టించిన సౌందర్యమూర్తిని. కాని ప్రకృతి ముందు తన ప్రేయసిసౌందర్యము లెక్కింపదగినది కాదని కవి స్వయంగానే గుర్తించాడు. అంతే కాదు. తన ప్రేయసియే ప్రకృతిలో లీనమైపోయింది. చూడండి—

“జాబిల్లి వెలుగుచే జాలువారెడు మోము
నీలాభ్రపటలిచే మాటుపడియేనా?
కలువరేకుల సౌరు దిలకించు కనుగవల్
రేరాజురాకచే ముకుళితంబయ్యెనా?
పసిడినే నిరసించు పరువంపు మైచాయ
సంధ్యాతపంబులో సమసిపోయేనా?
చిరుమొగ్గలను మీటు తంత్రీస్వనంబులు
మందానిలంబులో మరగిపోయేనా?
శ్రుతిపుటంబుల కెక్కి మది గరంచెడు పాట
కోకిలారవములో కూడిపోయేనా?”

కవియొక్క యీ ఉత్కృష్టఉపాసనను- యీ సౌందర్యానుభూతిని వ్రాయుటకు నావద్ద శబ్దజాలం యేదీ? ప్రేయసిలో ప్రకృతిని తిలకించినా కవిహృదయానికి తృప్తి కలుగలేదు. ప్రకృతిసౌందర్యము ప్రత్యక్షముగా చూచికూడా చూడనిదే సామాన్యులకు; చూడనిదికూడా చూచినదే కవిహృదయానికి! కవి భావాలు ఉన్నతమైనవి. కాని ఆ దివ్యజ్యోతి సాక్షాత్కారమునకు సాధన కావలె. ఆ సాధనాగ్నిలో తపించి తేనేగాని మెరుగుపసిడిగా తయారుకాదు. అందుకనే కవి విరహాగ్నిని ప్రేమించాడు. అదే ఆ దివ్య

జ్యోతిసాక్షాత్కారమునకు మార్గదర్శక మని నిశ్చయించుకున్నాడు. ఇంకేమి, ఆ విరహమే కవికి ఆనందాన్నిచ్చేదిగా మారింది. అందులో ఆ దివ్య ప్రకాశంకొరకు విలపించడం వుంటుంది. ప్రకృతి రాగంలో తన రాగమును కలపటం, రోదనలో రోదించటం సంయోగావస్థలో వుండదు. సంయోగంలో ఆనందమే. రెండోదానికి తావే లేదు. సరి, కవికూడా రజనీకాంతుని విరహంలో తపిస్తున్న కాళరాత్రియే తనకుగూడా సానుభూతిని తెలుపుతున్నట్లుగా తలిచాడు. దాని నిట్టూర్పులో తన నిట్టూర్పులను ఎగయబోస్తున్నాడు. తన హృదయకుహరములోకూడా పెను జీకట్లు అలముకొన్నట్లు తాదాత్మ్యమును ప్రకటించాడు.

"ఏను ప్రేమింతు చీకటినే! మదీయ
హృదయకుహరము జీకటు లేలుకొనును
క్రమ్ముకొనియెడు కారుచీకటులలోన
నృత్య మొనరింతు నిట్టూర్పు లెగయబోసి"

ఇది విరహావస్థ. కొంతకాలం జరిగింది. కవి కొంచెం లోకాన్ని పరికించాడు. అనుభవాన్ని గడించాడు. విశ్వాన్ని నలువైపులా చూస్తూ, అందులో ఆ దివ్యప్రకాశముయొక్క కణాలు ప్రకృతిలో చూడటానికి ప్రయత్నించాడు. ఆ ప్రయత్నంలో కొంత సఫలీకృతుడైనాడుకూడా. కాని పూర్ణప్రకాశం గోచరించనందున-మాయయొక్క ఆవరణ పూర్తిగా తొలగనందున సంయోగావస్థను, లేక పూర్తిసాక్షాత్సందర్శనమును చేసుకోలేకపోయినాడు. అందువల్ల కొంత నిరాశచెంది ఆ దివ్యప్రకాశసందర్శనం నికృష్టుడైన తన కెలా లభిస్తుందని వాపోయినాడు.

"ఏదో ఘనుల్ చరించు పద
మేలు సముజ్జ్వలమూర్తివన్న స
మ్మోదమెకాని నీకనుల
ముందు తపించెడి యస్వతంత్రతా
ఖేదభరైకజీవనని
కృష్టుల కిట్టుల మాకు మానసా
హ్లాదము కల్గ నీయమృత
మట్లగుపించెడి మంచుసోనలన్"

కవి మంచుసోనల్లో అమృతసృష్టిని చేయగలిగాడుగాని అనుభవించ నయోగ్యుడై - విరహాతురుడై, నోరుండి మూగయై-కాళ్లుండి కట్టబడినవాడై-విలపిస్తూ తన అయోగ్యతను ఇలా వ్యక్తపరుస్తున్నాడు. ఇంకా ఆ పరమాత్మయందు యీ ఆత్మ స్వతంత్రరహితమైనది. ఆ దివ్యజ్యోతికై పరితపించి ఖేదమొందే నికృష్టమైనదని నిందించుకుంటున్నాడు. కాని ఆశ వదలలేదు. అది అతనిని వెన్నంటి ఆడిస్తూనేవుంది. ఆశకు కీలుబొమ్మైనాడు. లోపలి భావములు రెచ్చకొడుతున్నవి. శారీరకచేష్టలకా, తావులేదు. యీ స్థితిలో ముందుకు పోలేదు, వెనుకకూ మరలలేదు. ప్రకృతిపాటను వినలేదు, వినకుండానూ వుండలేదు. ప్రకృతి యొసగిన కానుకను ధరించలేదు, పారవెయ్యనూలేదు. ఇటువంటి భావసంధిలో కవి తన కవితనుగూర్చి—

"హ్రీమతీ! నీ వొసంగిన పూలమాల
గళము సంధింపలేను త్రుంచికొనలేను
ఇంత సంతాప మింత ఆహ్లాద మొసగి
ఏ ప్రణయరక్తి నేమి సాధింతు వబల!"

ఇలా ప్రశ్నించినాడు. కాని అంతటితో పూరకొనలేదు. వూరకొనలేదుకూడాను కవియైనవాడు. అప్పుడు తన ఉపాసనయొక్క వివశతను చూపిస్తూ—

"స్వార్థలోకమ్ము పూలపందిళ్లు కాల్చి
వలపుపుంతల చిచ్చు మండింపనిమ్ము
వదలుకోలేను నిన్ను దేవి! మదీయ
కవిత వీవు, గాన మీవు, ప్రాణ మీవు."

అని అన్నాడు. ఎంత వివశత! ఎంత అపార భక్తి! కవి తన ఉపాసనాదేవతను వదలుకోలేదు. వదలుకుంటే బ్రతుకలేడని వేరుగ చెప్పవలెనా? కవి తన ఇష్టదేవతదర్శనకుతూహలతతో పరుగులిడుతున్నాడు. మాయను జయించ తటపటా యిస్తున్నాడు. హృదయపూర్వకంగా ప్రార్థించాడు. లాభం లేదు. అంతటితో మన కవి వూరుకుంటాడా? విరహంలో కూడా మనోభరమును దిగజార్చుటకు ప్రయత్నించాడు. ఆ రమణీయశోభ, ఆ దివ్యకాంతి పున్నమ చంద్రునిలో కనబడ్డవి. నిద్ర నశించింది. మేల్కొని

ఆ శృంగార రసైకమూర్తిశోభను గాంచుచూ మైమరచాడు.

"సీరమణీయశోభ గమ
నించుచు బున్నమరాత్రులెల్ల ని
ద్రారహితమ్ముగా మెయిలు
దారికి కన్గవ నప్పగించి శృం
గారరసైకమూర్తి! సుధ
కై తృషితార్భకువోలె లేచి వే
సారి, మనోహరమ్ము దిగ
జార్తు నిశాంతపు జాలియూర్పులన్."

యీవిధంగా ప్రకృతిలో దివ్యజ్యోతిని గాంచి గాంచక, పరితపించి పరితపించక, చెప్పి చెప్పక, పొంగి పొంగక వ్యక్తపరిచాడు. అప్పటికీ తన కోరిక నెరవేర లేదు. యెంతసేపు ప్రకృతితో విలపిస్తే ఆరని పిపాస అంతరిస్తుంది! తుదకు అతని గుణాలను కనుగొన అసమర్థుడైనాడు. తనకు వ్యక్తముగాని ఆ అవ్యక్తము నిలా వ్యక్తీకరించినాడు—

"ఆకసమందు విచ్చి కయి
కందని యందపు బూవువంచో, యీ
లోకము లన్నియు న్నిదుర
లో మునిగున్నపు డేగుదెంచు ది
వ్యాకృతి వంచో, మానవచ
యం బడియాసల వేగిపోవుగా
నీ, కనుపింప దేగుణము
నీకడ నా కెటు లేచి చూచినన్."

ఇప్పటి కతనికి విసుగొచ్చింది. ప్రకృతిపర్య వేక్షణలో విసిగి వేసారినాడు. ఎల్లకాలం పాత పాటేవని క్రొత్తమార్గాన్ని వెతుకబూనినాడు. ఆ మార్గాన్వేషణలో కొన్నాళ్లు తిరిగాడు. తుదకు కనుగొన్నాడు. సఫలీకృతుడ నైనానని అనుకు న్నాడు. అదే ప్రతీయమానమైన దేశం-దేశభక్తి. ఆ దివ్యప్రకాశమును జడతుల్యము, ఉపయోగరహితమైన ప్రకృతిలోకంటె, ఎవ్వరూ లేని వంటరితనంలో కంటె తోటిసోదరులగు దీనులలో చూడసాగాడు. ఇంకేం, అతని సానుభూతికి వాండ్లు ఆలంబనులైనారు. వారిలోని దివ్యజ్యోతిని కనుగొన్నాడు. సాధన సాగించినాడు. ప్రపంచమే అటు తిరిగింది—

"దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్.
దేశమంటే మట్టిగాదోయ్
దేశమంటే మనుషులోయ్."

కవికి అప్పటికి కొంచెం తృప్తి కలిగింది. ఆ పరమాత్మను రాగాత్మకంగా గీతించేదానికంటె తోటి దీనులైన సోదరులే స్వయం ఆపరమాత్మని భావించడం ఎంత గొప్ప! కనుకనే "మానవసేవే మాధవసేవ" అని గుర్తించాడు. అదేవిధంగా తోటిసోదరకవులకు దివ్య సందేశాన్నిచ్చాడు. యీవిధమైనదే కవిత్వమనీ, దీనుల వర్ణనే దివ్యజ్యోతివర్ణననీ, పతితుల సేవే పావన సేవనీ నిరూపించినాడు. బీదలను-కర్షకకార్మికులను గురించి వెలిబుచ్చే సమవేదనే, వారి కష్టములను, దీన దశను తెలుసుకొని ప్రకటించు సానుభూతియే కవిత్వ మనీ, అంతకంటే భిన్నమైనది వట్టి చెత్తనీ భావించి తన్ను తాను సంబోధించి ఇలా చెప్పుకున్నాడు—

"కవియన్న బిరుదు నీ కెవరిచ్చినారోయి
ఏమేమొ లిఖియించి ఏమేమొ చిత్రించి
సంతోషపడుతావు కవిరాజా
ఇంతేన నీపస కవిరాజా."

ఐతే కవిత్వం ఎలా వుండవలె? ముందు విందాం—

"నల్లరేగడితోడ మల్లయుద్ధము చేసి
వజ్రాల సృజియించి వట్టిచేతుల బోవు
కూలిబాబును చూచి కవిరాజా!
జాలిపడవేమోయి కవిరాజా!
మండువేసవిలోన మంటిపని జేయుచును
ఒక్కొక్క గడ్డ కొక గ్రుక్కనీటిని త్రాగు
కష్టాల నెపుడైన కవిరాజా!
కవితలో చెప్పితివ కవిరాజా!"

అన్నాడు. దేశప్రజలకూ, దేశానికీ భేదం లేదు. దేశోద్ధారమే దీనోద్ధారము. దేశప్రజలు బాగుపడా

లంటే దేశం స్వాతంత్ర్యమును పొందవలె. అందుకని దేశప్రజలు త్యాగం చెయ్యవలె. ఇతని దృష్టిలో కవి తంటే యేమిటో, అది యెటుల వుండవలెనో ఇంకా వినండి—

"ఆకులందున అణగిమణగి
కవితకోకిల పలుకవలెనోయ్
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్తవలెనోయ్."

అని ప్రబోధించాడు. ఇంకోచోట కవిత్వ రూపం గుండెలలో ఇమడని దేశభక్తిగా పొంగి ప్రవహించింది. మహావేశంతో మాతృదేశాన్ని గానంచేస్తున్నాడు—

"ఏదేశ మేగినా ఎందు కాలిడిన
ఏపీఠ మెక్కినా యెవరెదురైన
పొగడరా నీతల్లిభూమి భారతిని
నిలుపరా నీజాతి నిండుగర్వమ్ము!
లేదురా ఇటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి ధీరు లింకెందు.
ఏ పూర్వపుణ్యమో ఏయోగబలమో
జనియించినాడ వీస్వర్గలోకమున
ఏ మంచిపూవులన్ ప్రేమించినావో
నిను మోచె నీ తల్లి కనకగర్భమున"

కవి నిద్రలో జాగ్రదవస్థయందు, కష్టంలో సుఖంలో, కీడులో మేలులో, మాతృదేశాన్ని ప్రేమించమని బోధిస్తున్నాడు. ఆమెయే భారతి-రత్నగర్భ-స్వర్గసీమ! ఇందులో జన్మించడమే గొప్ప తపఃఫలం. ఆమెఉపాసనయే మన-భారతీయుల కర్తవ్యము. ఆమెయే మన సర్వస్వము. ఆమె ఉపాసనే-అర్చనయే మన జీవితానికి పరమావధి అన్నాడు. ఆధ్యాత్మికశక్తినంతా దేశభక్తిగా మార్చమన్నాడు. మన పూర్వపుణ్యమే భారతావనిలో జన్మించగలగటం జరిగింది. ఇది స్వర్గలోకాన్ని మించిందని ఉపమించాడు. ఇంకా మన పూర్వప్రాభవమును, శక్తిని, తేజాన్ని, భావములను-రాగములను, సాహిత్యమును వర్ణించాడు. అవి మన కెలా లభ్యమయాయో కవివచనాల్లో వినండి—

"తమ తపస్సులు ఋషుల్ ధారపోయంగ
చండవీర్యము శూరచంద్రు లర్పింప
రాగదుగ్ధము భక్తరాజు లీయంగ
భావసూత్రము కవిబాంధవు లల్ల
దిక్కుల కెగదన్ను తేజంబు వెలుగ
జగముల నూగించు మగతనం బెగయ
రాలుపూవులు సేయు రాగాలు సాగ
సౌందర్య మెగబోయు సాహిత్య మొప్ప
వెలిగిన దీదివ్యవిశ్వంబు పుత్ర!"

ఎంత సగుణవర్ణన! ఏమి ఉత్కృష్టభావము! ఎంత దేశాభిమానము! యీ దేశాన్ని, పూర్వపుటౌన్నత్యమును అనేకమంది అనేకతీరులుగా వర్ణించారు. ఒకరు పూర్వపుటౌన్నత్యాన్ని ఊతగానొని శిక్షగరుప ప్రయత్నిస్తే, ఒకరు నేటి సమాజదుర్గంధాన్ని వాసన చూపించారు. ఒకరు పూర్వపువెలుగును కండ్లకందిస్తే మరొకరు నేటి అజ్ఞానాంధకారమును ప్రత్యక్షపరిచారు. ఒకరు పూర్వపు పౌరుషమును మేల్కొలుప ప్రయత్నిస్తే నేటి దుస్థితిని చిత్రించా రొకరు. కవితాశక్తి నొకరు గీతిస్తే, నిరక్షరాస్యత భయంకరాకారాన్ని ఎదుటనిలిపారు ఒకరు. ఒకరు శక్తిని ఆరాధిస్తే మరొకరు భక్తిని, ముక్తిని. ఇంకొకరు స్త్రీ అధరామృతంలో, కేశపాశాల్లో ప్రొద్దులుపుచ్చితే మరొకరు స్త్రీని సర్వపాపాలకూ హేతువునుగా వర్ణించారు. ఎన్నిరీతులని వ్రాయగలము! అందరివీ అన్నితీరులు. అందులో కొన్నితీరులు వినండి—

"ఏ రాజు పంచెనో ఇచట శౌర్యపు పాయ
సమ్ములు నాగులచవితినాళ్ల
ఏ యెత్తుసంజెలో నెలమి పల్లవరాజ
రమణులు కాళ్ల పారాణు లిడిరో
చిత్రరథస్వామి శ్రీ రథోత్సవములో
తెలుగుపిల్లలు కత్తిత్రిప్పి రెపుడో
ఏ రెండుజాముల ఇమని వేడిమి వచ్చి
కలిసిపోయెనో త్రిలింగప్రభువుల
నా జగచ్ఛ్రేయసంబులై యలరు తొంటి
వేంగిరాజుల పాదపవిత్రచిహ్న
గర్వితమ్మయిన యీ భూమిఖండమందు
నక్షువులు జార్తురి జీవచ్ఛవాంధ్రజనులు"

అని ఒక కవి కన్నీరుకార్చాడు.

"కుక్కల్ నక్కలు పిల్లులెల్కలను సం
        కోచంబు లే కెంతయుఙ్
ప్రక్క న్నక్కున జేర్చిముద్దులిడు మీ
        పాండిత్యమేమో సదా
దిక్కై యక్కరదీర్చు సోదరుల ప్రీ
        తిఙ్ బ్రోవ కస్పృశ్యులం
చిక్కట్లన్నిడ నేల చేరిమనకే
        హిందూమతోద్ధారకుల్"

అని నేటి అస్పృశ్యతా సమస్యనుగురించి నుడివి నాడు.

"తెలుగుతనంబులో వలపు
        తేటలు వెన్నెలవెల్లి జాలులై
మలసిన మాతృదేశమున
        మంజులగానరసజ్ఞమాధురీ
చలితసుధార్ద్రిపేచిక ల
        జస్రసుఖోదయగీతులల్లు త్వ
ద్విలసితజీవరోచికి ని
        దే యభినందనమాల భారతీ"

"తెలుగుకవితకు చెలువులు తీర్చిదిద్ది
కవుల కలకంఠమధురరాగములలోన
ఈవిశాలాంధ్రవని బల్లవించినావు
చివురుకొమ్మల నింక పుష్పింపు మమ్మ"

అని సరస్వతిని ప్రశంసించితే మరొకరు—

"భావము సున్న యన్వయ మ
        భాసు తెలుంగును గాదు ధారలో
జీవము లేదు పాక మతి
        చిత్రము వింతల కైత మేల్ భళీ
పావనిరో విరామసదు
        పాయము నీ కగునంచు నేమొ మై
రావణభాషలో మునిగి
        రంజిలుచుండెద వేల భారతీ."

అని వాపోతే ఇంకొకరు ప్రాచీనార్వాచీన కవితల భేదాన్నిలా వర్ణించాడు. పూర్వకవిత్వం—

"నఖశిఖవర్ణనాలంకారముల నెంతో
సొంపుతో కూర్చి నీఅందములో లీనమై
శూన్యాకాశములో దృక్కులను పారించి
జీవతన్మయతలో తెగిన తీగెల వీణ మీటేరు
నీలోన లీనమై మూగగానము చేసి
లోకాని కెల్ల నీమత్తుమంత్రము నేర్పి
నిండు మధుపాత్రను తెస్తారు"

అనిన్నీ, ఆధునికకవిత్వము-కవినిగురించి—

"చదువుసంధ్యలు లేక, శాస్త్రజ్ఞానము లేక
కల్పనాశక్తి నా కిసుమంతయును లేక
చిత్రవిచిత్రముల్ చిత్రింపరాకుండ
అనధికారంబుగ అతిసాహసుండనై
నీసేవకై నేను వచ్చాను
నాశుద్ధమానసమె సర్వాభరణములు
నాశుద్ధహృదయమను గతి,యతిప్రాసలతో
భక్తిపుష్పంబులను కూర్చి మాలను గట్టి
నానిర్మలప్రేమ నర్పించా, చేతులు జోడించా"

అని బహుచక్కగా తారతమ్యమును గీతిస్తే, మరొకతను—

"చంద్రునిలో మచ్చను మందులా నాకేసిన
మహానుభావుడు ఎవరా అతను ?
చలించే చుక్కల చూపులతో
చూపులుకలిపి తారల చలనాన్నే
బంధించిన హృదయబాంధవుడు ; ఎవరా అతను ?
నాశరీరంలో నెత్తుటి బంధూకవనాన్ని
గాలై కదిపి పాటలు పాడించిన పరంజ్యోతి
నాకలల ఆసీలు మెట్టుదగ్గర కైఫీయత్ చెల్లించి
హృదయహజారానికి వజ్రవైడూర్యాల
జాలకాలు నిర్మించి వాటికి సేద్యగాని
చెమటతో ముత్యాలతోరణా లల్లి
నా నరాల తీగల వరాలపాటలు పాడ
హృదయగర్భాలయంలో
కంచుగంటల మ్రోగించిన దేవ రతను ?"

అని రూపకాలంకారమును ప్రకృతికీ, మానవుని జీవితానికీ కల్పించినాడు. ఒకానొక కవి నిరాశను గురించి ఎంత చక్కగా రూపించినాడో గమనించండి-



# School
## the time factor



### స్కూల్ -

### ముఖ్యమైనది టైము.

నిర్ణీతకాలమునకు పనిచేయడం, బిడ్డలు నేర్చుకొనవలసిన మొదటి పాఠము. ఎందువల్లనంటే యీ నియమం వారి భవిష్యజ్జీవితములో యెక్కువ వుపకారి కాగలదు గడియారముల విలువ తెలియునంత యీడు వచ్చేటప్పటికి మీ బిడ్డలకు ఒక గడియారం వుండటం మంచి ఆలోచన స్కూలు జీవితము నిర్ణీతమైన దైనందిన కృత్యము. వివిధ వ్యాసంగములు వేళలను బట్టి జరుగుచుండును. పంతుళ్లకు, బడిపిల్లలకు నమ్మకమైన ఒక గడియారం ముఖ్యావసరము. ఎన్నుకొనుటకు త్వరలోనే అనేకమైన దృఢమగు "వెస్టుఎండ్" గడియారములను సప్లయిచేయగలమని ఆశించుచున్నాము.



సెకండస్ టానూ

పేటెంటు ఎవర్ బ్రైట్ స్టీల్ .... రు. 52

రోల్డుగోల్డు 10 సం॥ గ్యారంటి .... రు. 62

ప్రతి "వెస్టుఎండ్" గడియారమునకు ప్రత్యేకంగా యిండియా పరిస్థితులకు తగినట్లు సాధ్యమైన గడియారములను తయారుచేయుటలో మా 75 యేండ్ల అనుభవము పేరు తోడ్పాటుగా నుండును.

వెస్టుఎండ్ వాచ్ కంపెనీ,
బొంబాయి అండ్ కలకత్తా.

# WEST END WATCH Co.

BOMBAY CALCUTTA

"జాలో పెద్ద తుపాను రేపి నగుచుక్
న ర్తింపు వో తల్లి! నీ
లీలాలోలత పాడుగాను, తగ దీ
రీతిక్ విజృంభింపగా!
జాలై పొంగెడుగాక నీహృదయసం
సారమ్ము సంద్రమ్ముగా
కారాహంకృతి పచ్చినెత్తురులలో
కర్మమ్మె జీవింపగా"

పరాత్పరుడు, జగత్పితయొక్క మహాయజ్ఞము ను ఒకకవి—

"ప్రపంచమంతట పరంపరాకం
విపంచి కింతట వసంతరాగం
ఆహవకర్త ఆహవభర్త
ఎవడో ఎవడో, మరి
ఎవడెవడో-ఎవరెవరో
తలగిరులే హోతలుగా
నుద్గాతలుగా
విధిదర్శనసేతలుగా
ఋక్ఋక్ఛకోలాహలమే
ఋత్విక్కుల రోమంథముగా
సముద్రఘోషల సామిధేనితో
హాహాకారస్వాహాస్వనముల
ఆత్మల హోమల ఆమంత్రణముల—
స్రుక్కుస్రువమ్ము లిదిక్కులు నాలుగు
హవ్యకవ్యములు అమిక్షమ్ములు
సాన్నాయ్యమ్ములు, చరుపరమాన్నము
లర్కాం రాజన ఆత్మదేహములు
ఉపాకృతమ్ములు వషట్కృతమ్ములు
కృపాతిరస్కృతకృశానతేజులు—
స్థండిలమండితచండానలునకు
అపవిత్రాశయధవిత్రములతో
స్వేదాంకురముల చిదిమేసేస్తూ
నిషాశోసమై విషాణపూరిత
సురాదానమున పరాధీనుగా
బంధించేస్తూ బలిభుక్కునుగా
పాతించేస్తూ పశుతుల్యముగా
గవేషణమ్మ సుభీషణముగా
విషతుల్యమ్మగు విశ్వదాసమును
గగనమునంటే కరాళకాళీ
ఆకలితీరని ఆరాటముతో
అంతులేని హఠయోగముతో
చేసే యీ యజ్ఞపు
చిద్విలాస మదియేమో!"

సాంగరూపకాలంకారమును యిలా భావయుక్తంగా వర్ణించడం ఒక ఉత్కృష్టకవికే తగు. అతనిదే యీసొత్తు. భావతరంగాల్లో విహరిస్తూ రత్నకణికలను వెలిదీయుట కతనే సమర్థుడు.

కాలగతినిగూర్చి ఒక కవి కవిత్వంలో ఎలా చక్కగా, ముద్దుగా ఇమిడ్చాడో చూడండి!

"ఎన్నిమారులు కాలవాహినికి నెదురు
తిరిగి ఇట నాగిపోవ యత్నించినాను
చిర మటులనే, జననియంకసీమయందె
శిశువునై యుండ వలచితి చిన్ననాడు
కాలమనెడి రక్కసునకు జాలిలేదు."

ఒక కవి భగవంతునికి ప్రణయలేఖను వ్రాసినాడు. అందులో తన అవ్యాజ, అతులితమాధురీ ప్రేమ భావవ్యక్తమును తేనెలొలుకు మాటలలో ఎలా చేసినాడో గమనించండి:

"నిక్కముగ నా దేహరాజ్యము
నీకె పట్టముకట్టితిని: నీ
వధివసింపుము హృదయపీఠిక
నమలరాగముతో.
ఒప్పినను నీ వొప్పకుండిన
నో ప్రియా, నీకడ వసించుచు
పాదపద్మములక్ భజించెద
భక్తిభావమున.
పాలముంచిన నీటముంచిన
భారమంతయు నీది నాథా
చరణదాసి నటంచుమాత్రము
జ్ఞప్తియుండుగదా!"

# కవితలో పరిణామము: అభిరుచిలో సర్వసమ్మతి[1]

= శ్రీ బొడ్డపాటి కుటుంబరాయశర్మ =

కవితలోఁగూడఁ బరిణామవాద మన్వయింపఁదగు ననుట కొందఱి కాక్షేపగ్రస్తమైనదిగఁ దోఁచునని శంక గలుగుచున్నది. పరిణామసిద్ధాంత మనఁ గొందఱకు వింతవింతలగు నభిప్రాయములు గలవు. అది సారస్వతవిషయమున స్వీకరింపఁదగినదియు, నిరూపింపఁదగినదియుఁ గాదని వారి యూహ. కనుక బహుసంక్షేపముగ దీనినిగూర్చి పొందుపఱతము. తేలిన సారాంశమును గవిత కన్వయించి పరిణామసిద్ధాంతము కవిత్వవిషయమున భావ్యమో, కాదో పాఠకులే నిర్ణయించుకొనవచ్చును.

దీనిని విశ్వసింపకపోవుట కిందేమియు నమ్మరానిది లేదు. అర్వాచీనుల మతమున దీని నిర్వచనము మఱియు సూక్ష్మము, సులభమును.[2] పరిణామమనఁ బరివర్తనము, లేక మార్పు. దీనిని వివరించుట పరిణామవాదము. [3]దైవికమైన కారణములచేఁ బ్రపంచముగాని, ప్రాణులుగాని యుత్పత్తిఁ జెందుచున్న వను విశ్వాసమున కిది యవశ్యము వ్యతిరేకముగాదు సరిగదా, కించిద్వ్యత్యాసము గల యిట్టి యుత్పత్తుల నాధారముచేసికొనియో, లేక పరిగ్రహించియో యిది తదుపరిక్రమమును వివరింపఁ బ్రయత్నించుచుండును. కవితాభిరుచుల పరివర్తనమందు మన మిట్లే యసన్నిహితములు, నసంఖ్యాకములు, నస్పష్టములు నగు హేతువు లూహ్యము లనియు, రెండవది మొదటిదాని పరిణామ మనియు ననుకొనవలెను. [4]నీచమునుండి యుచ్చమునకుఁ బరివర్తనము చెందుటయే పరిణామ మని పల్కుట మేలుకాదు. ఇట్టి నీచోచ్చవిభేదములు లేక కవితయందలి ప్రతిపరివర్తనయుఁ బరిణామముగ నెంచుచు మన మొక యభిరుచిని నిర్ణీతముగ నీచ మనియు, వేఱొకదాని నుత్తమమనియు ననక కేవల మొక యభిరుచి వాడిపోయి పరివర్తనఁ జెంద వేఱొకటి పైకొనుచుండు ననవలెను.

[5]పరిణామ మభివృద్ధినే సూచింపనక్కఱలేదు; వృద్ధిక్షయములు రెండును సమ్మతింపఁదగినవి. కనుక సిద్ధముగ సదసదభిరుచు లనునవి కేవలముగ నుండుట తటస్థించినను, పూర్వాభిరుచి పరాభిరుచికిఁ బరిణామరూపము గాక తీరదు. ధర్మోపదేశము సద్భావమైనను నసద్భావమైనను దానినుండి కళాసిద్ధి యను నభిరుచి పరిణమించిన దనక తప్పదు. ఆలంకారికరచనము నుండి యతిశయోక్తి వక్రోక్త్యాదిసమస్తాభిరుచులను బ్రత్యేకించి యిట్లే పరిణమించిన వని గ్రహింపనగును. పరిణామ మనునది కేవలము సూక్ష్మాంశముల సమ్మేళనచేతనే గలుగనక్కఱలేదు. పూర్వమం దున్న యంశ

---

1. *Evolution in Poetry : Catholicity in Taste ;*

2. *Evolution is the name for a process of change and evolutionism is a name for some statements about that process of change ;*

3. *"Evolutionism is not necessarily opposed to the doctrine of a Divine origin of the world, or even to the divine origin of life, but, assuming or having been given some origins, more or less remote, evolutionism attempts to account for what has happened since."* [G. P. Conger, *"New Views of Evolution"*, *Page 12* ];

4. *It is better not to speak of a general evolution from lower to higher order ;*

5. *It may be regressive as well as Progressive.*

ముల పరిష్కృతిచేఁగూడ సిద్ధింపవచ్చును.[6] మఱియు నిది యాయాయంశముల సమ్మిశ్రీకరణముచేతనే గాక పృథక్కరణముచేఁగూడఁ గల్గుచున్నది. ఇంక నిది త్వరితగతిఁ గలదిగనే యుండ నగత్యమును లేదు.

[7] పరిణామ మొకే సరళరేఖవలెఁ దీర్చిన ట్లుండ నావశ్యకములేదని యంగీకరింపనియెడల నేకళయం దైనను దీనిని నిరూపించిచూపుట దుస్సాధ్యము. ఈసందర్భమున, సమప్రదేశమందుఁ బ్రశాంతముగఁ బ్రవహించుచున్న నదీగమనమువలె, మానవజీవితచరిత్ర మొదుదుడుకులు లేక యొకే గమనవైఖరితో నేకముఖముగ సాగుట లేదని మనము జ్ఞప్తియం దుంచుకొనవలెను. మానవచరిత్రము తరంగసముచ్చయసంధుక్షితము, సంక్షుభితము నగు మహాసముద్రమువంటిది. ఇట్టి దానినిఁ జిత్రించు కళలుమాత్ర మేల వృద్ధిక్షయములకు లోనగు బరిణామమును దాల్పవు? కనుక సారస్వతపరిణామ మొకే సరళరేఖవలె నుండితీరవలెననుట యాదరణీయము గాదు. సంక్షిప్తముగ నిది పరిణామ విషయము.

ఇఁక నాంధ్రుల కవితలోఁ బరిణామమును గూర్చి పరిశీలింతము. మిక్కిలి సూక్ష్మాంశముల యెడకుఁ బోవక స్థూలదృష్టినిఁ బరికించినచోఁ దెలుఁగుల కవిత్వమున నొకవిధమగు నభ్యుదయమును సూచించు పరిణామమే గలదనవచ్చును. పురాణయుగముల కవిత [8] నన్నెచోడదేవు ననుసరించి "వస్తుకవిత" యనఁదగును. కథావస్తువును బ్రధానముగఁ గలది యా కవిత. అది ప్రకృతిమధురము; వేషరచనలతోఁ బనిలేనిదియు. కాని ప్రబంధయుగము భోగవిలాసలాలసమైనది. ఆ భోగమునకుఁ ద్యాగము తోడ్పడి సాబఁగు గూర్చెను. త్యాగమన నిచ్చట కవితావస్తుపరమైనది. అలంకారికరచనము రసపుష్టికిఁ దోడ్పడునన్న విశ్వాస మా నాఁటి ప్రజ్ఞావహమైన పండితకవిమండలిలోఁ గుదురుకొనెను. అందుచేఁ గేవలవస్తుప్రాధాన్యము తగ్గి వస్తువర్ణనములు రెండును సమప్రాధాన్యముఁ దాల్చిన వనవచ్చును. లేదా ప్రబంధములలో వస్తువు క్షీణించి యల్పమైన దనవచ్చును. రసపోషకమైన యలంకారయుతరచనము వస్తుతః పతితమై, స్థౌల్యము తగ్గుటచే నుత్సాహవంతమై యుచితక్రమసిద్ధపరిణామమునే సూచించుచున్నది. నిజమున కలంకారము వస్తుప్రకాస్తి నుద్దేశించినది; కాని వస్తుగోపనమును గాదు. మఱి ప్రబంధములలో నితివృత్తము మఱుమాయమగుట కాలంకారికరచనమే హేతువన్నచో నది మన సమస్త వేదశాస్త్రాదివిషయములందువలె నాచరణములో ని లోపముగాని యుద్దేశమునందలి లోపము గాదు. ప్రబంధయుగోద్దేశము దూషితమగుటచేతనే కవితాకాంత కలంకారభారముఁ దొలఁగించు నాశయముతోఁ బ్రతిఘాతముగ భావప్రధానకవిత వెలసెను. అనఁగా నా యభిప్రాయ మిది. రసానుభూతి నొసఁగుట కవికర్మకుఁ బ్రధానాశయము కాఁగా వస్తుప్రబంధభావరచనాప్రక్రియా వైవిధ్యములచే నది సాధింపఁబడుచున్నది. రసాత్మకమగుచోఁ బ్రబంధకవితగాని, భావకవితగాని పురాణకవిత్వ మిచ్చిన యానంద మిచ్చితీరవలెను. అట్టి యాధునికకావ్యము లేవని యడిగినచో నంత సులభముగ సమాధానము చెప్పలేము. వానిని నిర్ణయించుకొనుట రసజ్ఞులగు పాఠకుల కృత్యము. [9] అవి యధికారతారతమ్యమును బట్టి యేర్పడునవి. ఇంకొక సంగతి. ఒకవిధమగు రచనాపద్ధతియందు వన్నెకెక్కిన కవి స్వల్పప్రయత్నముతో సాధారణముగ నితరములగు రెండు పద్ధతులయందును వన్నెకెక్క నవచ్చును. అందుచేతనే భవ్యకవితావేశమును గవితాశయముగ గుర్తెఱిఁగిన తిక్కనలో భావకవితారీతులు గొన్నియెడలఁ గలవనియు, నంతటి కవితాసౌందర్యవైభవ ముండియుఁ గావ్యకళాసౌందర్యముపైఁ జూపేనిఁ బఱపనీయుని భావావేగము గల పోతనామాత్యుని రచనను మించిన భావకవిత్వ మే

---

6. *Evolution may proceed either by integration or differentiation.*

7. *Unilinear.*

8. "......జంగమమల్లయవరమునందుఁ గనిన వస్తుకవిత." [కు. సంభవము.]

9. బ్రహ్మశ్రీ పింగళిలక్ష్మీకాంతము కాటూరి వేంకటేశ్వరరావుగారల 'సౌందరనంద'కృతి యాధునికాంధ్రకావ్యజగత్సామ్రాజ్యపట్టభద్రత నొందఁగలదని నా వ్యక్తిగతాభిప్రాయము.

యుండుననియు నూహింపఁగల్గుచున్నాము. రసాత్మకమగు కవితాకాంత పురాణకాలమునాఁటి యితివృత్తవపుర్విజృంభణమునందుకంటెఁ ప్రబంధకాలమునాఁటి యుచితాలంకారరచనమునం దనురక్తినెరపి, నేఁటికాలమున భావదోహలమైన దేహముతో రసదోహలమైన తన యాత్మకు నీరాజనముపట్టుచు నాత్మసాక్షాత్కృతికై సాధనముచేయుట రసస్వరూపతాత్త్వికదృష్టులచేఁగూడఁ గ్రమపరిణామమే యనఁదగును.

పిమ్మట సర్వసమ్మతత్వమునుగూర్చి చర్చింతము. సర్వసమ్మతత్వ మనఁగా సర్వగుణసమభావము. కవులుగాని, విమర్శకులుగాని యిట్టి విశాలహృదయమలవఱచికొనుట మహాప్రశస్తము. సదభిరుచియని మనమొకదానిని నిర్ణయించుట భావ్యముగాదు. ఏలయన సర్వకాలమున నొకే యభిరుచి సమ్మతముగ నుండదు. మఱియు ననేకమగు సదభిరుచులు నుండవచ్చును. మన సారస్వతములోఁ బ్రధానములగు నిట్టివానినిఁ గొన్నిటినిగుఱించి మున్ను యోజించితిమి. ఇట్టివి యనేకము లుండినప్పుడు బుద్ధిశాలియుఁ, గవిత్వతత్త్వజ్ఞుఁడును నగు విమర్శకుఁడు వ్యక్తిగతముగఁ దన కభీష్టమగు నభిరుచినిఁ గోల్పోవకయే యన్నిటిని దన విశాలదృక్పరిసరణముచే నొకేసూత్రములోనికి గుదిగూర్చి చర్చింపవచ్చును. అప్పుడు సారస్వతమునఁ బరిణామము గోచరించుచున్నది. కావున నభిరుచిలో సర్వసమ్మతత్వ మున్నచో సారస్వతపరముగఁ బరిణామసిద్ధాంతము నన్వయించుటలో వైపరీత్యము స్ఫురింపదు. ఏయభిరుచివిశేషమైననుఁ గవితాత్మయగు రసమును భోగింపవలె నను బరమావధిఁ గలదియే యని గుర్తించి వాని నన్నిటిని సమదృష్టితో విమర్శించువారికి సర్వసమ్మతత్వము కరతలామలకము.

అత్మీయ మనఁదగు నొక యభిరుచి యేదియు లేనివారి ట్లుదారులుగ నుందురనుకొనుట పొరపాటు.

---

*10. It is erroneous to think that catholicity is incompatible with discrimination*

స్వదేశాభిమానము యావజ్జగత్కల్యాణవాంఛతో విరోధింపదు. కవిగా, నభీష్టమగు నొక యభిరుచి యుండవచ్చునుగాని యెవఁడేని విమర్శకుఁడై యితరుల యనేకాభిరుచులను బరిశీలించునపుడు వానివానియందలి సామాన్యధర్మములను గ్రహించి బహుగుణముల నభినందింపవలసియుండును. అందఱు నావలె నేలయుండరా దనుకొనుట బుద్ధిజాడ్యముగాని వికాసముగాదు. భోక్తగ నాహ్వానించునపు డెప్పుడును మన మన్నహితవుదప్పిన యతని నొకని నాహ్వానింపము. సర్వాన్నములు, సమస్తపదార్థములు సహించువానినే యాహ్వానింతుముగదా! ఎవరైనను నచ్చముగ మృష్టాన్నమునే సర్వదా వాంఛించుటయు నసమంజసము. కించిదూనముగ స్వాదువులైన యితరాన్నములను, భిన్నభిన్నరుచులు గల యన్నములనుగూడ రుచిచూచుచుండుట యెల్లవిధముల మంచిది. దీనినే సారస్వతసరసాహారవిషయమున విమర్శకులు పాలింపఁదగుదురు. ఏలయన, తిక్కయజ్వ మహనీయుఁడని మనము నూరనను నిరసింపలేము. పోతన మహానుభావుఁ డగునుగాని శ్రీనాథుఁ డల్పుఁడు గాఁడు; కాసుల పురుషోత్తమకవి ధూర్జటియంతటి భక్తుఁడు గాకపోఁడు. పెద్దనార్యునకు సరసవచోగుంఫనము గల్గినంతమాత్రమున రామరాజభూషణుఁడు నిరసింపఁదగినవాఁడు గాఁడు.

ఇఁక విమర్శకు లభిరుచుల నలవఱచుకొను విషయము. 10 సర్వగుణసమభావమునకును, విమర్శనాశక్తివివక్షతలకునుఁ బొసఁగదనుకొనుట యొక యపోహ. సదసద్విషయముల, నిర్ణయించుకొను వివేకజ్ఞానముచే సర్వమతసహన మను నుదారగుణము నశింపదు. ఉత్తమ మధ్యమము లను కృతు లుండుటయు నందుచే నొకవిధముగ సమ్మతింపఁదగినదియే! ఇట్టివి లేనిచో సర్వము నొక్కటియే యై తోఁచును. కాలువలన్నిటియందలి నీరును గంగాజలమే యైనయెడల నిఁక గంగోదకమునకు గౌరవ మేమి యుండును? కాని యుత్తమగ్రంథములను బఠించుటచేతనే యుత్తమమగు నభిరుచి యలవడుననుట యొప్పదు. వివేచన చేసి సద్గుణముల నెఱుఁగుటకుఁ బూర్వము, త్రోసిపుచ్చనగు నగుణములవ నేవియో తెలిసికొనవలసియుండునుగదా? పవిత్ర

యనఁగా నమాయికత్వము గాదు. కాన విమర్శకునకుఁ గేవలము సద్గ్రంథపఠనముచేతనే యచ్ఛమగు నభిరుచి వర్ధిల్లను. చెడుఁ బరిహరించి, మంచి నవగతము చేసికొనుటకు సమదృష్టితో సమస్తగ్రంథజాలమును సహృదయులు బరిశీలించుట యావశ్యకము.

సర్వసమభావ మన నెట్టి విషయమునన్నైన గుణాగుణవివేకము లేక యంగీకరించుటకు సంసిద్ధమగుట కాదని చెప్పుకొంటిమి. ఆత్మాభీష్టముఁ గోల్పోవకయు నితరములగు శైలీవిశేషములందలి గుణముల నభినందింపఁగలుగు వివేచనసహితమగు నభిరుచిబహుత్వమే మనకు గమ్యము. [11]ఇట్టి విశాలదర్శనము గల బహుగుణగ్రహణశక్తి ప్రాచీనమగుదానిపైఁ బ్రీతిఁ గలిగి యుండియు నర్వాచీనమగుదాని నాహ్వానింపఁగలదు. దేశీయమగుదానిని బ్రేమించుచు నన్యదేశ్యమగు దానినిఁగూడ నభినందింపఁగలదు. అంతర్జాతీయతతో స్పర్ధింపని జాతీయతవంటి దీయభిరుచి; [12]స్వదేశాభిమానముతోఁబాటు జగన్మిత్రభావమునుఁ గలది. ఇతరాభిరుచులతోసహా జగద్విశాలదృష్టి గల యిట్టిదగు నభిరుచి వరణీయము. విశాలహృదయుఁడగు విమర్శకుఁ డొకే యభిరుచికి దాసుఁడగు విమర్శకునకంటె నుత్తమతరగతికిఁ జెందినవాఁడు. ఇతనికి వేదము, ఖురాను, బైబిలు మూఁడును సమములే! ఇది [13]యుదాసీనత యని కొందఱూహింతురుగాని యది పొరపాటు. [14]సులభముగ దేనినికూడ మెచ్చని సర్వవిముఖత్వముకంటె నుదారమగు సర్వసుముఖత్వము మేలైనదిగదా!

కాని [15]సూక్ష్మగ్రహణశక్తియుక్తమగు నిట్టి సర్వగుణాభినందనప్రదానబుద్ధి జనసామాన్యసాధ్యము గాదు. ఏకవిగాని, విమర్శకుఁడుగాని యుత్కృష్టమైన యీదృశసర్వసంపూర్ణసమత్వముతో జనించుటయో, లేక జన్మించినపిదప దీనినిఁ బడయుటయో బహుకష్టసాధ్యము. వారికి కాలమాహాత్మ్యము చాలవఱకుఁ దోడ్పడవలెను. తిక్కనసూరనాదియల్పసంఖ్యాకులకుఁదప్పఁ దక్కినవారికి నాత్మాభీష్టములగు నభిరుచులిట్టి యుదారగుణశక్తిసంపాదన కభ్యంతరములఁ గల్పించుచుండును. బహుగ్రంథకర్తలం దభిరుచిపరివర్తనరూపమున సర్వగుణసమాదరము పొడసూపుట కనుచుందుము. ఏకాభిరుచితో నొకేకృతిని నిర్మించిన కొందఱు కతఃపరాభిరుచు లింపుఁగొల్పక స్వపక్షదురభిమాన మొకటి బాధించుచుండును. ఆధునికయుగమున బహువిధరచనల పరముగ గ్రహింపఁదగినంతలో సర్వగుణసమ్మతత్వము బ్రహ్మశ్రీ విశ్వనాథ సత్యనారాయణగారియందు బాగుగ గోచరమగుచున్నది. ఏకైకాభిరుచితో సర్వసంపూర్ణుల మనుకొనుటకంటె సమస్తాభిరుచులను బ్రదర్శించుచుఁ గొన్నియెడల నుత్తీర్ణులము గాకపోయినను బహుకృతుల నిర్మించుటయే మన్ననఁబడయఁగలదు. సంకులసమరమునం దొక్క గాయమును దగులని శూరుఁ డెన్నినాళ్లెట్టి రీతిగ యుద్ధముచేసియుండును? "నడచుచు నుండునట్టి చరణంబులకే గద ఱాళ్ల తాఁకుడుల్" అను నార్యోక్తి సార్థకమైనది. దీనినే కవులయు, సహృదయులయు పరముగ గ్రహింపఁదగును.

సర్వమును సంక్షేపించిచెప్పినచో నతిలోభము వలెనే యభిరుచిపైనను నత్యభిమానమును దగదు. శైలీ. సౌందర్యము కొంతవఱకు చర్మగతమగు శరీరసౌందర్యమువంటిది; ధనసంపదవంటిదియు. ఈ రెండును రెక్కలు గల పక్షులు; ఎప్పుడెగిరిపోవునో యెవ్వరు నెఱుఁగఁబోరు. కాని మొత్తముమీఁద వర్ణనాలంకారదారిద్ర్యము,. నుచితానుచితవస్తువివేకరాహిత్యము, పాత్రాననుగుణశీలచిత్రణము మొదలగు ననేకదోషములు కృతుల సౌందర్యమును మాపుచున్నవి. సర్వోత్కృష్టములగు రచన లెంత కష్టసాధ్యములో యంత విరళము లవవలెను.

---

*11. A commanding and lofty Versatility*

*12. It is at once cosmopolite and Patriotic.*

*13. Indifference.*

*14. Is not catholicity better than fastidiousness ?*

*15. Widest intellectual charity with delicate perception.*

ప్రతిమహాకవియందు నేదో యొక దోష మున్నది. ప్రతిసుకవియందు నేక్వాచిత్కముగనో గుణ మున్నది. ఇందువలన నేకగుణపక్షపాతముచే దేశిమార్గవస్తుభావధర్మోపదేష్ట్రకళాసిద్ధకవితేత్యాద్యభిగుణద్వంద్వపీడితులమై యేది యుత్తమమో నిర్ణయింపలేక వివాదములఁ బెంచికొనుటకంటె సమస్తాభిరుచులను రసానుభూతిఁ బరమావధిగఁ గలవే యని గ్రహించి యెల్లరము నుదారులమగు కవులము, సహృదయులము నై యాంధ్రసరస్వత్యాపర్ణుల మగుదుము గాత మని యాశయము.



# ప్రభుసన్నిధికి

## = శ్రీ అల్లంసెట్టి అప్పయ్య =

ఎఱింగినయంతవట్టుకు నుతించి శ్రమించెనుగాని తొల్లి ని
న్నరయఁగలేదు వేదములు, నంబుజసంభవముఖ్యదేవతల్,
కర మనురక్తి నిన్గొలువఁగాదనువారలులేరుగాన, దు
ర్భరమగు నాననూన్గొనక ప్రార్థనజేసెద నల్లె యీశ్వరా!

తప్పులు కుప్పలౌ వెడగుదారుల సంసృతియాత్ర సల్పుచు
న్నప్పుడు దిద్దుచుండ సుఖమౌఁగద యెప్పటికప్పు, డట్లుగా
కిప్పు డుపేక్షసేయుచు మఱెప్పుడొ చర్యవహింపఁజూచె దీ
తప్పని కార్యముల్ సలుపఁదప్పదు నీకును నాకు నీశ్వరా!

ఏగతి నూర్ణనాభము సృజించిన తంతులు వింతవింతఁ దా
లాగుకొనుం గ్రమంబున నిలంగల యెల్లరు చోద్యమంద, నా
లాగున నచ్చిపోవు ననిలంబిది బొందెను జెందునంతకున్
రాఁగల చింతనల్ మరల రాఁగల వట్టివి చేర్చ కీశ్వరా!

అనఘ! మహాసముద్రమునయందొక కొండయు తాతిముక్కయున్
బనివడి మున్గిపోవుక్రియ; బాపురె! నీదు మహాప్రభావ వ
ర్ణనమున నెంతవారును వినమ్రత జంకుఁగలట్టివారలై
వెనుచనుచుండ నాది యవివేకము కాదు కదయ్య యీశ్వరా!

నీవు స్వయంప్రకాశుఁడవు నిత్యనిరామయ సచ్చిదాత్మకం
బై వెలుఁగొందు బ్రహ్మమ వనంతుఁడ వాద్యుఁడ వవ్యయుండ వీ
దేవులకెల్ల దేవుఁడవు దీనశరణ్యుఁడ వాదిదేవ! నన్
బ్రోవఁగడంగుమయ్య! నినుఁబోలు ప్రభుల్ కలరయ్య! యీశ్వరా!

అభ్యసనంబొనర్చితి నహర్నిశమున్ భవదీయ కీర్తనల్
లభ్యములైన తత్ఫలములన్ వినరించి యొసంగుమంటి, వా
ల్లభ్యవిశేషతన్; శుభములా యిఁక నెయ్యవి యైననేమి? త
త్సభ్యత నీపదాశ్రయవితర్దిక కేనొనఁగూర్తు నీశ్వరా!

కష్టము లంటగట్టుచు సుఖంబు లొసంగవ వెఱ్ఱివాఁడ ! నా
కష్టసుఖంబు లెన్నఁడును గైకొననట్లు, ప్రతిజ్ఞ చేసిన
ట్లిష్టములేనియట్లు నటియింతువు నేభవదీయుఁడంటి, సం
తుష్టిని గూర్చెదో విసిగి తోడ్పడకుందువొ యేమొ యీశ్వరా !
తాలిమి చీమప్రాకెడు రొదన్ వినఁజాలుదు నాదు ప్రార్థనం
బేల నిరాకరించెదు ? బలే ! యిఁక భావలు చెల్లవయ్యెఁగాఁ
బోలును నామనంబు నినుబొందఁగ జంకుచునున్న దిప్డు డిం
కేల ? యుపేక్ష, వత్సలత-యొద్దివహింతువొ రెంట నీశ్వరా !

# మేలుకొలుపు

(అనువృత్తము)

•

= శ్రీ హనుమచ్ఛాస్త్రి =

ఇతడు మా రైతు-తా నెండవానల మ్రగ్గి ఎవరికోసరమొ పండించిపోయు
ఇతడు మా కూలి-తా నెవరికో సౌధమ్ము నిలుప బండల నెత్తి నలిగిపోవు
ఇతడు మా కార్మికుం-డెవరినిమిత్తమో కాలాయసమ్ము పెకల్చి యూర్చు
ఇతడు మాజాతికి హితు-డేరికొఱకునో చెఱసాలలోన కాపురము వెట్టె
కంట తడితోడ గర్వరేఖల పెలార్చి-ఆ పరార్థజీవనుల మహత్త్వ గాథ
కింత నీయమృతసంస్పర్శ మిచ్చి యింక-కావ్యమల్లుము లేఖినీ! కదలి నీవు.

# పంజరం

కథానిక —



కథకుడు :
'అమరేంద్ర'

ఈ అంతులేని కన్నీటికడలికి దరిలేదా? ఆ ఒడ్డున ఈదుఃఖాన్నంతనీ క్షణంలో మరిపించేసే సుఖం లేదా? ఏనాడో ఆ దరికి చేరుతామనే ఆశ లేని జీవి ఉన్నదా? ఎంత కుమిలికుమిలి ఏడ్చే మనస్సులోనైనాసరే ఆ ఆశ మసకమసకగా దాగుడుమూతలాడుతూనేవుంటుంది కాబోలు! అటువంటి ఆశ లేకపోతే దుఃఖిస్తూ బతకటం ఎవరికైనా సాధ్యమౌతుందీ?

సంజెవెలుగులో, చేనుగట్టున, చెమ్మగిల్లిన కళ్లతో గడచిన జీవితంలోని పుటలను తిరగేస్తున్నాడు విశ్వేశ్వర్రావు. ఆ పన్నెండేళ్లూ అతని కన్నీటికి అడ్డులేదు. ఇంత దుఃఖంతో మ్రగ్గిపోతున్న అతని మనసులో కూడా ఆశ ఏదయినా మిణుకుమిణుకుమంటున్నదేమో! గడచిన ఘటనలని తలచుకొంటూ కుమిలిపోవటమే అతనికి తెలుసు. తనుకూడా ఒకనాడు కలలోగూడా అనుకోని సుఖాన్ని అనుభవిస్తాననీ, దరికానరాకుండావున్న తన శోకానికికూడా దూరాన ఒక తీరమున్నదనీ ఎన్నడూ అనుకోలేదు. ఇప్పుడుకూడా ఆ ఆశ లేదు. ఎప్పుడూ తను చేసిన పని తలచుకొని పరితపిస్తూఉంటాడు.

అది జరిగి పన్నెండు ఏళ్లయింది. తలుచుకుంటే ఇప్పుడు జరుగుతున్నట్లే కళ్లకి కట్టుతుంది.

అతను బస్తీనుంచి చీకటిపడినాక ఇంటికివచ్చాడు. అతని కేదో సివమెక్కినట్లుంది. పూనకం పూనినట్లుంది. ఇంట్లో అడుగు పెడుతూనే "రజనీ!" అని ఉరిమినట్లుగా అరిచాడు. ఉయ్యాలలో పడుకోబెట్టి ఉషను జోలపాడుతూ రజని నిద్రపోగొడుతోంది. భర్త అరుపు వినగానే బెదిరిపోతూ చప్పున లేచి నిలబడింది. విశ్వేశ్వర్రావుకళ్లు నిప్పులుకక్కుతున్నయ్. ఆనాడు అతనొక దావా ఓడిపోయాడు. అందువల్ల పదివేలునష్టం. ఆతీర్పు విన్నప్పటినుంచీ పిచ్చెక్కినట్లయిపోయింది. దోవంతా చికాకుతో చిందులు తొక్కుతూవచ్చాడు. ఆ చిరాకంతా రజనిమీద విరుచుకోపడుతోంది. "వచ్చారా, ఇంత ప్రొద్దుపోయిందేం?" అని రజని పలకరించింది. ఆమాట లతని చెవిని దూరలేదు. కోపంతో వణకిపోతున్న గొంతుతో "మీనాన్న బ్రతికివున్నాడా, లేదా?" అన్నాడు. రజని వెలవెలబోయింది. ఏమీ మాటపెగలలేదు. "మాట్లాడవేం? నాయింట్లోంచి బైటికి నడుస్తావా లేదా? మీనాన్న యివ్వవలసిన డబ్బు పట్టుకురా. పో. తెచ్చేదాకా నాగడప తొక్కవద్దు. ఊఁ, కదలవేం? పద బైటికి." రజనికి ఏమీ తోచలేదు. నోట్లోంచి మాటరాదు. మెడబట్టి గెంటేటట్లున్నాడు భర్త. భయంతో గజగజ వణకిపోతూ "ఉష......" అన్నది. "ఏమిటే? ఉషా? ఇద్దరూకలిసి ఊరేగండి.

నడవ్వేం బైటికి? నీకే చెప్పేది."అని కొట్టవచ్చేటట్లు మీదికి వెళ్లాడు. రజని వణికిపోతున్న చేతులతో పదినెలల పిల్లగా ఉన్న ఉషని ఎత్తుకుని బెదురుతూ బెదురుతూ వెనుదిరిగి చూస్తూ, దీనంగా ఆ చీకటి రాత్రిలో లీనమయిపోయింది. తక్కున తలుపు వేసివచ్చి విశ్వేశ్వరరావు పడకకుర్చీలో పడుకుని మామగారి మీద మనసులో మండిపడుతున్నాడు. రజనికి అత్తవారు నగలకోసం యిచ్చిన ఎనిమిదివేలూ తండ్రి వాడుకున్నాడు. ఆయనస్థితి చితికిపోయింది. అప్పటినుంచీ విశ్వేశ్వరరావు రజనిని డబ్బు తెమ్మని పీడిస్తున్నాడు. భర్తపెట్టే బాధలు పడలేక రజని పుట్టింటికి వెళ్లి తండ్రినడిగి డబ్బుపట్టుకురాద్దామని బయలుదేరేది. అక్కడికి వెళ్లి తన తండ్రి పడుతున్న కష్టాలన్నీ కళ్లతో చూసి, అడగటానికి నోరు రాక తిరిగివచ్చేది. రజని పడుతున్న బాధ తండ్రికి తెలియకపోలేదు. కాని అంతడబ్బు తేల్చగల శక్తి లేక దినదినమూ క్షోభపడేవాడు. తల తాకట్టుపెట్టి అయినాసరే రజనిబాధలు గట్టెక్కించాలని నిశ్చయించుకున్నాడు. ఈసారి రజని తండ్రిగొంతుమీద కూర్చొని డబ్బు పట్టుకువస్తుందని విశ్వేశ్వరరావు లోలోపల ఆశపడుతున్నాడు. నెల గడిచింది. రెండు నెలలు తిరిగినయ్. కాని రజనిజాడ లేదు. నాడు కోపంలో ఉషని ఇంట్లోంచి వెళ్లగొట్టినప్పటికీ కోపం చల్లారటంతోటే మనసంతా ఉషమీదనే వుంటోంది. తాతగారింట్లో తప్పటడుగులు వేస్తూంది. ముద్దుమాటలు మాట్లాడుతోంది. 'అమ్మ' 'నాన్న' అంటోంది. ఉంగరాలుతిరిగిన జుట్టుతో కిలకిల నవ్వుతోంది. ఎన్నోవిధాల ఊహించుకొనేవాడు. పోనీ రజనిని రమ్మని రాద్దామా అని అనుకుంటూండగానే మామగారిమీద కోపం పడగఎత్తి ఒద్దని బుసకొట్టేది. తనయింటికి తాను రావాలని రజనికి తెలియదా? ఎన్నాళ్లు కూచుంటుంది పుట్టింట్లో? తండ్రిని తొందరచేసి, డబ్బు పుచ్చుకొని ఈపాటికే వచ్చివేయరాదూ? ఇన్నాళ్లూ రజని ఎందుకు ఉత్తరం వ్రాయక పోవాలి?

మూడు నెలలయినాక ఒకనాడు విశ్వేశ్వరరావు నిద్రలేవకముందే తలుపు ఎవరో కొట్టారు. తీసేసరికి మామగారు ఎదురుగా కనుపించాడు. విశ్వేశ్వరరావు మాట్లాడలేదు. లోపలికి రమ్మనలేదు. ఆయనే లోపలికివచ్చి, సంచీవొంకకి తగిలించి చేతులోంచి



"ఊం. కదలవేం? పద, బైటికి."

నోట్లకట్ట బైటికి తీస్తూ "అమ్మాయీ, రజనీ" అని పిలిచాడు. శూన్యంగా ఉన్న యిల్లంతా ఆపిలుపుతో గింగురుమన్నది. ఆపిలుపు వినగానే విశ్వేశ్వర్రావుకి వెఱ్ఱెత్తినట్లయింది. ఇదేమిటి, రజని పుట్టింట్లో ఉంటే తండ్రి ఇక్కడికివచ్చి కూతురుని పిలుస్తాడేమిటి? మామగారు అడిగారు: "అమ్మాయి ఎక్కడికివెళ్లింది?" విశ్వేశ్వర్రావు ముఖంలో నెత్తురుచుక్క లేదు. తత్తరపాటుతో గుండె వణికిపోతూంది. "అక్కడికి రాలేదూ?" మామగారు "లేదు. రాలేదు. ఎప్పుడు బయలుదేరింది?" విశ్వేశ్వర్రావు ఎల్లాగో పెగుల్చుకుని "మూడునెలలయింది." అనగానే మామగారు కుప్పగా కూలిపోయాడు. ఆయనచేతిలోంచి నోట్లకట్ట జారి విశ్వేశ్వర్రావుకాళ్లముందు పడింది. అతని కళ్ళని తొలుచుకొంటూ ఒక్కసారిగా నీళ్లుబికినై.

అప్పటినుంచీ విశ్వేశ్వర్రావు రజనికోసమూ, ఉమకోసమూ మూలమూలలా గాలించి నిరాశచెంది జీవితమంతా దుఃఖంతోనే గడుపుతున్నాడు. రజని ఏమయిపోయింది? ఉమ ఏమయిపోయింది? ఇక వాళ్లిద్దరినీ ఈ జన్మలో చూడగలడా? ఎన్నటికైనా తనదుఃఖానికి ఉపశాంతి ఉన్నదా? కన్నీళ్లకి తన పాపాన్ని కడిగివేసే శక్తి వున్నదా?

చేనుగట్టున చతికిలపడి పరిపరివిధాల పరితపిస్తున్నాడు. పక్కనే వాగు చకచకా పరుగులు తీస్తోంది. అస్తమయసమయంలోని వింతవెలుగులు ఆవాగు అలలమీద గంతులువేస్తున్నయ్. ఆకాశమంతా ప్రశాంతంగా ఉన్నది. పడమటి దిక్కున, చెదరిన మబ్బులు, నెత్తురుతో తడిసి ఓడిపోయిన సైనికునిలాగా కదలకండా పడిఉన్నయ్. ఏదో భీకరమైన యుద్ధం జరిగిన తరువాత ఆవరించే ప్రశాంతి ఆ పడమటి కొండలో కనపడుతోంది. గడచిపోయిన కాలంనుంచి దూసుకువచ్చిన ఊహలలాగా చలిగాలి గజగజలాడిస్తోంది. మీదున్న ఉత్తరీయాన్ని ఒళ్లంతా కప్పుకుంటూ విశ్వేశ్వర్రావు గట్టుమీద కూర్చున్నాడు. ఎదురుగా చేనుగట్టున రావిచెట్టుక్రిందున్న లంబాడీ గుడిసెకేసి రెప్పవాల్చకుండా చూస్తున్నాడు.

గొఱ్ఱెలమందలు చేలో అటూ ఇటూ కదులుతూ, ఉండిఉండి వెఱ్ఱిఅరుపులు అరుస్తున్నయ్. మధ్యమధ్య నిలబడి నాయకుడికొడుకు వాటిని అదిలిస్తున్నాడు.

రావిచెట్టుకింద పొయ్యి రగులుతోంది. కుండ కుతకుత ఉడుకుతోంది. చలికి తాళలేక లంబాడీల కుక్క పొయ్యిరాళ్ల కానుకొని, కాళ్లు జాపి తోకాడిస్తూ పడుకుంది. వాళ్ల భాషలో మాట్లాడుకుంటూ పిల్లలు గుడిశెబైట ఆటఆడుతున్నారు. నాయకుడి భార్య పొయ్యిఊదుతోంది. నాయకుడు పొయ్యి దగ్గిరే కూర్చుని చలికాచుకొంటున్నాడు.

దగ్గరే పెద్ద చలిమంట భగభగ మండుతోంది. ఆ మంటచుట్టూ, చుట్టుపక్కచేలల్లో కాపలాఉన్న లంబాడీపడుచులంతా వచ్చి, ఏదో పాటపాడుతూ గుండ్రంగా తిరగటం మొదలుపెట్టారు. పడుచులంతా చరణం అందుకొని పాడుతున్నారు. పాడుతూ అడుగువేస్తున్నారు. ఆ అడుగుల్లో వాళ్ల కాలిఅందెల ఝుణఝుణ, వాళ్ల దంతపుగాజుల ఘులఘుల, వాళ్ల మెళ్లో వేసుకున్న పావలాదండల కలకల, వాళ్ల ముంగురులకు వ్రేలాడే గవ్వల ఝులఝులా ఒక్కసారిగా కలిసి వినపడుతున్నయ్. చిందులువేసే వాళ్ల రూపాలు చిరుగాలిలో అందంగా కదిలే పూలతీగెలలా వున్నయ్. చురుకుగా వాళ్ల చేతులు అటూ యిటూ సందడితో కదిలి, వాళ్ల ముఖాలమీదినుంచి దూసుకుంటూ పైకి పోతయ్. అక్కడ వాళ్ల చేతివేళ్లు వింతరీతులతో వికసించే పూవుల రెక్కల్లాగా విప్పారుతయ్! పాడుతూ ఆడుతూ గిరగిర తిరిగేటప్పుడు ఆ మంటవెలుగులో ఒకొక్కముఖం ఒకొక్కసారి మెరుస్తూంది. రెప్పవాల్చకుండా చూస్తూన్న విశ్వేశ్వర్రావు చకితుడైపోయాడు. చలిమంటవెలుతురులో ఆగానుకున్న అద్దాలొక్కసారి తళుక్కుమన్నయ్. గవ్వలబరువుతో వ్రేలాడే ముంగురుల మధ్య ఆ లేతముఖమొక్కసారి ధగధగమన్నది. ఆవెలుతురులో ఆ విప్పారిన కళ్లలో ఒక [illegible] సిన కాంతి, ఆ లేత పెదవులమీ[illegible] కాని చిరునవ్వు.

ఎవరది? ఎవరది? తన పశ్చాత్తాపమే ఆ భగభగమనే చలిమంటయేమో! ఆమంటలోనుంచి తొంగి చూచిన ఆముఖ మెవరిదో? రజనిదా? ఉమదా? కాదు, కాదు. భ్రాంతి. ఆపన్నెండేళ్లు ఇంకా రజని బ్రతికివుండటమేనా? ఇంకా ఉమని మాచే భాగ్యం తనవంటి నీచుని కుందా? అంతా వెఱ్ఱి. తనకు మిగిలిన దొక్కటే దుఃఖమే.

అయినా ఆ ముఖాన్ని చూడగానే తనలో అటువంటి సంచలన మెందుకు కలగాలి? తన పశ్చాత్తాపాన్ని చూచి విధికి జాలికలిగి తన భార్యనీ, బిడ్డనీ తనకి తిరిగి ఇస్తుందా? ఎన్నటికీ జరగదు. జరిగినదాన్ని వెనక్కి మరల్చటానికి ఎవరికీ తరంకాదు.

అయితే ఆ పాలుగారే ముఖమూ, ఆ సోగ కళ్లూ, ఆ నల్లటి ముంగురులూ, ఆ లేతపెదవులమీది చిరునవ్వూ తనమనస్సునకు పరిచితంగా ఎందుకు తోచాలి? అటువంటి ముఖం తా నిదివర కెప్పుడైనా చూశాడా? ఆముఖం తన కెప్పుడైనా కలలోకనబడిందా? ఆముఖంతో తనకి పూర్వజన్మలో బాంధవ్య మేమైనా వుందా?

ఏమో? ఎంత చూసినా తనివితీరదు. ఆ ముఖాన్ని తన మనసులో చెరిగిపోని రంగులలో చిత్రించుకుని దాన్ని నిత్యమూ కన్నీటితో పూజించాలి. ఆ ముఖాన్ని తన ప్రాణంలో లీనంచేసి తన దుఃఖంలో ఆ స్మృతికి ఆలయం కట్టాలి.

ఇంతలో గొల్లున ఏడుపు. ఆటపాటలు చాలించి అంతా గుడిశెదగ్గిర గుమిగూడారు. చంక నో పెద్దమూటతో ఒక ముసలమ్మ వచ్చింది. వచ్చీరావటంతోనే ఆముసలమ్మ నొక పిల్ల చేతులతో చుట్టివేసింది. వణుకుతున్న చేతుల్తో ఆపిల్లని ముసలమ్మ గట్టిగా కౌగిలించుకున్నది. ఇద్దరూ గొల్లుమన్నారు. చుట్టూ ఉన్నవాళ్ళంతా ఒక్కసారి గొల్లుమన్నారు.

ఈధ్వని విని విశ్వేశ్వర్రావు తన ఊహల్లోంచి ఒక్కసారి మేల్కొన్నాడు. "నాయకా! ఏమిటాగోల?" అని అరిచాడు. నాయకుడు పరుగెత్తుకుంటూ వచ్చి "ఏంలేదు బాబుగారూ, మాఅక్క ముసిల్దీ శావరోజులికి మాకు కనిపించిందండి." విశ్వేశ్వర్రావు విస్తుపోతూ "ఏమిటీ, తిరిగి కలుసుకొంటే ఏడవటమెందుకురా? సంతోషపడాలిగాని —" నాయకుడు "అది మా కులాశారం బాబుగారూ! ఒక్క ముఠాలో వాళ్లం విడిపోతే మళ్లీ ఈ జనమకి తిరిగి కలుసుకోలేం బాబుగారూ. దేముడిదయవల్ల తిరిగి కలిశామో ఆసంబరం పట్టలేక మేము గొల్లున ఏడుస్తాం బాబుగారూ!" అన్నాడు. సంతోషానికీ, సంతాపానికీ ఎంత దగ్గిర సంబంధమో విశ్వేశ్వర్రావుకి అప్పుడు తెలిసింది. అక్కడినుంచి లేచి ఇంటిదోవ పట్టాడు. కాని ఆ ముఖం అతన్ని విడవదు. ఆ ముఖమే అతని ప్రాణం మూలమూలలా అల్లుకుపోతూంది. ఆ ముఖమే అతని అణువణువులోనూ నిండిపోతూంది. ఏమిటి వింత?

## ౨

ప్రతిసాయంకాలమూ విశ్వేశ్వర్రావు పొలానికి వెళ్లేవాడు. ఆ ముఖం కంటబడంగానే అతని దుఃఖం చల్లారినట్లయేది. ఏదో చెప్పలేని సుఖం వచ్చి అతని మనసులో చిందు వేసేది.

రాత్రి ఎంతసేపటికీ నిద్రపట్టలేదు. ఎదురుగా ఉమకి ఆరోనెలన తల్లీ, కూతురూ కలిసి దిగిన ఫోటో గోడకి వ్రేలాడుతోంది. ఏమో, కాకూడదూ? ఎన్ని వింతలీ ప్రపంచంలో సంభవంకావటంలేదు? "ఛీ! ఎందుకీ భ్రాంతి? ఎండమావి నెందుకు వెన్నంటుతావు? చేసిన పాపానికి జన్మాంతమూ దుఃఖంతో క్రుగ్గిపోవటమే నీకు శిక్ష. నీవంటి పాపిమీద విధి ఎన్నడూ దయతలచదు" అని అతనిమనస్సే విశ్వేశ్వర్రావుని నిందించేది. తన వెఱ్ఱిఆశకి తానే సిగ్గిలి బరువెక్కిన గుండెతో కన్నుమూశాడు.

తెల్లవారింది. ఎన్నాళ్లీముసుగులో గుద్దులాట? ఒక్కసారి అడిగితే తేలిపోదా? కాని అడగటానికి ఎల్లా నోరువస్తుంది? తనకి పిచ్చిఎక్కిందనుకోరా వాళ్లు?

బారెడుపొద్దెక్కింది. వాకిట్లోంచి "బాబూ" అని పిలుపు వినిపించింది. అతని మనస్సులో ఆ పిలుపు వింతగా మోగింది. ఏ పూర్వజన్మలోనో విన్నట్లుంది ఆ స్వరం. ఇంకొక లోకంనుంచి రజని పిలిచినట్లున్నది

ఆధ్వని. వచ్చి చూశాడు. తనివితీరేదాకా రెప్పవాల్చ కుండా చూశాడు. ఆ కనుబొమలు ఒకదానితో ఒకటి కలుసుకోబోతున్నట్లు, ఒక నల్లటి నెలవంక వాటిని రెంటినీ కలుపుతున్నట్లు, నొక్కుల నొక్కుల జుట్టూ, చక్కని ముక్కూ, విశాలమైన నుదురూ, అద్దంలాగా ఉన్న ముఖమూ, గంతులేసే ముంగురులూ - ఎన్నిసార్లు చూసినా ఇంకా చూడాలనిపిస్తోంది. విశ్వేశ్వరరావుకి నోట మాటరావడంలేదు. ఆ చూపునుంచి తప్పుకోవాలని ఆ లంబాడీపిల్ల ముసుగు తలమీదికి లాక్కున్నది. ఆ చూపువెనక దాగిన హృదయంలో ఏ భావాలు వెల్లువలై పొంగుతున్నవో ఆ పిల్ల కేం తెలుసు? తను ఆ హృదయంలో ఎంత కలవరాన్ని మేలుకొలిపిందో ఆ చిన్నగుండె కేంతెలుసు ?

"బాబుగారూ! మా మామ గింజలు కొలుచుకు రమ్మని పంపాడు." అంది ఆ పిల్ల విశ్వేశ్వరరావు వాకిట్లో విరియబూసిన ఎఱ్ఱమందారపూలకేసి చూస్తూ. విశ్వేశ్వరరావు ఎంతో ప్రయత్నంమీద "నీ పేరేమిటి పిల్లా?" అని అడిగాడు. ఇందాకటి సిగ్గు విడిచేసి చెప్పింది: "సోనీ." విశ్వేశ్వరరావు సోనీని చూస్తూ మందారపూలు ఒక్కొక్కటే కోస్తున్నాడు. పువ్వులంటే వుండే మోజు పన్నెండేళ్ల పిల్లలకే తెలుసు. ఆ పూలన్నీ కోసితెచ్చి సోనీ కిచ్చేసరికి ఆమెముఖం ఒక్కసారిగా విప్పారింది. ఆ సంతోషాన్ని చూసే సరికి విశ్వేశ్వరరావు గుండెమీది బరువు ఒక్కసారిగా మాయమైపోయింది. ఆ పూలన్నీ పట్టినన్ని జడలో పెట్టుకుని, కొన్ని కొంగున మూటకట్టుకుంటూ సోనీ మురిసిపోతోంది. ఆ అమాయకమైన ఆనందాన్ని చూసి విశ్వేశ్వరరావుగుండె కరిగిపోతూంది. ఆ పిల్ల గింజలమాట మరిచిపోలేదు. మళ్లీ అడిగింది. అతను బదులుచెప్పాడు: "నువ్వు పోయిరావమ్మా. మీమామని పంపు."

గోనెలు పుచ్చుకుని లంబాడీ, నాయకుడూ, రాత్రివచ్చిన ముసిలిదీ వచ్చారు. అప్పటికి ఏమయినా సరే వాళ్లని అడిగితెలుసుకోవాలని విశ్వేశ్వరరావు నిశ్చయించుకున్నాడు. కాని ఏ విధంగా ఆ ప్రస్తావన తీసికోరావాలో, ఏ విధంగా వాళ్లని ప్రశ్న వేయాలో పాలుపోవటంలేదు.

"సోనీ రాలేదేం మీతో?"

"గుడిశెకాడ మందల్ని మళ్లేస్తోంది బాబూ. అదీ, మాకుట్టోడూ చేలో మందల్ని కాస్తారు." అన్నాడు నాయకుడు. "అల్లిద్దరూ పిలకాగోరిం కల్లాగా కూలసగుంటారు. ఆకలిగూడా ఎరగకుండా మందల్ని కాస్తారు."అని ముసిల్ది అడగనిసోది ఏకరువు పెట్టింది.

"సోనీకి ఎన్నోయేడు ?"

"పదకొండుంటయ్ బాబూ"అన్నాడు నాయకుడు. "కాదు బాబూ, పన్నెండుంటయ్. ఊహుఁ, పదమూడు బాబూ. అప్పటికే నెలలపిల్ల అది."అంది ముసలమ్మ. ఇది వినేసరికి విశ్వేశ్వరరావుమనస్సు ఒక్కగంతేసింది. గభాలున ఇంట్లోకి వెళ్లి గోడకి వున్న రజనిఫోటో తీసుకువచ్చాడు. కళ్లకి దగ్గరగా పెట్టుకుని, గవ్వలబరువుకి ముఖాన కళ్లకడ్డుపడుతున్న జుట్టు ఎగదోసుకుంటూ ముసలిది పరీక్షగాచూసి "నాయకో, సోనీలాగుందే, ఈబొమ్మ చూసి దాన్ని చూడక్కర్లే."అంది. నాయకుడుకూడా పరకాయించి చూచి, "బాబూ, సోనీబొమ్మ ఎప్పుడెత్తించారు?" అని అడిగాడు.

ఏమి చెప్పాలో తెలియలేదు. తను పన్నెండేళ్లక్రిందట ఆనాటిరాత్రి చేసిన దురాగతమంతా వాళ్లకి చెప్పటానికి నోరాడలేదు. చివరికి అడిగాడు:

"మీసోనీ ఏఊళ్లో పుట్టింది?"

నాయకుడు మాట్లాడటానికి జంకుతున్నాడు. ముసలమ్మ అందుకుని, "మాకు గింజలు కొలిచి పంపెయ్యండి బాబుగారూ"అన్నది.

"అల్లాగేకొలుస్తాను. కాని సోనీనిగురించి కొన్ని సంగతులు అడుగుతాను. చెబుతావా ?"

"జరిగిపోయినవాటి ఊసు దేనికి బాబుగారూ ?"

"అల్లాగనకు. చెప్పితీరాలి. నిజం చెప్పు. నీకు పెద్ద బహుమతిస్తా"నని ఆశపెట్టాడు.

తన గౌనుజేబులోనుంచి ఒక చిన్న చొక్కా బైటికి తీసింది. అది నల్లటి సిల్కుగౌను. మెడదగ్గర బంగారపురంగుదారంతో రెండుఅక్షరాలు కుట్టి ఉన్నయ్. అవును ఆపేరే! ఉమ. ఉషే! అది రజని తన చేత్తో కుట్టినదే. గతమంతా విరుచుకుని ఒక్కసారి విశ్వేశ్వర్రావుమీద పడినట్లయింది. ఆబరువు కింద అణగారిపోతున్నాడు. ఆరాత్రి ఉమ ఒంటి నున్నది ఆ నల్లసిల్కుగౌనే.

అతని ఒళ్లు జలదరించిపోతూంది. పూసగుచ్చినట్లు, ఎంతో నేర్పుతో ఆ లంబాడీ ముసలిది గడచిన విషయాలన్నీ చెప్పుకుపోతూంది.

తాను రజనిని ఇంట్లోంచి తరిమివేసిన రాత్రి. ఇంతవరకూ నస్తుందని విశ్వేశ్వర్రావు కలలో కూడా అనుకోలేదు. దావాఓడిన చికాకూ, మామగారు ఈయవలసిన బాకీ రాలేదన్న కోపమూ నాటిరాత్రి రజని మీదుగా వెళ్లిపోయింది. తనకోపానికి ఇంత దారుణమైన పర్యవసాన ముంటుందని అతను లేశమైనా ఊహించలేకపోయాడు. మనిషికి తను చేసే పనులకి ఏవిధమైన ఫలితం రాబోతోందో తెలుసుకొనే శక్తి తెగినంతగా సృష్టికర్త యివ్వలేదు. ఆ దూరపు చూపు గనక మనిషి చేతుల్లో వుంటే అతను ఎన్ని పనులనో ముందుగానే చేయకుండా ఉండగలిగేవాడు.

ఆనాడు మూటా ముల్లే అన్నీ సర్దివేసుకొని కోడికూయకముందే ఆఊరినుంచి డేరా ఎత్తివేద్దామనుకున్నారు లంబాడీలు. రాత్రి బాగా పొద్దుపోయింది. అందరూ నిద్రపోతున్నారు. ఎక్కడినుంచో గుక్కపట్టి ఏడుస్తున్నట్లు ఏడుపు వినపడసాగింది. ముసలమ్మ కలతనిద్రలో అటూ యిటూ కొట్టుకుంటూ ఆ ఏడుపు విని అమాంతం లేచింది. తమ ముఠాలో పిల్లలంతా గుట్టుకొట్టి నిద్రపోతున్నారు. మరి ఎక్కడిదీఏడుపు? ఇంకా బిగ్గరగా వినబడుతోంది. ఏడుపు వినబడుతున్న వేపుకు ముసలమ్మ గబగబా అడుగు వేసింది. నడిచి వాగుఒడ్డుకు వచ్చింది. వరదవచ్చి వాగు గట్లని పడదోసుకుంటూ పరవడి తొక్కుతూంది. గట్టున మంచుకి తడిసిపోయి మోకాటిదాకా పెరిగిన పచ్చగడ్డి కాళ్లకితాకి కొంకర్లుపోతున్నది ఒళ్లు. తెల్లటి మబ్బుల్లోంచి గుడ్డివెన్నెల జారుతూ తడిసి మంచు ముత్యాలతో మెరుస్తున్న రెల్లుపూలతో ఆటలాడుతోంది. కాలికేదో తక్కున తాకింది. నేలమీద ఉన్న మైలురాయి! ఆ మైలురాతిమీద పడుకొని పసిపిల్ల పోరుపెట్టి ఏడుస్తోంది. పచ్చటి ముఖమూ, నల్లటి జుట్టూ, అంతకన్నా నల్లటి గౌనూ ఆవెన్నెట్లో ముసలమ్మమనసుని అమాంతంగా గుంజివేసుకున్నయ్. వెంటనే వొణుకుతున్న చేతుల్తో ఆపిల్ల నెత్తి గుండెలకదుముకున్నది. దిక్కుతెలియని ఆ పిల్లని లేవద్దని ఎందరు వారించినా వినలేదు. పిల్లలులేని తన కోసమే ఈ పిల్లను దేవుడే ఆ రాత్రివేళ అక్కడ పడవేసివెళ్లాడనుకొంది. పిల్లని నడుముకి కట్టుకుని కోడికూయక ముందే ఆ ఊరునుంచి వెళ్లిపోయింది. అప్పటినుంచి పిల్లని డొక్కలో పెట్టుకుని పెంచింది. సోనీ అని పేరుపెట్టుకుంది. ఇది పన్నెండేళ్లనాటి మాట. ఈ పన్నెండేళ్లూ ఆ ముఠావాళ్లు విశ్వేశ్వర్రావువున్న ఊరు రాలేదు. ఈ ఏడే రావటం.

ఇక ఆపుకోలేకపోయాడు. కట్టతెగిన కన్నీళ్లు ఒక్కసారిగా ఉబికివచ్చినయ్. లోలోపల విధిని ఎంతో పొగడుతున్నాడు. ఉమనైనా తనకు మిగిల్చినందుకు! బిడ్డదొరికిన ఆనందంతోపాటు బంగారంవంటి భార్యచావుకి కారణమైనందుకు సంతాపంకూడా మితిమీరిపోయింది. తన పాపానికి ఫలితంగా విధి రజని ప్రాణాన్ని దొంగిలించి శిక్షించింది. రజనితోపాటు ఉమనుకూడా అపహరిస్తే ఎంత దుర్భరమైనశిక్ష అయేదీ! ఏమో విధికికూడా కనికర మున్నదేమో? తన పశ్చాత్తాపాన్ని చూసి జాలిపడి ఉమని మళ్లీ తనకు దక్కించిందేమో?

## 3

"ఉషా! రా తల్లీ. ఇన్నాళ్లూ, ఎందుకు బతకాలో తెలియకుండా వుండేది. ఇప్పుడు తెలిసింది. ఇప్పుడు తెలిసింది, ఇన్నాళ్లూ, ఏ మిణుకుమనే ఆశతో ఏడుస్తూ కాలంగడిపానో. ఇప్పుడు తెలిసింది ఇకముందు ఎందుకోసం నే నీలోకంలో బతకాలో!"

వచ్చేసింది సోనీ విశ్వేశ్వర్రావుయింటికి. ఈ పన్నెండేళ్లూ చీకటితో బావురుమంటున్న అతని యింట్లోకి ఉషస్సే తొంగిచూచినట్లు. రాగానే విశ్వేశ్వర్రావు సోనీకి రకరకాల చీరెలు, వింతవింత అలంకరణాలు కొనితెచ్చియిచ్చాడు. ఇదంతా చూస్తుంటే సోనీకి ఉక్కిరిబిక్కిరయినట్లుంది. రంగురంగుల ముతకలంబాడీ గుడ్డలు విప్పి, చీరె కట్టుకోబోతున్నప్పుడు గుండె చివుక్కుమన్నది. ఇన్నాళ్లనుంచి ఉంటున్న గూటిని అమాంతం విడిచివచ్చినట్లు మనస్సు కలవరపడుతోంది. చీరె కట్టుకుని నగలుపెట్టుకొని ముంగురులకి వేలాడే గవ్వల నూడదీసి తల దువ్వుకొని ఎదురుగా వున్న అద్దంలోకి చూసి ఏదో ఒక కొత్తలోకంలో తెలియకుండా వచ్చిపడ్డట్లు బెదిరిపోయింది. గోనెలలాగా వున్న బట్టలు మోయటానికి అలవడిన ఆ శరీరానికి నాజూకుగావున్న ఈ ఉలిపిరిబట్టలు తొడుక్కున్నా మీద గుడ్డఉన్నట్లే అనిపించటంలేదు. దిసిమొలతో ఉన్నంత సిగ్గుగాఉంది. తను మునుపటిమాదిరిగా లంబాడీగానే వుంటే ఎంతబాగుండేది? ఆ పొలాలలో పిట్టలాగా ఎగిరిపోతూ, గొర్రెలమందలు-కాస్తూ పాటలుపాడుతూ చిందులుతొక్కుతూంటే ఎంత బాగుండేది? ఇన్నాళ్లనుంచి డొక్కలో దూరి నిద్రపోయిన ముసిలిలంబాడీని వదిలేసి ముక్కూ ముఖం ఎరగని ఈ మనిషిదగ్గరకి రావట మెందుకు? ఈ మనిషి తన తండ్రి అని చెప్పినమాత్రాన నమ్మట మెట్లా?

విశ్వేశ్వర్రావు పొంగిపోతున్నాడు. సోనీ ఉషగా వచ్చి ఇంట్లో వాలినందుకు. లంబాడీపిల్లలాగా పెరిగిన తన కూతురుని అమాంతంగా ఒక అతినాగరికమైన బాలికగా చేసివేయాలని ఎంతో ఆరాటపడుతున్నాడు. ఈ ఆరాటంతో అతనికి సోనీమనసులోకి తొంగిచూసే తీరిక దొరకలేదు. ఆ లేతగుండె ఏయే ఊహాలతో, ఏయే ఆలోచనలతో కలతపడుతోందో? ఇన్నాళ్లూ ఆరుబైట, పచ్చటిపొలాలనడుమ పెరిగి పెద్దదయిన ఆ పిల్ల తన ఇంటి నాలుగుగోడలమధ్యా ఎంత గిజగిజ తన్నుకుంటోందో?

దినాలు గడిచిపోతున్నయ్. ఆ పల్లెటూరునుంచి దూరంగా వెళ్లిపోయి, తన కూతురిని పూర్వవృత్తాంతం తెలియని చోటికి చేర్చి, అక్కడ చక్కని పాటలూ చదువూ నేర్పించి మంచిసంబంధం వెదికి ఒక ఇంటిదాన్ని చేసి, అల్లుణ్ణీ కూతుర్నీ చూసుకుంటూ ముచ్చటగా, సుఖంగా కాలం గడుపుతాను. ఇన్ని కష్టాలలోనూ, ఇంత దుఃఖంతోనూ, ఏ సుఖంకోసం బతికివున్నానో దాన్ని సంపూర్ణంగా అనుభవిస్తాను. ...ఇటువంటి ఊహ లతని మనస్సులో గూడుకట్టుకోసాగినయ్. కాని ఎంత ప్రయత్నించినా ఉష తనతో చనువుగా మెలగదు. ఆమెచుట్టూ అతని మనసు పాకిపోతోంది. అయినా ఆమెమాత్రం దూరంగానే నిలబడుతుంది. ఇంకా "బాబూ" అంటుంది. ఎంత చెప్పినా "నాన్నా" అని నోరారా పిలవదు. "సోనీ" అంటే ఒక్కసారికే పలుకుతుంది. "ఉషా" అని పది సార్లు పిలిచినా మారుపలకదు. లంబాడీగుడిశెలో వున్నప్పుడు ఆమెముఖాన చిందులాడిన ఆనందం ఇప్పుడు మాయమైపోయింది. ఆమెమనసులో ఏదో బాధ వున్నదన్న సంగతి అద్దంలాగున్న ఆమెముఖంలో కనపడుతోంది.

ఏమిటి ఆ బాధ? తన అడుగు కిందమోపితే అరిగిపోతుందేమోననుకునే తండ్రిదివాణమంత ఇల్లు, కావలసినంత ఆస్తి, మోయలేనన్ని నగలు-ఇన్ని వున్నప్పటికీ బాధ ఎందుకో! పొలాలలో పలిటీలుకొట్టిన రామచిలుకను పంజరంలో పెట్టి పాలుపోసినా, పళ్లు పెట్టినా, ఏం చేసినా సరే చాలాదినాలవరకూ రెక్కలతోనూ, ముక్కుతోనూ, గోళ్లతోనూ పంజరం చువ్వలని తపతప కొడుతూనేవుంటుంది. సందుదొరికిత్తే చివ్వున పారిపోదామని తహతహపడుతుంది. పంజరంలో సుఖం లేదా? నీలిమబ్బులలోనూ చిగిరించిన తోటలలోనూ, పొంగే వాగులలోనూ మెలిగిన ఆ చిలకకిమాత్రమే సోనీబాధ అర్థమౌతుంది. సోనీకి ఆ చిలకబాధలో తన బాధకూడా కనబడుతుంది.

తను తప్పటడుగులువేస్తూ వచ్చీరాని మాటలతో "మా" అంటూ లంబాడీముదుసలిచుట్టూ తిరిగింది. అది కంటికి రెప్పలాగా కాపాడింది. చిన్నప్పటి నుంచీ, తన ఈడూ జోడూ అయిన నాయకుడి పెద్ద కొడుకుతో పొలాలగట్లమీద గంతులేసింది. ఒకళ్ల

నాకళ్లు క్షణం విడిచిపెట్టకుండా వుండేవాళ్లు. ఇద్దరూ గొర్రెలమందల నదిలిస్తూ దినమంతా కలిసి తిరిగేవాళ్లు. పచ్చటిపొలాలమధ్య, నీలిమబ్బులనీడల్లో, ఇద్దరూ, రెక్కలకొద్దీ గిరికీలు కొట్టే పిట్టలజంటలాగా ఎగిరి పోయేవాళ్లు. నాయకుడి కొడుకు అన్నం తింటేకాని సోనీకి ముద్ద గొంతుకుదిగేదికాదు. ఎండలో, వానలో ఎడబాయకుండా ఊరూరూ తిరిగిన వాళ్లిద్దరికీ చిన్న తనంనుంచీ గాఢమైన స్నేహం. చిన్ననాయకుడు చేలో పెంట జిమ్ముతుంటే సోనీ వెంటవుండి గొర్రెలని తోలేది. నాయకుడు మందల్ని మల్లేసేప్పుడు సోనీ గొర్రెల్ని బెదరగొట్టి చెల్లాచెదరుచేసి వాటిని వాడు ఒకచోటికి తేలేక తిప్పలుపడటం చూస్తూ కిలకిల నవ్వేది. గొర్రెల బొచ్చు కత్తెరతో చెట్టునీడన సోనీ కత్తిరిస్తుంటే నాయకుడి కొడుకు మోటారువోరను కూత కూసేవాడు. గొర్రె సోనీచేతి కందకుండా బెదరి పారిపోవటం, సోనీ దాన్ని పట్టుకోబోవటం చూసి కేరింతలుకొడుతూ సంబరపడేవాడు. ఇల్లా వాళ్లిద్దరి మనసులూ పెనవేసుకుపోయినయ్.

సోనీ వెళ్లిపోయిననాడే ముసిలిలంబాడీ ముద్ద నోటపెట్టక మంచమెక్కింది. చిన్ననాయకుడు పిచ్చి వాడిలాగా అయిపోయాడు. చేసే పనిమీద యావ పోయింది. కదిలిస్తే ఎందుకో కళ్లనీళ్లు వస్తున్నయ్. రెక్కలు విరిగిపోయినట్లయింది.

సాయంకాలం ఉమనికూడా వెంటబెట్టుకొని విశ్వేశ్వర్రావు షికారుగా లంబాడీలగుడిశెలవైపు వెళ్లాడు. కొత్తవేషంతో వున్న సోనీకేసి అంతా కళ్లప్పగించి చూస్తున్నారు. ముసిలిలంబాడీ మెల్లిగా లేచివచ్చి సోనీ నొక్కసారి గట్టిగా కౌగిలించుకుంది. అమాంతం యిద్దరూ వెక్కివెక్కి యేడవటం మొదలు పెట్టారు. విశ్వేశ్వర్రావుగుండె గజగజ కొట్టుకుం టోంది సోనీ ఏడుపు విని. "ఉషా, పద ఇంటికి పోదాం." అని పిలిచాడు. ఆపిలుపు విని బైటపడ్డ బోనులోంచే తిరిగి వెళ్లవలసివచ్చిన జంతువులాగా బెదరి పోయింది. ఆమెకళ్లు ఇంతసేపూ ఎంతో ఆత్రంగా చిన్ననాయకుడికోసం వెతుక్కుంటున్నయ్. వాడొక చెట్టుచాటున నక్కి, సోనీకేసి చూస్తూ కళ్లు తుడుచు కుంటున్నాడు. దిగాలుపడివున్న ఆ ముఖం చూడ గానే ఉమకి పట్టరాని ఏడుపు వచ్చింది. అమాంతం ఆ వేషం విసిరిగిరాటేసి, ఒక్కపరుగున లంబాడీ పడుచులాగా చిన్ననాయకుణ్ణి వెనకాలగా వెళ్లి కళ్లు మూయాలనిపించింది.

ఇంతలో విశ్వేశ్వర్రావుపిలుపు వెనకనుంచి "ఉషా, రా తల్లీ, చీకటిపడుతోంది. ఇంటికి పోదాం రా." పిలిచాడేకాని విశ్వేశ్వర్రావుమనసు పీకుతూ వుంది. ఈ గుడిశెలో అందరికీ ఎంత దుఃఖం కలిగిస్తు న్నాడు? ఇంతవరకూ పెంచి పెద్దదాన్నిచేసిన ఆ ముసలికి ఎంతకష్టం కలుగుతోంది? ఈ గుడిశె విడిచి రావటానికి ఉమకె ఎంతదుఃఖం కలుగుతోంది? ఇదంతా తన ఒక్కడి సంతృప్తికోసమేకదా?

కొన్నాళ్లు పంజరంచువ్వలని కొరికిన చిలకే చివరికి ఆ పంజరమే తన గూడు అనుకుని తృప్తిపడు తుంది. పారిపోవాలనే ప్రయత్నం మానివేస్తుంది. ఇంతవరకూ తన నిక్కడికి పట్టితెచ్చి బంధించినందుకు శత్రువుగా ఎంచిన మనిషితోనే చెలిమిచేసుకుంటుంది. అతని మాటలు తాను పలకటం మొదలుపెడుతుంది. కాని ఉమలోమాత్రం యిటువంటి మార్పు ఏమీ గోచ రించటంలేదు.

గదిలో ఉమ అద్దంచూసుకొని తల దువ్వుకుం టూంది. విశ్వేశ్వర్రావు వెనకాలగా వచ్చి నిల బడ్డాడు. ఉమ అతనిని చూడలేదు. అద్దంలో ఆమె ముఖం కనబడింది. ఆమె రెండుకళ్లూ నీళ్లతో నిండి తొణుకుతున్నయ్. ఏదో దుఃఖం ఆమెరూపాన్ని కప్పివేసింది. ఇది చూసేసరికి విశ్వేశ్వర్రావుగుండెలో కత్తిపోటు పొడిచినట్లైంది. "ఉమదుఃఖానికి కారణం నేనే కాదూ?" అన్న భావం శరవేగంతో అతని లోంచి వెలువడింది. దోషిలాగా వెనక్కితిరిగి బైటికి నడిచాడు.

ఆలోచనలతో విశ్వేశ్వర్రావు తలక్రిందులైపో తున్నాడు. తనబిడ్డదుఃఖానికి కారణం తానేనని తెలుసు కుని ఏ తండ్రిగుండె సహించగలుగుతుంది? బ్రతుకంతా





## మరి అతను లైఫ్‌బాయ్ పద్ధతిని కూడా నేర్చుకున్నాడు!

ఇప్పుడు అతడు అనేక విషయములను నేర్చుకొంటున్నాడు, గాని లైఫ్ బాయి ప్రతిరోజు వాడటంవల్ల కలిగే వుపయోగము మరి యే యితర విషాయాల్లోను పొందడు. వాని తల్లి నేర్పిన పాఠమువలన "మురికివలని అపాయము" నుండి అతడు కాపాడబడుటచే ఆమె గర్వపడుచు సుఖించ వచ్చును. యే మాత్రము శ్రద్ధవహించక పోయినను మురికి వలని అపాయము ఎదుర్కొనుటకు సిద్ధముగా వుంటుంది.




**లైఫ్‌బాయ్ మంచి సబ్బుల్లోకే ఉత్తమమైనది**

**ఇది మంచి అలవాటు**



LEVER BROTHERS (INDIA) LIMITED



# సౌందర్యము యొక్క రెండు తరాలు

వారిద్దరికి 20 సంవత్సరములు లేదా; గాని, ఆ తల్లియొక్క సౌందర్యము, పదహారు సంవత్సరముల వయస్సుగల కుమార్తెకువలె వున్నది. తల్లి తన చిన్నతనమునుంచి—తన తల్లియొక్క సలహాను పొంది—చర్మ సౌందర్యమును, పియర్సు సబ్బుతోను నిర్మలమైన నీటితోను కాపాడుకొను చున్నది. ఈ రోజున సౌందర్యవతియగు తన కుమార్తె ఇదే చేస్తోంది. గాన ఆమె శరీర కాంతి, తన తల్లి శరీర కాంతివలె వుండును.

ఇండియాలో నలభై సంవత్సరములనుంచి అందమైన స్త్రీలు ప్రత్యేకముగా పియర్సునే వాడుచున్నారు. దీని పరిమళము, మృదువైన నురుగు దీనికి సబ్బులలో ప్రాముఖ్యత నిచ్చినవి.




## పియర్సు సబ్బు

శాశ్వతముగా సౌందర్యమును కాపాడుటకు

TG. 22-172 TL. A. & F. PEARS ISLEWORTH ENGLAND

దుఃఖించిన తనకి ఆనందం లేకపోయినా కష్టంలేదు కాని రెక్కలువిచ్చి, సీతాకోకచిలుకలాగా ఎగిరిన సోనీకి దుఃఖం కలిగించటం ఎంతదారుణం? తన బిడ్డకు సుఖమివ్వటం కోసమేకదా తాను యింత పరితపిస్తున్నది? తన ప్రయత్నమంతా చివరికి ఆమెదుఃఖానికి కారణంగా పరిణమించినప్పుడు తానేం చెయ్యాలి? చిరునవ్వు చిందులేసిన నీ ముఖాన కన్నీళ్లు చిందేట్లు చేసిన గుండె ఎంతరాతిగుండె? నీ సుఖమేకదూ నేను అనుక్షణమూ కోరుకుంటున్నది? నీ సుఖానికి నేనెన్నడూ అడ్డురాను. ఎవరినీ అడ్డురానీయను. తండ్రినయినందుకు నీ సుఖమే తల్లీ, నాకీలోకంలో కావలసింది.

ఎంతసేపయిందో యిల్లా ఊహల్లో గిరగిర తిరుగుతూ. లేచి ఉమగదిలోకి వెళ్లాడు. గదిలో ఒకమూల లంబాడీలంగా, గౌనూ, దంతపుగాజులూ, పావలాదండలూ పోగుపెట్టిఉన్నయ్. వాటిని ఆప్యాయంగా చేతులతో నిమురుతూ, వాటివైపే పదేపదే చూస్తూ ఉమ వెక్కివెక్కి ఏడుస్తోంది. జడివానలాగా కన్నీరు రాలుస్తోంది. విశ్వేశ్వర్రావు గబగబా పరుగెత్తుకొవెళ్లి, చేతులతో కూతుర్ని లేవదీసి, కౌగిలించుకొని, తన ఉత్తరీయంతో కన్నీళ్లు తుడిచాడు. దుఃఖంలోకూడా ఒక వింత అందంతో మెరుస్తున్న ఉమముఖాన్ని చేతులతో నిమిరి, ముఖంమీద పడి తడిసిన ముంగురులను వేళ్లతో పైకి సరిదిద్ది, "ఏడుస్తున్నావా తల్లీ" అని ఒక్కముద్దు పెట్టుకున్నాడు. ఆ ముద్దులో పరితాపంతో మండిపోయే తండ్రిగుండె దాగిఉన్నదని ఉమకు తెలిసిందో లేదో! తన తండ్రిప్రేమ పంజరమై సోనీని బంధించదు. ఆమెకి రెక్కలిచ్చి రివ్వున ఎగిరి పోనిస్తుంది.

ఉపసంహారం —

పంజరం ముక్కలు ముక్కలైపోయింది. గిజగిజ తన్నుకున్న చిలక తుఱ్ఱున ఎగిరిపోయింది. కేరింతలుకొడుతూ జంటతో కలిసి, కిలకిల కూస్తూ ఎగిరిపోయింది.

ఉమ మళ్లీ సోనీ అయిపోయింది. సోనీకీ, చిన్నానాయకుడికీ పెళ్లి జరిగింది. పెళ్లినాడు ముసలిలంబాడీది సంతోషాన్ని పట్టలేక వాళ్లిద్దరినీ దీవిస్తూ ఆపలించి స్వర్గానికి వెళ్లిపోయింది.

విశ్వేశ్వర్రావు తన ఆస్తినంతా కూతురికి విల్లు వ్రాసియిచ్చాడు. అతనికికూడా ఈ కృత్రిమ నాగరికతతో నిండిన ప్రపంచమంతా ఒక పెద్ద పంజరంగా గోచరించింది. "అమ్మా, నన్నుకూడా నీతో రానీవూ? నేనింకా ఈ పంజరంలో పడిఉండలేను." అంటూ విశ్వేశ్వర్రావు లంబాడీలలో కలిసిపోయాడు. ఏ పచ్చటి పొలంగట్టున, చల్లటి చెట్లనీడలలో కూతురుకేసి చూస్తూ, హాయిగా ప్రాణంవిడుస్తాడో! తనకూతురి సుఖాన్ని కళ్లారా చూసి ఎంత ఉప్పొంగిపోతాడో! కూతురు తనకోసం రాల్చిన కన్నీటి చుక్కలన్నీ భద్రంగా దాచుకొని, ఆ లోకంలో రజని నెప్పుడైనా కలుసుకొంటే "చూశావా రజనీ, మన పాప, నన్ను క్షమించి నాకీకన్నీరు కానుకగా నిచ్చింది. ఇదిగో మన పాపకళ్లల్లోంచి రాలిన ముత్యాలు! చూడు, మరి నువ్వు నన్నెప్పటికైనా క్షమిస్తావా? క్షమించగలవా? చెప్పవూ?" అని దీనంగా వేడుకుంటాడు!



# మహాకవుల మితభాషిత్వము



= శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి =

గుణములలో నియమము మహాగుణము. ఈ నియమనశక్తి గల మహానుభావులే మునులు. ఆ శక్తి యున్నచో నసాధ్యమైనది యుండదు. మౌనము చేతిలో నణిమాద్యష్టసిద్ధులున్నవి. నేఁడు మన మహాత్ముని మౌనము పరదేశములను గడగడలాడించుచున్నది. శంకరులు, రామకృష్ణపరమహంస మున్నగువారు మౌనులు. మునులు సర్వదా మునులుగారు. సర్వదా మౌనిత్వ మొక మేధాదక్షిణామూర్త్యవతారములో నున్నది. "చిత్రం వటతరో ర్మూలే వృద్ధా శ్శిష్యా గురుర్యువా, గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః"—దక్షిణామూర్తి యిది యిట్టిదని శిష్యులకు వాచా వ్యాఖ్యానముచేసి చెప్పలేదు. ఆ మహాదేశికుని మౌనవ్యాఖ్యానమే పరబ్రహ్మతత్త్వస్వరూపము జిజ్ఞాసువులకుఁ జేతఁబెట్టినది. మౌనశక్తి యట్టిది. యోగి వాయుపంచకము సంస్తంభింపఁజేసినటులు, మౌని త్రికరణములను నిలుపుచేయును. ఆ యవస్థలో మనస్సు కట్టుఱాయివలె స్తంభించును. ఆ నిలిచిన మనస్సునందు వాక్కున్నది. కాయమున్నది. సమస్తవ్యాపారములు నున్నవి. అవి లేవన్నచో, మౌనములో ఆచార్యకము చేయు శక్తి యుండనేయుండదు. పరతత్త్వవిషయము 'ఇదమిత్థ'మని చెప్పుటకు శాస్త్రమునకు శక్యముకాలేదు. 'యతో వాచో నివర్తన్తే'యని యక్కడినుండి యుపనిషత్తు వెనుకమొగము పట్టినది. మఱి, దురధిగమమైన యాతత్త్వమును భగవదవతారము మౌనముతో నరఁటిపండొలిచి చేతికిచ్చినట్లు బోధించెను. ఆ యవతారము వరుణుని వంటిది కాదు. ఆ శిష్యులు వరుణపుత్రుఁడైన భృగునివంటివారును గారు....."తద్విజ్ఞాయ, పునరేవ వరుణం పితర ముపససార" (తైత్తిరీయము-భృగువల్లి) అన్నటులు, ఒక విషయము గురుముఖమున నెఱిఁగి రెండవదానికి జిజ్ఞాసతో 'నిదియేమి?'యని యడుగవలసిన యవసరమే దక్షిణామూర్తిశిష్యులకు లేకపోయినది. శిష్యులు శిష్యులుగారు. వారు బ్రహ్మర్షులు, మహర్షులు. అట్టి సర్వజ్ఞులకుఁ బరమేశ్వరుఁడుమాత్రము తన తత్త్వ మిట్లని యేమి చెప్పును? అవతరించి వటవృక్షమూలమున ధ్యానమగ్నుఁడై యుండెను. అతని ముఖము చూచునప్పటికి సమస్తము శిష్యులకుఁ దెలిసిపోయెను. అదంతయు మౌనశక్తి.

భోజుని ముఖము చూచినచోఁ గవిత్వము పుట్టుకొనివచ్చెడిదని చెప్పుదురు. భోజుఁ డంతర్ముఖుఁడు. అతనిలో ననిర్వాచ్యమగు మౌనశక్తి యుండెడిదని నే నందును. చీటికిమాటికిఁ జీఁదఱపడి చిఱ్ఱుబుస్సుమని పడఁదిట్టు తండ్రి కొడుకుదృష్టిలోఁ దాటి

యాకుమంట. తప్పు తగినంత చేసినపుడు 'హు'మ్మని కన్నులెఱ్ఱజేసిన తండ్రి కుమారునకు యమధర్మరాజు. అదియే మౌనములోని సత్త. మా తాతగారు నిండుకుండ. ఆయనతో సంభాషణముచేయుటకు వేయి ముహూర్తములు చూచుకొందును. వాఙ్మయ విషయకముగ నాయనమాటలు వినుటకై చెవులుకోసికొందును. తగినంత ప్రసక్తి వచ్చినప్పుడుగాని యాయనబోసినోరు విడదు. ఎప్పుడో, మా వంటి కుఱ్ఱకారుదగ్గఱ, ఆయనమాటలు మందహాసము చేయుచుండును. ఆ చిఱునవ్వులో నంగీకారమున్నదో అనంగీకారమున్నదో యర్థము చేసికొనుటకుఁ బేగులు తెగిపోవును. పైకి మాట వచ్చెనా, అది పాణినిసూత్రముకట్టినట్టు లుండును. వారితోఁ బ్రసంగించుట నాకుఁగాదు, శృంగములు మొలిచినవారికిని బెదురుపుట్టించును. అర్చిచచ్చినను, ఆయన యభిప్రాయము తేలదు.

మౌనులు మాటాడుట తటస్థించినపుడు బహుమితముగా మాటాడుదురు. వారి భావములు, పలుకులు సమానముగఁ దూఁగును. వారి తూ, చాలకుఁగూడ సార్థక్యముండును. "విభూషణం మౌన మపండితానాం" అనుకొందురు. పాండితి లేనిచో బడాయికిఁ బోక నోరుమూసికొనియుండుట యుత్తమమఁట. సాధారణుల కటు లూరకుండుట చచ్చినచావు. ఊరకుండినవాఁడు గొప్ప వాఙ్నియమనశక్తి కలవాఁడే. అట్టిది మహాత్ములకుఁగాని యలవడదు. ఏతావతా, మన మనుకొనవలసిన విషయము లివి:— మౌనశక్తికిఁ జాలినది లేదు—మునిపలుకులు మునిపలుకులు—అవి మితముగనుండును గాని, అతిగ నుండవు. ఆ మితభాషితము లే జగత్తునడపు సూత్రములు. భవభూతి మహాకవియీశ్లోక మీవిషయమునకు మంచి యుదాహరణము:

శాకికానాంహి సాధూనా మర్థం వా గనువర్తతే,
ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనువర్తతే.

ఎంతోవిషయము కడుపులోఁబెట్టుకొని వ్రాసిన శ్లోక మిది. ఋషులతరువాత మితభాషిత మహాకవుల కుండును. 'నానృషిః కురుతే కావ్యమ్'—ఋషికాని వాఁడు కవి కాఁడు అనిరి. ఋషిత్వము=మునిత్వ మున్నఁగాని కవిత్వము కవిత్వముగాదని దాని యంతరార్థము. వ్యాసవాల్మీకులు మహామునులు కనుకనే మహాకవులు. వారి లోకోత్తరకవిత్వములలో మెఱయుచున్న మితభాషితాగణ్యమైన మౌనశక్తి జగమెఱిఁగినది.

మన తెనుఁగువారిలో మున్మొదటి మితభాషి నన్నయమహాకవి. అతని పలుకు బడిలోఁ బట్టిచూచినను పొల్లు కనఁబడదు. ఎట్టి రసపరవశఘట్టములోనైన నతఁ డొడలు మఱచి యతిభాషణము చేయలేదు. పది మాటలు చెప్పవలసిన చోట నిరాకాంక్షముగ రెండుమాటలతో సరిపెట్టెను. ఉదంకుఁడు నాగపతులను నాలుగు పద్యములలో స్తుతించినపుడు దివ్యపురుషుఁడు ప్రసన్నుఁడై యా యుదంకునితో నిట్లనుచున్నాఁడు:

మితవచన ! నీయథార్థ
స్తుతులకతిప్రీతమానసుఁడ నైతి ననిం
దితచరిత ! నీకు నభిమం
తిత మెయ్యది దానిఁ జెపుమ చేయుదు ననినన్.
(ఆదిపర్వము ౧)

ఇచట నన్నయమహాకవి 'మితవచన!' యను సంబుద్ధి యుపయోగించినాఁడు.

ఇందులోఁ బెద్దభావ మిమిడియున్నది. కావ్యమునందు వచ్చు నేదోపాత్రచేఁ గవి తన శక్తియుక్తులను వ్యంగ్యభరితముగఁ జెప్పించుకొనునలవాటు పూర్వులకును, నేఁటివారికిని గలదు. ప్రభావతీప్రద్యుమ్నములో శుచిముఖీముఖమున సూరనార్యుఁడు "శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగనీక, పదమైత్రి యర్థసంపదలఁ బాదల" ఇత్యాదిగఁ దన కవితాప్రశస్తి చాటుకొనినాఁడు. ఇంచుక సూక్ష్మముగఁ జూచినచోఁ బ్రతికవియు నిటులు చేసినవాఁడే యనవచ్చును. మన నన్నయగారు మితవచనుఁడు. ఆయన వైదికుఁడైనను, లోకజ్ఞుఁడగుటచేఁ దన మితవచనత్వము ఉదంకునిదిగా నుట్టంకించుకొన్నాఁడు. ఈ ప్రకరణమున నన్నయగారి మితవచనత కొంచెము ప్రకటింతును. ఉదంకుఁడు ౧. బహువనపాదపాబ్ధి... ౨. అరిది తపోవిభూతి...3. దేవమనుష్యలోకముల... ౪. గోత్రమహామహీధర......ఇత్యాదులైన నాలుగుపద్యములుగల నాగస్తుతి చేసెను. నలువదిపద్యములతో స్తుతించినను బ్రత్యక్షముగాని నాగపతులను నన్నయమహాకవి నాలుగుపద్యములతోఁ బ్రత్యక్షముచేసినాఁడు కావుననే మితవచనుఁడు. ఇచట 'ఋత వచన'యని పాఠభేదముచూపించిరి.'యథార్థ స్తుతులు' అను పదము ప్రక్కనుండుటచే నది సరిపడదు. ఇంక, ఈ మహాకవి మితభాషిత్వమున కొండు రెండు మచ్చులిచ్చెదను.

వ...కచుండు రాకున్న దేవయాని తన మనంబున మలమల మఱుంగుచుంబోయి తండ్రి కిట్లనియె:

వాఁడిమయూఖముల్ గలుగు
వాఁ డపరాంబుధిఁ గ్రుంకె ధేనువుల్
నేఁ డిట వచ్చె నేకతమ
నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్
పోఁడిగ వేల్వఁగాఁబడియెఁ
బ్రొద్దును బోయెఁ గచుండు నేనియున్
రాఁడు వనంబులోన మృగ
రాక్షసపన్నగబాధ నొందెనో?

వ. అనిన విని శుక్రుండు దన దివ్యదృష్టి నసుర వ్యాపాదితుండైన కచుం గని వానిం దోడ్కొని తేర మృతసంజీవినిం బంచిన నదియును బ్రసాదంబని యతిత్వరితగతిం జని విగతజీవుండయిన కచు నప్పుడ సంజీవితుంజేసి తోడ్కొని వచ్చినం జూచి శుక్రుండును దేవయానియు సంతసిల్లియున్నంతఁ గొన్ని దినంబులకు వెండియు నొక్కనాఁడు—

ఈ పంక్తులయందలి మితభాషిత యిది యని నేను వ్రాయలేను. రసికపఠితలకే యది వేద్యము. ఈ సందర్భమున నన్నయగారు మఱొక కవియైనచో నాలుగుమూఁడుపద్యములు, నాలుగైదు వచనములు పెట్టి నలిపి చంపును. దేవయాని యభిప్రాయ గర్భితముగఁ గచునిగూర్చి తండ్రితో నన్నట్లు వ్రాసిన యాయుత్పలములోని పొందిక యందము మఱొకకవిసామాన్యుఁడు వ్రాయలేఁడు. ఆ క్రిందివచనములో నెంతగాథ చఱచఱ పోనిచ్చెనో చూచితిరా? అదియే మితవచనత. ఎంతో యవసరము వచ్చినపుడు గాని యెక్కువసంభాషణము చేయఁడు నన్నయ. దౌష్యంతుని చంకఁబెట్టుకొని శకుంతల దుష్యంతమహారాజుకడకు వచ్చినది. రాజు "నీ వెవర"వని యడిగినాఁడు. అప్పుడు శకుంతల తనకుఁదాన యుపశమించుకొని యారాజుతో—

ఏల యెఱుక లేని యితరులయట్ల నీ
వెఱుఁగ నను చుఁ బలికె దెఱిఁగియెఱిఁగి,
యెనకాని దీని నెఱుఁగ రెండొరు లని
తప్పఁబలుకఁదగునె ధార్మికులకు?

ఇత్యాదిగ నించుమించిరువదిగద్యపద్యములతోఁ జెప్పిచెప్పి—

క్షత్త్రియవరుఁడైన విశ్వా
మిత్త్రునకుఁ బవిత్రయైన మేనకకును స
త్పుత్త్రినయి బొంకు వలుకఁగ
ధాత్రీతలనాథ! యంత ధర్మేతరవే?

అన్నది. ఆ సమయమున దుష్యంతుని ఱాతిహృదయమును గరఁగించుటకై యిరువదిగాదు, అఱువది పద్యగద్యములు చెప్పినను జెప్పవలసినదే! అది యతిభాషణసమయములోని మితభాషిత. ఔచితి కెక్కడను గొఱంత రాకుండ నిట్టి మితభాషణము చేయు మహాకవులలో నన్నయ యగ్రతస్సరుఁడు. అతని తరువాతఁ దిక్కన్నయు నట్టివాఁడే.

కృష్ణుఁడు కౌరవులకడకు రాయబారము తీసికొనివెళ్లెను. వెళ్లి దుర్యోధనాదులతో మధురభాషణములు చేయుచుండెను. అప్పుడు—

సముచితంబుగఁ గూరల చందమగ్గ
డించి కుడుపు తెఱంగు ఘటించి పలుకు
నాసుయోధనతోఁ గృష్ణుఁ డచటఁ దాను
గుడువనొల్లక యునికి యేర్పడఁగఁ జెప్పె.

ఈ పద్యములోని 'కుడువనొల్లక యునికి' ఏర్పడఁగఁ జెప్పె నన్నదానిలో నున్నది ప్రాణము. మితభాషిత యిందు కరడుగట్టినది. 'తాను దినను' అన్న విషయము వాచ్యముగ నచటఁ గృష్ణుఁడు దుర్యోధనునితోఁ జెప్పలేదు. ఏదో మాటల సందర్భము తీసికొనివచ్చి భోజనముచేయనని వ్యంగ్యముగఁ దేల్చివైచినాఁడు. ఆ విషయము ఏర్పడఁగఁ జెప్పెనని తిక్కన వ్రాసినాఁడు. పరికించినకొలఁది నిందులో మితభాషితయొక్క యౌచితి పరిపోషితమగుచున్నది. శ్రీ కృష్ణుఁడు ద్రౌపది నూరార్చినటులు చెప్పిన యీ పద్యములు చూడుఁడు:

క్రుచ్చిరసేల యేఁ గలుగ
ముద్దియ నాకు వృకోదరుండు వి
వ్యచ్చుఁడు దోడుగాఁగ జన
వంద్యుఁడు ధర్మసుతుండు పంప నీ
మెచ్చుగ శత్రుసంక్షయము
మేకొని చేసెదఁ గాక వేఱొకం
డచ్చుపడంగ నేర్చునె దు
రాత్ములు కౌరవు లుర్వి యిత్తురే?

లలనా! యుకుగము నీయే
ద్దులకొలఁదియె కురునృపాలపుత్రకళత్రం
బుల యేడ్పు లింక వానిం
గలకల నవ్వుచు వినంగఁ గాలంబయ్యెన్.
యమమహిమఘంటికానా
దము వినఁ గౌతూహలంబు దలకొత్తెడు చి
త్తములు గల కౌరవుల కి
ష్టములగునే సంధికార్యశాంతవచనముల్?

తెలియఁజదివిన నీ మూఁడింటిలోను కృష్ణుని హృదయమున్నది. కాఁబోవు సర్వకౌరవనాశన మున్నది. దానిలో ద్రౌపది ముఖము వికసించినది. తిక్కనపలుకు పొందిక తెన్ను వర్ణనీయము.

నన్నయ తరువాత, తిక్కన తరువాత నలుగురైదుగురుకంటె మితభాషులైన మహాకవులు మన తెనుఁగువారిలో లేరు. మితభాషితయందే ధ్వని యుండును. ధ్వనిభరితమైన వాక్కు బహుపరిమితము. ధ్వనిభరితమితభాషులైన మహాకవులు మన తెనుఁగులోనే యేల, సంస్కృతములోకూడ విరళముగ నున్నారు. ఆనందవర్ధనుల యాభాణక మిది పరికింపుఁడు:

యేనాస్మిన్నతివిచిత్రకవిపరంపరావాహిని సంసారే కాళిదాసప్రభృతయో ద్విత్రాః పంచషావా మహాకవయ ఇతి గణ్యన్తే.

మన సారస్వతములోఁగూడ నన్నయ తిక్కనలతో నలుగురైదుగురు మహాకవులు పూర్వులలో నుందురు. తక్కిన కవులకు మహాకవిత్వము లేదా యని గట్టిగ నడిగిన లేదని చెప్పుటకు మహావిమర్శకుఁడు జంకఁడు.

ఈ ప్రబంధకవులందఱిలోను సార్వత్రికమైన మితభాషిత లేదనవచ్చును. ఎచ్చటనో యట్టిది విరళముగా నున్నను మొత్తముపై బహుభాషణము (చాదస్తము) హెచ్చు. ప్రబంధలక్షణములు యథావిధిగఁ బట్టించుటకు సందర్భము వచ్చినచోట, లేనిచోట వర్ణనములు గావించినంతమాత్రన మహాకవి యనిపించుకొనఁడు. వర్ణనము లుండవలయును. అవి మితముమీఱియుండరాదు. నగరార్ణవాద్యష్టాదశవర్ణనములు చేయవలయును. అవి సందర్భముననుసరించి చేయవలయును. ఒకదరినుండి లక్షణగ్రంథమునలె వర్ణించుకొనిపోవుట మహాకావ్యమునకు మంచిలక్షణముగాదు. ఆ గొప్పతనము, ఆ నేర్పుతీరు దేవవాఙ్మయములో వ్యాసవాల్మీకులపిమ్మట నొక్క కాళిదాసున కున్నది. అతని కావ్యము లందులకే మహాకావ్యములు.

మన మనుచరిత్రము, వసుచరిత్రము, ఆముక్తమాల్యద, పింగళిసూరన కృతులు- ఇవన్నియుఁ జాలవఱకు మితభాషణములతోఁ గూడినవే. కాని, ప్రబంధములగుట చంద్రోదయ, చంద్రాస్తమయ, సూర్యోదయ, సూర్యాస్తమయ, విరహాదివర్ణనములలోఁ గొంత బహుభాషణభరితములై యున్నవి. ఇట్టిదికూడ పురాణకవులలో నుండదు. ఒకటిరెండు పద్యములకంటె నెట్టివర్ణనమందును నెక్కుడు భారతములో నుండదు. అది వ్యాసునిలో నున్న గుణమో? పురాణములో నున్న గుణమో? ఏదోయొకటి. తెనుఁగుభారతమునమాత్ర మీ మితభాషిత వెల్లివిరిసినది. అట్టిగ్రంథము కవిత్రయమునకు దొరకినది. అందులో నన్నయ తిక్కనల కది మహాసుందరముగఁ బట్టుపడినది. సంస్కృతవాఙ్మయములో వ్యాసవాల్మీకులు- తెలుఁగులో నన్నయ తిక్కనలు - వీరే మహామునులు. వారే మహాకవులు.



# బిళ్లల మొలత్రాడు

[కథ]

= శ్రీ 'కరుణకుమార' =

[గతసంచిక తరువాయి]

రామిరెడ్డి పట్నంవెళ్లి నెల్లాళ్లు దాటింది. సుబ్బులు పెళ్లి వారం రోజు లుండనంగా వెళ్లిన వెళ్లడం. ఇదిగో పదిహేను రోజులకు వస్తానని వ్రాసిన రెడ్డి కోతలయి కుప్పలుపడ్డా తిరిగి రాలేదు. కొబ్బరి తోటలో తన కొత్తకాపరం ఆ రెడ్డి చూచి ఆనందించాలని ఎంత మనస్సుపడుతున్నాడో సుబ్బులు-అంతకంతా రామిరెడ్డిరాక ఎడమేఅయిపోతోంది. ఎడమయిన కొద్దీ సుబ్బులు కాఎడబాటు దుస్సహమై పోతోంది. ఇంటిదగ్గర భార్యాపిల్లలూ రెడ్డికోసరం కలవరించి పోతున్నారు. ఏమిటో ఆరోజు రెడ్డిమీద అతగాడికి మరులుపోయి, మనస్సు ఉండబట్టలేక లక్ష్మమ్మకాడికి పరుగెత్తి-

"అమ్మా! అయ్య యిన్నాళ్ళుగా రాలేదు. పట్నంలో ఏమిచేస్తున్నట్టు?" అని అడిగాడు.

"ఈ వూరు రామలింగేశ్వరస్వామికి ఆ కమ్మవారిపాలెంలో ఏభయ్యెకరాల మాగాణీమాన్యంఉన్నది. దానిని ఆవూరుకమ్మవారు పండించి, ఆవూరు దేవుడికి ఖర్చుపెట్టుతాంగాని నీ కివ్వడానికి లేదని పేచీ పెట్టారట. వీడు మన వూరు దేవుడికి ధర్మకర్త కాబట్టి ఆ భూములు స్వాధీనానికి వ్యాజ్యెం వేసి కోర్టుకెక్కి ప్లీడర్లతో మాట్లాడివస్తానని వెళ్లాడు-"

"మన వూరు దేవళానికి కమ్మవారిపాలెంలో భూము లెట్లా వచ్చినవి?"

"ఆ వూళ్లో కమ్మచలమానాయుడు, పిల్లకాయలు లేక చనిపోతూ, తాను శివభక్తుడయినందువల్ల, తన ఆస్తిలో యాభై ఎకరాలు ఈ దేవుడికి వ్రాసి యిచ్చి చచ్చిపోయాడట."

"అట్లనా?"

"అదిలగాయతూ దేవుడు మన వూళ్లోఉండినా, ధర్మకర్తలు ఆ కమ్మనాయుళ్లే ఉండి, ఈదేవుడికి పూజలూ, పునస్కారాలూ, ఉత్సవాలూ వాళ్లే చేసుకొంటూ వచ్చారు. నీటిమడవల తకరారుపడి ఏటిలో తలకాయలు పగలకొట్టుకొన్నప్పటినుండీ ఆ కమ్మవారు పేచీపెట్టుకొని భూములమీద వచ్చే ఆదాయం వాళ్లవూరు రామస్వామిదేవళం క్రిందా, మాలమాదిగల చదువులక్రిందా, యానాది సంఘాలకిందా ఖర్చుపెట్టుతున్నారట."

"నే నెరగను సుమా."

"మనవాడు ఈమధ్య పట్నంలో గొప్పవాళ్లనీ, అధికార్లనీ, కలెక్టర్లనీ పట్టుకొని తాను ధర్మకర్తగా ఉండేటట్టు ఉత్తరువులు తెచ్చుకొని భూమిస్వాధీనానికి కోర్టులో దావాపడేశాడు. కాని ఆకమ్మవారు స్వాధీనం పడనిస్తారా! ఏదో అన్నరు పెట్టి హైకోర్టుదాకా తీసుకొని పోయారట వ్యవహారం."

"అబ్బా!"

"అసలు చలమానాయుడు వ్రాసియిచ్చిన వీలునామా చెల్లదని వాళ్ళ వాదమట."

"బాగానే ఉంది!"

"వద్దురా నాయనా! ఆ దేవుడుమాన్యాలూ, బ్రాహ్మణ మాన్యాలూ మనకు వద్దు. మన కున్నది తింటే చాలు. మీ నాయన పరాయిసొమ్ము పాపిష్ఠి సొమ్ముగా చూచి పరువుగా బ్రదికి భళా అనిపించు కొన్నాడు. ఈసొమ్ము నీవు నెత్తికి తెచ్చిపెట్టుకో వద్దని శతవిధాల చెప్పాను. విన్నాడు కాదు." అని అంటూ లక్ష్మమ్మ లోపలికి వెళ్లిపోయింది.

సుబ్బులుకు తన సేద్యమేమో తనేమో అంతే గాని ఈ దేవరహస్యాలు తెలియవు. కాకుంటే ఈ వూరు రెడ్డిగార్లకీ, ఆ వూరు కమ్మవారికీ బొత్తిగా సరి పడదనిమాత్రం ఎరిగున్నాడు. ఎరిగున్నా, ఏ విష యంలో పట్టినా కమ్మవారికంటె తన రెడ్డిచెయ్యే పై చెయ్యిలా కనిపించేది సుబ్బులుకు. తన రెడ్డి ఆ వూరుకి మునసబు. తహశీల్దార్లు, కలక్టర్లు, పోలీసు అధికార్లు-గొప్పగొప్పవాండ్లు గుర్రబ్బండ్లూ, మోటా రుకార్లూ వేసుకొని రెడ్డిగారింటికి రావడం, ఈయ నతో చెయ్యీ చెయ్యీ కలుపుకొని మాట్లాడడం, ఏవో నల్లనివీ, ఎర్రవీ నీళ్లు గ్లాసుల్లో పోసుకొని తాగడం—తన రెడ్డి జిల్లాఅధికారి ఉన్నట్టుంటాడు. ఈ మధ్య నాలుగునెలలక్రిందట తన రెడ్డి కేదో "సాహెబు" అని సర్కారువారు కొత్తగా పేరు కూడా పెట్టారని రెడ్డిగారిపల్లెలో ఎంతోమంది గొప్ప వాళ్లు వచ్చి, రెడ్డిగారిని ఎత్తయిన కుర్చీలో కూర్చో బెట్టి, మెడలో పూలదండలు వేసి పూజించి వెళ్లారు కూడాను. సర్కారువారుకూడా తనరెడ్డికి లోగసా నయినట్లే కనిపించేది సుబ్బులుకు. చెన్నపట్నం దావాలో రెడ్డిగారే గెలిచితీరుతా రనుకొని, ఏమే మిటో ఆలోచించుకొంటూ ఇంటికి వచ్చాడు సుబ్బులు.

ఆ రాత్రికే పట్నంనుండి గ్రామానికి తిరిగి వచ్చాడు రామిరెడ్డి. గ్రామానికి వచ్చిన తర్వాతకూడా ఏవో తొందరపనులలో రెడ్డి వారం పదిరోజులుదాకా ఇంటికాడ స్తిమితంగా ఉండడమే లేదు. ఒకరోజు మధ్యాహ్నం నాలుగుగంటలప్పుడు కాఫీ తీసుకొంటూ మని రెడ్డి దక్షిణపువాకిట్లోకి వచ్చేసరికి వసారాలో కూర్చుని ఒక పదుచుపిల్ల తన భార్యకు తలకువ్వి జడ అల్లుతోంది. పిల్లని చూచి, "ఎవరే ఈ మనిషి?" అని భార్య నడిగాడు.

కూర్చున్న మనిషి సిగ్గుపడి లేచి పక్క ధాన్యపు పురిచాటుకు తప్పుకుంది.

తన భార్య సమాధానం చెప్పేలోపలనే, "నువ్వు చూడనేలేదుటరా అబ్బాయీ! సుబ్బులు పెళ్లాం" అని కాఫీ కొడుకుచేతి కిచ్చి, "రమణీ! ఇట్లా రా అమ్మా" అని ఆమె చెయ్యి పట్టుకొని తీసుకొనివచ్చి, "రమణి అంటే రమణి కాదురా. మణిపూస. యానాదివాళ్లలో తప్పపుట్టింది. సుబ్బులు అదృష్టం కొద్దీ దొరికిం"దని రామిరెడ్డి ఎదురుగా నిల బెట్టింది లక్ష్మమ్మ.

కాఫీ గుటకలు మింగుతూనే ఆపిల్ల నట్లా పది సార్లు క్రిందనుండి పైదాకా మొఖమంతా కళ్లుచేసు కొని చూచాడు రామిరెడ్డి.

వినయంగా నిలబడి, "నమస్కారమండి బాబు గారూ." అన్నది రమణి.

రామిరెడ్డి పలకలేదు.

"అవూళ్లో యానాది సంఘాలవాళ్లు పెట్టించిన బడిలో చదువుకొన్నదట. చదువు రానివాడయినా, మేనత్త కొడుకని—సుబ్బుల్ని చేసుకొన్నది. ఈ కాలంలో చదువుకొన్న ఏఆడది చదువురానివాణ్ణి చేసుకొంటుంది చెప్పూ? దాని బుద్ధి బంగారుబుద్ధి" అన్నది లక్ష్మమ్మ.

రామిరెడ్డి ఇంకా గుటకలు మింగుతూనే నిల బడ్డాడు.

"అబ్బాయీ! వాడిపెళ్లికి నీవు లేవని సుబ్బులు ఎంత ఇదయిపోయా డనుకొన్నావూ! రెడ్డిగారు రెడ్డి గారు అని కలవరించిపోయాడంటే నమ్ము." అన్నది లక్ష్మమ్మ.

"అట్లాగే!" అన్నాడు రామిరెడ్డి.

"కొత్తబట్టలు కట్టబెట్టి పసుపు రాచి నేనే పెళ్లికొడుకుని చేశాను. బంగారు సవరొక టిచ్చి

పంపాను. ఎన్ని ఋస్తేమట్టుకు సుబ్బులుఋణం మనం తీర్చుకోగలమా నాయనా?" అని ఏమిటో పాఠం చదువుతోంది లక్ష్మమ్మ.

రామిరెడ్డి రమణిముఖంలోనికీ, ఆమెతొడుక్కున్న పొట్టిచేతుల జాకెట్టులోనికీ ఏవో వెర్రిచూపులు చూస్తూనే ఉన్నాడు. కప్పులో మరింత కాఫీ పోయించుకొని "సుబ్బులుకు మన కొబ్బరితోటలోనే గదూ నీవు యిల్లు కట్టించియిచ్చింది? మంచిపని చేశావు." అని తల్లిని మెచ్చుకొంటూ, వాకిట్లోకిపోయి చుట్ట నోట్లో పెట్టి అగ్గిపుల్ల ముట్టించాడు రెడ్డి.

"అత్తయ్యగారూ! అయన్ని చూస్తే నాకు కాళ్ళల్లో దడపుట్టింవండి." అని లక్ష్మమ్మతో అని, రామిరెడ్డిభార్యవెనక్కి పోయి కొరవబడ్డ జడ అల్లుతూకూర్చుంది రమణి.

పొద్దుగ్రుంకినవెంటనే సుబ్బులుని ఒకసారి పిలిపించి, రమణిని పెళ్లిచేసుకొని తీసుకొనివచ్చినందుకు వాడికి అభివందనాలు చెప్పి సాగనంపాడు రెడ్డి.

రమణి తన దృష్టిలో పడిన వేళావిశేషం! రమణిశరీరంమీద అలంకారాలేమీ లేనేలేవు. బిళ్లారి గాజులు ఈ చెయ్యి కోజతా, ఆ చెయ్యి కోజతాను. ఎడమచేతి అనామికానికిమాత్రం ఒక వెండి ఉంగరం ఉన్నది. మెడలో పసుపురాచిన తాడూ, తాడుకు మంగళసూత్రమూను. కంఠానికి కొంచెం గుత్తంగా ఒక నల్లపూసల దండా, దండలో ఒక బంగారు మిరియంపూసా. ముక్కూ, చెవులూ బోసివే. కాళ్లకి మాత్రం వెండిగొలుసుల జత ఒకటి ఉన్నది. ఖద్దరు చీర కట్టుకొని, నీలిఅంచుఖద్దరురవిక తొడుక్కున్నది. ఎటు వచ్చీ ఆమెసిరిఅంతా కళ్లల్లోనూ, చుట్టుకొంటే తలనితన్నే నల్లని జెడచుట్టలోనూ నిలిచిపోయింది. ఇంతకుతప్ప ఆమెలో అలంకారాలేమీ లేవు. గాని, అన్నిటికీ మించిన నవయౌవనంమాత్రం మిసమిసలాడే తాచుపాముచురుకుదనంతో ఆమె నావరించి తేజస్సు వెదజల్లుతోంది.

ఆమెరూపాన్నీ, సౌందర్యాన్నీ, నేత్రాలనీ మరచిపోలేకపోతున్నాడు రామిరెడ్డి. వీధివాకిట్లో చుట్టకాలుస్తూ ఏకాంతంలో అట్లానే నిలబడిపోయాడు. మనస్సులో ఏదో చెప్పరాని బాధ, ఉద్రేకం, ఆవేదనాను. చెయ్యిపెట్టి కలచినట్లున్నది మనస్సులో. చుట్ట చేతికి తీసుకొని, తెల్లటికొండి దులుపుతూ-పరధ్యానమో ఏమో-కొండిరాలిపోయినపిదపకూడా చిటికనవేలు నిప్పుమీద అట్లనే ఆడిస్తున్నాడు. ఘాటయిన చుట్టేమో, కింద పాదాలూ, చేతులూ, పైన తలా వేడెక్కి రక్తం బిర్రుగా ప్రసరిస్తోంది. చిటికనవేలికి నిప్పు చుర్రుమనేవరకు అతని శరీరం జ్వరంతగిలినట్టయిపోయింది. దీర్ఘనిశ్వాసాలతో ముక్కుపుటాలు పెరిగి నోటిలోకి పీల్చిన పొగ ముక్కురంధ్రాలగుండా తెరలు తెరలుగా బయటికి కమ్ముకుంటోంది. దొడ్లోకి వెళ్లి ఇంకోసారి రమణిని చూడాలనిపించింది. చుట్ట పారేసి, "మంచినీళ్లు కాసినియ్యి అమ్మా." అంటూ మళ్లా దొడ్లోకి వెళ్లాడు. గాని అక్కడ రమణీ లేదు; తన భార్యా లేదు.

రమణి ఇంటికిపోయిందికాబోలనుకొన్నాడు రెడ్డి.

## ౨

ఫాల్గుణంవెళ్లి ఉగాది అందుకొన్నది. ఈ ఏడు కుప్పలన్నీ తొందరగా నూర్పించి ధాన్యంకొట్లో చేర్పించాలని రెడ్డికి తొందరపుట్టింది. ఏమో-కాలం చూడవస్తే బాగుండడం లేదు. యుద్ధం వచ్చి, బర్మానుండి బియ్యం సరఫరాకాక సర్కారువారు లేనిపోని కంట్రోళ్లుపెట్టి రైతుల కంఠానికి గండకత్తెర తీసుకొని వచ్చారు. బెంగాలుదేశంలో బ్రహ్మాండమైన కరువు వచ్చి జనం తండాలుతండాలుగా చచ్చిపోతున్నారట. ఈ సంవత్సరం పైర్లన్నీ అసలు పొలంమీద ఉండంగనే దేశరక్షణచట్టంక్రింద జప్తీచేసి సర్కారువారు స్వాధీనపరుచుకొంటారని ఆ మధ్య అనేకమయిన పుకార్లు బయలుదేరినవి. కోత లెట్లనో అయిపోయి కుప్పలుపడ్డవి. సర్కారువారు కుప్పలమీద స్వాధీనం పెట్టుకొన్నా పెట్టుకోవచ్చు. తన కంత పలుకుబడి గల అధికారాలున్నా, చట్టం బయల్దేరి బిగుసుకొన్న తర్వాత తాను రావుసాహెబును అంటే విడిచిపెట్ట

లేరా ? అయినా, చెయ్యి కాలేదాకా పట్టుకొని కూర్చోడం దేనికి ? ఎందుకయినా మంచిది—పొలం మీద ఉన్న పదికుప్పలూ తొందరగా నూర్పించి గింజలు కొట్లో చేర్చుకొంటే పడవలమీద దొంగతనంగా దాటేసే ఏకోస్తావర్తకులకయినా బ్లాకుమార్కెట్టులో బేరం తెగ్గొట్టుకొంటే కొన్ని కాకపోతే కొన్ని పుట్లయినా సర్కారుకు దక్కకుండా దాటించుకోవచ్చు. సుబ్బుల్ని పిలిపించి "మంచిరోజు చూచి ముందు బావడచేలో పెద్దకుప్ప పడదొక్కించరా" అని చెప్పాడు రామిరెడ్డి.

రామిరెడ్డి ఆజ్ఞ సుగ్రీవాజ్ఞ సుబ్బులుకి. ఆ మరునాడే-తెల్లవారితే బేస్తవారమనగా, బుధవారం రాత్రికే కుప్ప పడగొట్టించాడు సుబ్బులు. అది సామాన్యపు కుప్పగాదు—అరవై డెబ్భయి పుట్లు అయ్యే అలివి మాలిన కుప్ప. తాటిచెట్టు ప్రమాణాన్న ఉన్నది. ఒకటోరకమైన జెట్టీవంటి మనుష్యులను నలభయిమంది మాలవాళ్లని కూలికి ఏర్పాటుచేసి ఇరవై ఇరవయివంతున వాళ్లను రెండు ఉద్దీలుగా ముడదలుపెట్టించి తూర్పు తట్టు ఒక ఉద్దీ,పడమటితట్టు ఒక ఉద్దీ కుప్ప ఎక్కించి వినాయకుడుకట్ట తాను దగ్గరనే ఉండి పడపోయించాడు సుబ్బులు. వంకొలు చేతిలో తీసుకొని ఆ రెండు ఉద్దీలవాండ్లూ కిలారించుకొంటూ కుప్ప ఎక్కేసరికి అంతలావు కుప్పా జవజవలాడి సన్నగిలిపోయింది. కుప్పపైకెక్కి తట్లు కూరేవాండ్లు మారుకుంటే, క్రింద పాలిబద్దలు చేతబట్టుకొని నూరు పెద్దపసరాలనూ కుప్పచుట్టూతిప్పి తొక్కించేవాళ్లుతొక్కించి, తొక్కిన గడ్డిని కలిమెట్టు కట్టేవాండ్లు కట్టుతున్నారు. అయిపోయె—రాత్రి రెండుజాములకు పడవేసిన కుప్ప తెల్లంగా తూర్పురేఖ లారేసరికే పూర్తిగా లోబడి పోయి గింజ దులిపి తొండివెంటిమీద కడిమికట్టడం కూడా పూర్తిఅయిపోయింది. ఇంక గడ్డి విదిలించి వామివేయడమే తరవాయి. పొద్దు పడమటికివాలేసరికి వామి పూర్తిగావేసేసి, కళ్లంజారడం, చేగుడు వేయడంకూడా అయిపోయింది. ఆనాడు వడ్లు పోగు చేసి అడ్డపోతులు వేసేసరికి చీకటిపడినందున ఆ రాత్రికే ఇంకోజట్టు కూలీలను పిలిపించి వెంటనే తూర్పారబట్టాలని అనుకొన్నారుగాని చీకటిపడేవరకు పడమట కొద్దిగా మబ్బులేచి పైరుగాలి మట్టగించేసరికి ఆ పని నిలుపుదలచేసుకొని అడ్డపోతులుమీదనే ముద్రపిండి పెట్టి పలకఅద్ది గుర్తులుపెట్టించి, చినుకుపడినా నీకుడిగకుండా గడ్డికప్పించాడుసుబ్బులు.

ఆ రోజంతా సుబ్బులు పొలంపనిమీదనే నిలిచి పోయాడని రామిరెడ్డికి తెలుసు. అంతలావు కుప్ప పడదోసి తొక్కిస్తున్నప్పటికీ తానొకసారి పొలం చాయ పోయి చూచిరావాలన్న ఆలోచన అతగాడికి తట్టనేలేదు. కనిచీకటి పడ్డతర్వాత ఒకసారి సుబ్బులింటికి పోయి ఏకాంతంలో రమణితో ముచ్చటించి రావాలనిమాత్రం ఆలోచన పుట్టింది. పోవాలనుకొంటే తన కభ్యంతరమేమున్నది? ఆయిల్లు దూరమా భారమా? తన మండువాలోగిలికి ఉత్తరం ధాన్యపుకొట్లూ, దాని వెనక పశువులసాలా, దానానుకొని కొబ్బరితోటా, తోటలో ఈశాన్యంమూలన సుబ్బులు యిల్లూను. ధాన్యపుకొట్లూ, పశువులకొట్టం, కొబ్బరితోటా తణిఖీచేసికొంటూ వెళ్లినట్టు. ఒక్కడూ చేత కర్ర పట్టుకొని సుబ్బులింటికి వెళ్లాడు. ఇంటిముందు పందిరిలో నులకమంచం వేసి యింటితలుపు గొళ్లెంబిగించి, యిల్లంతా నిశ్శబ్దంగా ఉన్నది. రమణి ఎక్కడకు పోయినదా అని ఆలోచనలో పడుతుండగనే ఇంటి వెనక తడికలచాటున నీళ్లశబ్దం వినవచ్చి రెడ్డి పడమటి తట్టు తడికచాటుకు పోయి నిలబడి సందులోకి తొంగి చూచాడు. రమణి సున్నిపిండి తీసి కళ్లుమూసుకొని ముఖం రుద్దుకొంటోంది. రెడ్డి ఆ దృశ్యం చూడనూ లేకపోయాడు; ఆ స్థలం విడిచి బయటపడనూ లేక పోయాడు. పొలంనుండి సుబ్బులు ఇంటికివచ్చే వేళేమో అనిపించి, ఇది సమయం కాదని వెనక్కు తిరిగివెళ్లాడు.

రెడ్డి వైతొలగిన పావుగంటకే సుబ్బులు అసురుసురయి యింటికి ఘటం చేరవేసి నెత్తిమీది గుడ్డ తల క్రింద పెట్టుకొని నులకమంచంమీద వెల్లికిలా పండుకున్నాడు. పున్నమి ముందు దశమో ఏమో అప్పటికే చిక్కని వెన్నెల నల్లని కొబ్బరాకుల మీదుగా జారున

జారిపోతోంది. గాలికి కదిలే కొబ్బరాకులు వెన్నెట్లో వెండిబెత్తాలవలె తళతళ మంటున్నవి. ఆ చంద్రుని ధాటీకి తాళలేక సన్నటి చుక్కలు దూరంగా లేచి పోయి కొబ్బరాకుల సందుల్లో రెప్పలార్చుకొంటున్నవి. కొబ్బరిమట్టల సంగున గూడుకట్టుకొన్న రెండు తెల్లకొంగలు వెన్నముద్దలవలె కూర్చొని సుబ్బులుదృష్టికి విందు గొల్పుతున్నవి. రెడ్డిగారి పశువులసాలలోని ఆవుదూడ అంబా అని పాలకోసతం అలవటించిపోతుంటే, చూడలేని గోమాత పొదుగులో పాలుచేపి మెడపలుపు లాక్కొంటూ మేత మేయడం మరచిపోతోంది. ఒక సన్నని పిల్లగాలితెర సుబ్బులు చెవులో ఏవో రహస్యాలు చెప్పి, పైకి లేచిపోయింది.

మంచందగ్గరగా వచ్చి, తన ప్రియుణ్ణి చూచుకొని, జాలిపడి, ప్రక్కన కూర్చొని, అతని చెక్కిలిమీద చెయ్యివేసి, నెన్నుదురు నిమిరి—

"ఉడుకునీళ్లున్నాయి. లేచి స్నానం చెయ్యి. బడలిక తీరుతుంది." అన్నది రమణి.

కన్నులు విప్పి చూచాడు సుబ్బులు.

"వయస్సులో నీకు తెలియడం లేదుగాని ఈ విధంగా వొళ్లు విరుచుకొని పనిచేస్తే, ఎంతకాలం తట్టుకొంటుం దీశరీరం ? వేళ కిన్ని మెతుకులు తినడానికూడా నోచుకోలేదే ? లే : లేచి స్నానం చెయ్యి" అంటూ సుబ్బులుమొఖంమీద చెక్కిలిపెట్టి, ఒక కన్నీటిబొట్టు అతగాడి కపోలంమీద విడిచింది రమణి.

"అన్నం తిని పెందలాడే పొలం పోవాలి మళ్లా. కళ్లంకాడ కాబ్దాకి ఎవ్వరూ లేరు. తొందరగా నీళ్లు పెట్టు; స్నానం చేస్తా"నంటూ సుబ్బులు కూర్చున్న రమణిభుజాలమీద చేతులానించి ఆమెను దగ్గరగా తీసుకొన్నాడు.

లేచి స్నానంచేసి అన్నం తిని చెప్పులు తొడుక్కొని కర్ర చేతపట్టుకొని కళ్లందగ్గరకు వెళ్లిపోయాడు సుబ్బులు.

కొబ్బరిచెట్టుమీది కొంగలు గూటిలో చేరి కూర్కుపెట్టినవి. ఆవుదూడ పాలుతాగి పడక వేసింది. తళమిచంద్రుడు కొబ్బరిచెట్లచాటుకు తప్పుకున్నాడు.

బోర్లించిన గంపమీద ప్రమిదదీపం పెట్టుకొని ఈతాకుచాపమీద కూర్చుని రాఘవయ్యగారు బహుమతిచేసిన "మాలపల్లి" తీసి కళ్లకద్దుకొని, నిన్నటి తరవాయి చదువుకొంటోంది రమణి.

"అగ్గిపెట్టె ఉంటే ఇయ్యి." అని అడుగుతూ వాకిట్లో ఒక మనిషి నిలబడి, చుట్టమొన కొరికి, పళ్ల సందున పెట్టి, నాలుకతో తడుపుతూ చేత్తో తిప్పుతున్నాడు.

పిడుగుపడ్డట్టనిపించి అదిరిపడి లేచింది రమణి.

"అగ్గిపెట్టె యిస్తా, చుట్ట కాల్చుకోవాలి." అని అగ్గిభిక్షం అడిగాడు ఆ మనిషి.

"ఎవరండీ మీరూ ?" అని అడిగింది రమణి.

"మరచిపోయావూ అప్పుడే ? నేను రామిరెడ్డి" నన్నాడు ఆ మనిషి.

రమణిగుండెలు టపటప కొట్టుకొన్నవి. రెక్కలు టపటప కొట్టుకొంటూ గూటిలోనుండి బయటికి వచ్చి కొబ్బరిమట్టమీద వ్రాలినవి కొంగలు.

ఆ రామిరెడ్డిని మంచంమీద కూర్చోపెండని గౌరవించాలో, చుట్టముట్టించుకోను అగ్గిపెట్టె యివ్వాలో-ఇవ్వకూడదో-ఆమె కర్థంకాలేదు. కలగదొక్కుకొంటోంది రమణి.

"ఇంట్లో అగ్గిపెట్టె లేదా ఏమిటి పిల్లా ? కొత్త కాపురం కాబోలులే." అన్నాడు రెడ్డి.

"పొయ్యిలో నిప్పు ఉన్నదేమో తీసుకొనివస్తానుండండి" అని వంటింటిపొయ్యికాడికి పోయి చూచింది. కాని పొయ్యి శూన్యంగా ఉండిపోయింది. అగ్గిపెట్టె కనిపించలేదు.

వాకిట్లోకి వచ్చిన పెద్దమనిషికి చుట్టకాల్చుకోను నిప్పయినా లేదని చెప్పడానికి నోరురాక, ఆమె అగ్గిచూపితేనేగాని వాకిట్లోనుండి కదలనని శపథం పట్టినట్టు కనిపించే రెడ్డిని కాదనలేక—గంపమీద పెట్టిన వేపచమురు ప్రమిదదీపం తెచ్చి గడపలో నిలబడ్డ రెడ్డి కందిచ్చింది రమణి. రెండడుగులు ముందుకువేసి, ప్రమిద తాను తీసుకోకుండగనే, చుట్ట ముట్టించడానికి మూతి దగ్గరగా పెట్టినట్టే పెట్టి, ఉఫ్

అని ఆమెచేతిలో దీపం ఆరిపేశాడు రెడ్డి. ప్రపంచం అంధకారమైపోయి కళ్లు చీకట్లుకమ్మి గడగడ వణకుతూ చేతిలో ప్రమిద జారవిడిచి వెనక్కు తగ్గింది రమణి. గడపలోపల ఎడమకాలు పెట్టి,

"ఇంత భయ మెందుకు యానాదిపిల్లా?" అని అంటూ ఆమెచెయ్యి పట్టుకొన్నాడు రెడ్డి.

అన్నిటికంటెనూ బలవత్తరమైనది అవసరం. ఆమె కాఘడియలో ఏమేమి భావములు మనస్సులో పొడగట్టినవో, వాటి పరిణామ మేమో ఆమెకే తెలియని స్థితిలో,

"మీవంటివారి కిది తగదు." అంటూ ఆయన గుండెలమీద తన కుడిచెయ్యి అదిమి, బలముతో వెనక్కు ఒక్కతోపు తోసింది. అంతలావురెడ్డీ రెండు ముక్కలు అయిపోయి గడపఅవతల ఆరడుగుల దూరంలో వెల్లకిలా పడిపోయాడు. తలుపుమూసి లోపల యినప గడియ బిగించింది రమణి.

ఏనుగువంటి రెడ్డి పీనుగయిపోయాడు. క్రింద మట్టిలో పడ్డ మనిషి లేచి గుడ్డలు దులుపుకొన్నాడు. రెక్కలు టపటపమని కొట్టి చప్పట్లు చరిచి అతన్ని వెక్కిరిస్తూ ఆ చెట్టుమీది కొంగలు ఈ చెట్టుమీదికి ఎగిరినవి. తన స్థితి చూచి చంద్రుడు చేసిన అపహాస్యం కొబ్బరిచెట్లసందుగా అతనిమీద పడి పీక్కుని తింటోంది. బిగించిన తలుపు తీయనేలేదు రమణి. ఇక తీస్తుందన్న ఆశకూడా కనిపించదు. ఆక్షణంలో రమణిని మసిచేయాలన్న క్రోధాగ్ని అతని గుడ్లలో విషం కక్కుతోంది. ఆ యానాదిదాన్ని లోపలనే పెట్టి కొంపకు బయట నిప్పంటించాలని అతని కావేదన కలిగింది.

చొక్కా చేతులపైకి లాక్కొని తువ్వాలుతో వీపు దులుపుకొని ఒక విచిత్రమైన స్థితిలో ఇంటికి వెళ్లిపోయాడు రామిరెడ్డి.

౬

ఆరాత్రి రమణికి కాళరాత్రి అయిపోయింది. తలుపు తెరవడానికి భయపడి చీకటింటిలోనే ఉండిపోయింది. దీపం ముట్టించడానికి అగ్గిపెట్టె కనిపించలేదు. సుబ్బు లెత్తుకొనిపోయాడో ఏమో. చెయ్యి జారి ప్రమిద వాకిట్లోనే బ్రద్దలైపోయింది. కిరసనాయిలు శేషనింగులో సుబ్బులుసంసారం కరణంగారి జాబితాలో చేరనందున గ్రామంలోని ఇతర యానాది గుడిశలతోబాటు సుబ్బులింటికికూడా శేషనింగుకార్డు లేక బుడ్డిదీపం కూడా కరువే అయిపోయింది రమణికి. కమ్మవారిపాలెంలో తన తల్లి అవెన్యూ రోడ్లమీద ఏరితెచ్చిన వేపవిత్తనాలు ఎండబెట్టి ఆడించుకొన్న చమురు తాను వస్తూ ఒక దుత్తెడు తెచ్చుకొని దానిలో ఏకుల్లో దూది వత్తి చేసిపెట్టుకొని కాలక్షేపం చేస్తోంది. లోపల దీపం వచ్చేవిధం ఆమెకు కనిపించలేదు. ఎన్నడూ పిరికిదనమంటూ ఎరగని ఆమనిషి తన యింట్లో పేరుకొనిపోయిన గాఢాంధకారము భరించలేకపోతున్నది. లోపలనుండి ఎవరినన్నా పిలుద్దామన్నా తన ఇంటికి చుట్టుప్రక్కల దగ్గరలో ఇండ్లు లేవు. తన సుబ్బులు ఖామందు రామిరెడ్డి దగ్గిర ఇటువంటి చపలత్వం వున్నదని ఆమె ఎరగదు. తన నాథుడు ఇంటలేని సమయంలో ఆరెడ్డి ఇంతపనికి పూనుకోవడానికి కారణం తన బీదస్థితేగదూ? యానాదికులంలో పుట్టడమేగదూ తాను చేసుకొన్న మహాపరాధం? అదే తనతో సమానస్థాయీ గల మరొక రెడ్డిస్త్రీ అయినట్టయితే ఆరెడ్డి కీసొమ్మ ఉంటాయా? భోరున పొంగివచ్చే దుఃఖాన్నాపుకోలేకపోయింది. ఈతాకు చాపమీద పడిపోయి వెక్కి వెక్కి ఏడిచింది.

తనకు జరిగిన పరాభవం సుబ్బులుచెవిని పడితే ఏమవుతుందో? ఆమెకివేదన మరణవేదన నయిపోయింది. తానీసంగతి సుబ్బులుతో చెప్పడమా, చెప్పకపోవడమా??? "మామా!"అని మరిగిపోయే మనస్సుతో వెర్రిగా మొరిగింది. ఒక్క గూటిలో నివసించే పక్షులకు ఎడబాటు ఉండదని నమ్మింది. ఆ సమయాన మామ తన కెంతదూరమై పోయినాడు! సప్తద్వీపములు దాటి పారిపోయినట్టు ఉన్నాడు ఆమామ. బాడవచేలో రెడ్డిగారి సొత్తు తన మామ కాపాడుతుంటే, తన మామసొత్తు దోచుకోడానికి వచ్చాడు రెడ్డి. అబ్బా! అని విలపించింది.

లోకప్రసిద్ధిపొందిన

# పి. వి. రాజన్
## అండ్ కంపెనివారి




శ్రేష్ఠమైన మదరాసు నశ్యం
R. S. సుగంధ ముక్కుపొడి.
అన్నిటిలో సాటిలేనిది.
ధర వివరములకు వ్రాయుడు.
తయారుచేయువారు :—

**పి. వి. రాజన్ & కంపెని,**
అర్కోణం, **Arkonam, N. A. Dt.**

---

## అగ్ని, మోటారుకారు
## భీమాకు



## ●యునైటెడ్ ఇండియా
## ఫైర్ అండ్ జనరల్
## ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్,

యునైటెడ్ ఇండియా లైఫ్ బిల్డింగు,
ఎస్ప్లనేడ్, మద్రాసు.
టెలిఫోన్ : 4241.
Grams : "UNIGEN"
పోస్టుబాక్సు : 1207.

---




## దేశ స్వాతంత్ర్య సిద్ధియే
## వీరుని దీక్షా కంకణము

బల పరాక్రమ వీర్య తేజోసంపన్నత్వ
మునకు దివ్యరసాయనము.
పండిత డి. గోపాలాచార్యులవారి

# జీవామృతము

## ఆయుర్వేదాశ్రమము

త్యాగరాయనగర్ :: మద్రాసు.

ఆమెరోదన అరణ్యరోదనమేనా ?

పడమటితట్టు కిటికీనుండి లోపల ఒక్కసారి తొంగిచూచాడు దశమిచంద్రుడు. రాత్రి ఎంత పొద్దు పోయిందో, లోపల ప్రవేశించిన చంద్రకాంతి ఇంటిలోని అంధకారంతోబాటు రమణి మనోవేదననికూడా కొంత ఉపశమింపజేసింది. చంద్రబింబం పడమటికి ఏటవాలుగా దిగజారినకొద్దీ కిటికీలోని వెన్నెల ఇంటిలో గోడమీది ఒక్క గాంధిమహాత్మునిమీది కగ్రాకింది. ఆయనముఖంలో దివ్యతేజస్సు వెలిగిపోతోంది. చీరచెరగుతో కళ్లు తుడుచుకొని లేచివెళ్లి మహాత్మునిఎదుట మోకరిల్లింది. ఆ మహాత్ముడు ఆమె వీపు నిమిరి, "అమ్మా! నీవు నా కన్నతల్లివి." అని లేవనెత్తి దగ్గరగా తీసుకొన్నాడు. "భారతజాతికి పట్టుకొన్న పిశాచం దారిద్ర్యం ఒక్కటే కాదమ్మా! దారిద్ర్యంకంటె భయంకరమైనది పిరికితనం అని తెలుసుకో. కమ్మవారిపల్లెలో చదువుకొనేరోజులలో రాఘవయ్యగారి దగ్గర నీవు నేర్చుకొన్న ధైర్యం ఈనా డేమయింది తల్లీ! ఆ ధైర్యం ఏటిఅవతలనే అప్పచెప్పి ఈ గడ్డన పిరికిమందు తిన్నావా? నిర్భయం, నిర్భీతి— దీనిని మననంచేయి. సత్యాన్ని మరచిపోకు. అహింసని విడిచిపెట్టకు. నీవంటివాళ్లు పిరికితనంతో కంటనీరు పెట్టుకొని ఏడుస్తుంటే నీ యానాదిజాతికే కాదు, అసలు భారతజాతికే బ్రదుకేదీ? ఏడుపు వీరుల లక్షణం గాదు. చూడు: ఒకానొక రాక్షసుడు వచ్చి నీ నఖశిఖపర్యంతం కసాయివాడి కత్తితో చెండాడుతున్నా, నీవు కంపించకూడదు తల్లీ! అప్పుడే నీకు స్వాతంత్ర్యం, స్వేచ్ఛా, గౌరవమూను...లే: లేచి నీవు ధైర్యం అవలంబించి నీ మామకు ధైర్యం చెప్పు." అని ఆయనేమో తనకి చెప్పుతూనే ఉన్నాడు. చంద్రకళకు పడమటికొండ అడ్డుతగిలి తిరిగి తన ఇంట్లో అంధకారమే అలుముకొన్నది. నవవాళ్లూ పట్టువదలి ఆమె క్రింద పడిపోయింది.

ఆ పడినపడడం ఎంతసేపు పడిపోయిందో - తూర్పురేఖలారి వాకిట సుబ్బులు వచ్చి, 'రమణీ' అని తలుపుతట్టేవరకూ ఆమెకు మెలకువరానేలేదు. అమృతోపమానమైన ఆ ప్రియుని వాక్యం చెవినిబడంగనే లేచి, దూకి తలుపు తీసింది. "ఇంకా నిద్రేనా" అని సుబ్బు లేమో చెప్పబోతుండగనే, "మామా! వచ్చావా! ఇట్లా రా! అబ్బా!" అని తలుపుమూసి, అతని ఆపాదమస్తకమూ, ప్రతిరోమకూపమూ, అతని ప్రతి పరమాణువూ ఆరాధించి, తన ఆత్మ-తన సర్వస్వం అతనిలో ప్రతిష్ఠించింది. అతనిని కదలనివ్వదు. తాను కదలదు. అర్ధగంటకాలం ప్రియుని ఉపాసించినమీదట ఇరువురికీ శరీరాలు తేలిక అయిన వెంటనే లేచి బయటకు వచ్చారు.

చద్దినీళ్లు త్రాగి పొలంవెళ్లిపోయాడు సుబ్బులు. రోజూ ఒకసారి రెడ్డిగారి భార్యదగ్గరకు వెళ్లివచ్చే అలవాటు. ఆ నాడు ఇల్లు కదలలేకపోయింది రమణి. ఆ రెడ్డిగారింట్లో అడుగుపెట్టడానికి రోతనిపించింది. పెందలకడనే వంటచేసి, పెనిమిటికి పైటన్నం కళ్లం దగ్గరకే పంపించి, తా నింత తిని తలుపు బిగించి దీర్ఘాలోచనలో పడింది రమణి.

ఇంతటితో తనని రెడ్డి విడిపిస్తాడా. జరిగిన పరాభవం అతనిలోని పౌరుషా న్నినుమడింపజేస్తుంది గాని, పుట్టిన తాపాన్ని శమింపజేస్తుందా? తనతోబాటు సుబ్బులుకూడా ఆ రెడ్డి ఆగ్రహాగ్నికి ఆహుతి అయిపోతాడేమో? రమణి కంపించింది.

ఆ రాత్రి జరిగిన విషయం తన మామకు తెలియదు. ఆయనచెవిని వేయకుండా దాచడం ఎట్లా? ఆమామసందునా తనసందునా దాపరికా లుండవచ్చునా! ఆమె కాదినమంతా కలవరపాటే మనస్సులో.

మహాత్ముని ఆత్మచరిత్ర తీసి చదువుకొన్నది. దక్షిణాఫ్రికాలో మోటారులోనుండి దిగిపొమ్మని ఒక తెల్లదొర మహాత్ముని చావగొట్టుతున్నాడు. ఆయన లక్ష్యపెట్టడంలేదు. "షాలపల్లి" తీసి చదువుకొన్నది. తన కూతురుశీలం కాపాడడానికి శిరస్సు తీసి నేలమీద పెట్టుతానని రామదాసు జ్యోతికి అభయప్రదానం చేస్తున్నాడు.

రమణి లేచింది. రాటం త్రిప్పింది. ఏదో పాట పాడింది. వాకిలి చిమ్మింది. తల దువ్వుకొని స్నానం చేసింది. మంచిగుడ్డలు కట్టింది. ముఖాన్న కుంకుమ

పెట్టింది. మహాత్మునికి దీపారాధన చేసి, పూజచేసింది. అదివరకు నాయకుల మెడలో కట్టిన వాడిలిపోయిన పాతపూలదండలు తీసేసింది. తాను వొడికిన నూలు చిలపలు నలుగురికీ నాలుగు మెడలో కట్టింది. వారంద రికీ మొఖాన్న కుంకుమ పెట్టి, లేచినిలబడి కన్నులు మూసి దణ్ణం పెట్టింది.

ప్రొద్దుగుంకి ఇంటికి రాగానే సుబ్బులుకు ఊడుకునీళ్లు పోసి కుంకుడుకాయతో వళ్లూ వీపూ రుద్ది స్నానం చేయించింది. అతని తలకి కొబ్బెర చమురు రాచి, తల దువ్వి ముడికట్టింది. అన్నం విస్తట్లో వడ్డించి—

"ఈ పొద్దుకూడా తిరిగీ పొలం పోవలెనా" అని అడిగింది.

"అవా!" అన్నాడు సుబ్బులు.

"ఎప్పటికయ్యేను ఈ కుప్పనూర్పిళ్లు?"

"కళ్లం పూర్తిగా జారి ధాన్యం యింటికి చేరే సరికి ఇంకా రెండురోజులు పట్టుతుంది."

"మామా! నీవు ఈ వరసన పగలూ రాత్రీ పొలం లోనే కాపరం చేయి. నేను ఇంటికాడ ఒక్కత్తినీ అల్లాడిపోతుంటా" నన్నది రమణి.

"పనిపడ్డప్పుడు వొళ్లు దాచుకొంటే ఎట్లా? పెళ్లాన్ని కరుచుకొని ఇంటికాడ కూర్చుంటే కడుపు లోకి ఖన్వో!" అని ఎగతాళిగా మాట్లాడేడు సుబ్బులు.

"ఇంటికాడ రాత్రిళ్లు నేను ఒక్కదాన్నీ ఉండలేక ఇదవుతున్నాను. రాత్రిపూటకూడా నీకు పొలంలో పని ఉంటే నేనూ వస్తాను పద. ఇద్దరం అడనే ముడుచుకొందాం" అన్నది రమణి.

"నే వద్దన్నానా? కళ్లంకాడనే గడ్డి కప్పి గుడిశ పెట్టించా. వరిచెత్తమీద చాపేసి పండుకుంటే, ఆ చల్ల గాలికి వొళ్లు తెలియదు." అన్నాడు సుబ్బులు.

ఇద్దరూ అన్నం తిని లేచి చెయ్యి కడుక్కొన్నారు. వక్కా, ఆకూ పెనిమిటి కిచ్చి, తానుకూడా ఇంత నోట్లో వేసుకొన్నది. పొద్దుపోయింది. ఊరు మాటుమణిగింది. తొందరగా వెళ్లి కళ్లంకాడ మనిషి నింటికి పంపితేనేగాని వాడికి భోజనానికి పొద్దు పోతున్నదని సుబ్బులనేవరకు, రమణి తలుపు బిగించి, పెనిమిటితో కళ్లంకాడికి పయనమైవెళ్లింది.

## ౧౦

గతరాత్రి తలుపు వేసుకొని చీకటింట్లో రమణి ఎంత వేదన పడిందో దానికి రెండింతలు మరణబాధ పడుతున్నాడు ఇంటిదగ్గర రామిరెడ్డి. ఆ రాత్రంతా అతనికి కంటిమీద కునుకుపట్టితే వొట్టు!

రమణివంటి మనిషి తనకు చిక్కకగాదు. తాను తలుచుకొంటే ఆ గడ్డన కోదనడాని కెవరికి దొమ్మ లున్నాయి? తనవిషయం రమణి కింకా తెలియదేమో గాని, గ్రామంలో ఆబాలగోపాలమూ ఎరిగిన సంగతే. ఇంటికాడ చేసుకొన్న భార్యగాక అతను సాలిమనిషి పడుచుపిల్ల పెనిమిటిని ప్రోత్సహించి మిలిటరీలోనికి పంపి, ఆ పిల్లను తన దగ్గరచేరదీసి, దానికి పిల్లకాలవ గట్టున పెంకుటిల్లు కట్టించి, దానిపేర రెండెకరాల కయ్య సెటిల్‌మెంటువ్రాసియిచ్చి పోషిస్తున్నాడు కూడాను. మొగవాడి జీవితంలో అప్పుడప్పుడు కొత్త రుచులు చవిచూస్తుంటేనేగాని అందంలేదు. అంత కాళ్లూ, చేతులూ కట్టివేసుకొని పడిఉండడానికి తన కేమికర్మం కాలింది? చేతిలో డబ్బులేకనా, పలుకు బడి లేకనా, వంట్లో రక్తమాంసాలు లేకనా? నిజా నికి చెప్పాస్తే తనవంటి రెడ్డికి ఆ మాత్రపు పటాటోపం లేకుంటే ఈ కాలపు సంఘంలో చిల్లిగవ్వకు పనికి వస్తాడా తను? అసలు ఆ వూళ్లో రెడ్డిగారి ప్రాపకం దొరికితే చాలునని అల్లాడుతూ ఉంటారు అలగాజనం.

అలగాజనం లెఖ్ఖేమిటి? రెడ్డిగారి పక్షాన ట్రాన్సుఫరయివచ్చిన బోర్డునూళ్లు అయ్యవారమ్మలు ఎంతమంది తన మనస్సు మెప్పించి వెళ్లిపోలేదు? ఈ సారి వచ్చే ఎన్నికలలో తాను జిల్లాబోర్డు ప్రెసిడెంటు పదవికి ఎన్నివేలయినా ఖర్చుపెట్టి పోటీచేస్తున్నాడు కూడాను.

అటువంటి రెడ్డిని కాదని కాలతన్నిందే ఈ యానాదిది ? దీని భృగువెంత, ఇది ఎంత ? అది సెట్టిన సెట్టడానికి-అబ్బా !—గుండెలమీద నొప్పిపెట్టడమే గాక, విసురుమీద వెల్లకిలా పడడమేమో, నడుం బెణికినట్టుకూడా ఉన్నది. రవంత వల్లతప్పితే ప్రక్కనే ఉన్న పచ్చడిబండమీద పడవలసింది తల. దేవుడి దయవల్ల తప్పిపోయింది.

యానాదిదాని కింత తలపొగరేమా అని రెడ్డి క్రోశం. దేనిని చూచుకొని దీని కింత మిడిసిపాటుతనం ? తన కిట్టి పను లిష్టంలేకపోతే, పెద్దమనిషితో ఆ సంగతి నెమ్మదిగా చెప్పకోరాదూ ? మెడబట్టి సెట్టవలసిన ప్రమేయ మేమివచ్చిందీ ?

అయినా ఈ వ్యవహారంలో తనదే లోపమేమో ! అది యానాదిది, కేవలం మూఢురాలు, దరిద్రకొట్టుది. ముందుగా ఇంత డబ్బాశపెట్టి, నైతరంగా బుజ్జగించియుంటే లొంగుబాటులోకి వచ్చియుండేది. తొందరపడి, పెద్దపులిపడ్డట్లు ఒక్కసారిగా మీదపడేవరకు, పాపం ! పసిపిల్ల బెదురుకొన్నది. పశ్చాత్తాపపడ్డాడు రెడ్డి. ఈ వ్యవహారంలో మరి రెండోవాడి జోక్యంలేకుండా తనే అతిరహస్యంగా సారథ్యం చేసుకొని ఆ రమణిని సాధించుకోవాలని దృఢనిశ్చయం చేసుకొన్నాడు.

చుట్ట తీసి ముట్టించాడు. ఒక వందరూపాయల నోటు తనది కాదనుకొంటే కొండమీద కోతికూడా దిగివస్తుంది; రమణి ఒకలెఖ్ఖా అనుకొన్నాడు. మర్నాడు రాత్రి పదిగంటలకు తిరిగీ రమణిఇంటికి పోయి, "భయపడకు. ఇదిగో వందరూపాయలు. నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డువేస్తా. సుబ్బు లేమనుకొంటాడో అని సందేహించకు. నా విషయంలో వాడు సంతోషిస్తాడుగాని, విచారించడు. నిన్నూ వాణ్ణీకూడా బంగారుపిచ్చుకల్ని చేస్తాను." అని తను స్వయంగావెళ్లి బుజ్జగిస్తే ఆమె తన చేతిలో వెన్నముద్దలా కరిగిపోదూ !

రెడ్డిమనస్సు ఉరకలువేస్తోంది. కళ్లంలో కుప్పసంగతి మరచిపోయి, ఆ రోజంతా చీకటికోసరం తపస్సుచేశాడు.

సూర్యుడస్తమించి అతని తపస్సు ఫలించింది. శుక్లదశలో చంద్రోదయమైనా అతనికి దోహదమిచ్చి ఆప్యాయంగానే ఉన్నది. బాగా చీకటిపడి, సుబ్బులు అన్నం తిని కళ్లంకాడికి పోయేసరికి రాత్రి పదిగంటలవుతుంది. కాళ్లకి చెప్పలు తొడుక్కొని, చేతకర్ర బుచ్చుకొని, జేబులో నోటుకాగితం పెట్టుకొని, సుబ్బులింటికి వెళ్లి చూచుకొన్నాడు. తలుపు తాళం వేసి ఇల్లంతా నిశ్శబ్దంగా ఉన్నది. అతనికి కాళ్లు చల్లబడినవి. పెనిమిటితోకూడా కళ్లంలోనికి పోయింది కాబోలనుకొన్నాడు. అతనికి భయంకూడా వేసింది. స్తిమితం చెడి, సాలిమనిషింటికి పయనమైవెళ్లిపోయినాడు.

౧౧

పున్నమిగడియ లెదురయినకొద్దీ చందమామ కళలు ముదురవుతూ ఉన్నవి. చైత్రమాసపు గాడుపేమో, పగలు కాచిన ఎండతీక్షణం రాత్రి కాచే వెన్నెలకు వెయ్యిరుచులు కలిగిస్తోంది.

ఇంటికాడ బయల్దేరిన రమణీసుబ్బులు పిల్లకాలవగట్టెక్కంగనే చెట్టాపట్టాలేసుకొని ఆ వెన్నెట్లో విర్రవీగిపోతున్నారు. ఊరినుండి ఒకమైలు నడిస్తే రెడ్డిగారి బావవచేను. చేనుప్రక్కనే రెడ్డిగారి చిన్న చెరువూను. పిల్లకాలవలోకి నీళ్లు వచ్చినవెంటనే చెరువుకు నీళ్లునింపుతారు. సుబ్బులు వెళ్లి కళ్లంకాడ కాపలామనిషి నింటికి పంపివేశాడు.

సుబ్బులుకూ, రమణికీ ఆ రాత్రి నిద్రవచ్చేటట్టు లేదు. బ్రహ్మాండమైన పెద్దకళ్లం. కళ్లంచుట్టూ కోటగోడలా వలయాకారపు గడ్డికడిమె. వలయంలో నట్టనడుమున పోశారు అడ్డపోతులూ వడ్లరాసీని. తూర్పారపట్టిన రాశిలో కీడిశలూ, తరకలూ ఇంకా తొలగించనే లేదు సేద్యగాళ్లు. కళ్లంలో నిలిచిన గోరిగింజల కోసరం మాలెతలు చిమ్మివెళ్లిన కళ్లంగాబోలు, వెన్నెట్లో అద్దంలా మెరిసిపోతోంది. తరకలు తొలిగించివేస్తే, మేలురాని వాగళ్లంకాడ పోయించి గంపలతో కొలగలు కొలిపించి బస్తాలు బళ్లకెక్కించడమే తరవాయి.

కడింకట్టిన వాగళ్లంచుట్టూ రమణీ సుబ్బులు తిరుగుతున్నారు. ఒకసారి చెరువుగట్టెక్కారు. కలక తేరిన నీటిపై తేలిపోయే కలవపూలు గడకొంకితో గట్టుకు లాగి, కొన్ని తెంచి, రమణిజడలో తురిమి ముక్కుదగ్గర పెట్టుకొన్నాడు సుబ్బులు. గట్టుమీద కలకత్తా జామిచెట్టున రమణిలా దోరముగ్గిన పండొకటి కోసి తన ప్రియురాలి కిస్తే ఆమె సగం కొరికి ప్రియుని నోటి కందిచ్చింది. ప్రక్కనున్న మామిడిగున్నలు విరియబూసి కమ్మని సువాసనలు కళ్లంపైకి సాగనంపుతున్నవి. రెండు పావురాయిలజంట కళ్లంలో ముక్కు లీడ్చుకొంటూ పాటపాడుతున్నవి. పిల్లకాలవగట్టున టెలిఫోన్ తీగలమీద రెండుకోయిలలు వాలి ఉయ్యాల లూగుతూ పావురాయిల పాటకు శ్రుతికల్పుతున్నవి. రాత్రిపూట దారితప్పిన రెండు పండుకోతులు కళ్లంలో జొరబడి అల్లరి చేయసాగినవి. గుడిశలో చాప బయటికి లాగి, గడ్డి పరచి ప్రక్క వేశాడు సుబ్బులు. తాటాకుతో అల్లిన గడ్డిదిండొకటి తలక్రింద పెట్టింది రమణి.

సుబ్బులు నడుము వాల్చాడు. రమణికి నిద్ర రాదు: మనస్సు కలగుండుపడిపోతోంది. ఆమె నిలదొక్కుకుంటోంది. ఆమెమనస్సులో చెలరేగిన తుపాను అతనికి తెలియదు.

పెనిమిటిప్రక్కలో కూర్చున్నది. ప్రియుని వక్షస్థలంపై చెయ్యివేసి నిమిరి—

"మామా !" అని పలకరించింది.

"ఊఁ" అన్నాడు సుబ్బులు.

"నీవంటి మామ దొరకడం నా అదృష్టం." అన్నది రమణి.

రమణిని దగ్గరగా తీసుకొన్నాడు సుబ్బులు.

"ఇంటికాడ ముసలివాళ్లు - మా వూరు కమ్మవారు - రాఘవయ్యగారూ నిన్ను తలుచుకొని ఎంత మెచ్చుకొంటారో నే చెప్పలేను."అన్నది రమణి.

త్రైలోక మహాసామ్రాజ్యానికి చక్రవర్తి అయినట్టు పొంగిపోయాడు సుబ్బులు.

"ఎన్నిజన్మ లెత్తినా-నువ్వూ నేనూ ఇట్లానే పుట్టాలని నా కోరిక."

ఆమెచెక్కిలిపై తన పెదవులు మెదిపాడు సుబ్బులు.

"మామా ! నా కేసి చూడు."

"..................."

"నీతో ఒక్కసంగతి చెప్పాలా: ఎవ్వరితో చెప్పనని నాచేతిలో చెయ్యివేయి." అన్నది రమణి.

సుబ్బులుగుండె దడదడమన్నది. చేతిలో చెయ్యి వేశాడు.

"నీవు ఈరెడ్డిని వదిలించుకోవాలి మామా."

సుబ్బులు నడుముజారిపోయి—

"ఎందువల్ల ?" అని అడిగాడు.

"ఆయనసంగతి నీవు ఎరగవూ ?"

"ఎరుగుదును."

"ఆయింటిలో మనం ఉన్నట్టయితే ఆరెడ్డి నన్ను నీకు దక్కనీయడు."

"అంటే ?" అన్నాడు సుబ్బులు.

ఆమెనోరు పెగలలేదు. గొంతుక బిగుసుకొనిపోయినట్టయి, అతని కంఠం చుట్టవేసింది.

అతని హృదయం, ఆమెహృదయం శరవేగంతో కొట్టుకొనిపోతున్నవి.

"ఎందు కీఏడుపు? "అని ఆమెకన్నీరు తుడిచాడు సుబ్బులు.

"నిన్నరాత్రి నీవు యింటికాడ లేకుండా చూచి, రెడ్డి మనింటికి వచ్చి దీపమార్చి నన్ను చెయ్యిపట్టుకొన్నాడు."

సుబ్బులుచెవులలో హోరు బయల్దేరింది. రెండు చెవులూ మూసుకొని, చాపమీద వొరిగాడు.

"నాకు వొళ్లుమండి మెడబట్టి నెట్టాను. ఆయన క్రిందపడ్డాడు. నేను తలుపు బిగించాను."

"ఆ !" అన్నాడు సుబ్బులు.

సుబ్బులుకు ముచ్చెమటలు పోసినవి. వరికళ్లం గిర్రున కుమ్మరిసారె తిరిగినట్లు తిరిగిపోతోంది. కళ్లు మూసుకొన్నాడు. తెరిచాడు: చంద్రబింబంలోని కళంకం నల్లగా మసికప్పి అసహ్యమనిపిస్తోంది. చేతులు నడుముకానించి నిలబడ్డాడు.

"ఈసంగతి నువ్వు ఎవరితోనన్నా చెప్పినట్టయితే, నన్ను చంపుకొన్నట్టే"అని ముదలకించింది రమణి.

సుబ్బులుకళ్లల్లో రామిరెడ్డీ, లక్ష్మమ్మా కదిలారు. కళ్లు మూసుకొని భోరున ఏడిచాడు. చీరచెరగుతో అతన్ని విసురుతో—

"మామా! ఎందు కాయాసపడుతావు? ఈ రెడ్డిని వదిలించుకోలేకనే ఈభయమంతా ?"

సుబ్బులు పలకలేదు.

"నీకు ఇంతటి ఘోరం తలపెట్టిన మనిషిదగ్గర నీ వింకా ఉండవచ్చునా ?"

సుబ్బులు మాట్లాడలేకపోతున్నాడు.

"నీవూ నేనూ కుక్కలం, పశువులం అనుకొన్నాడు రెడ్డి. కూటికిగతిలేని దరిద్రులు, నీకూ నాకూ విషంపోయాలని తలచాడు రెడ్డి."

సుబ్బులు కళ్లువిప్పి ఆమెముఖంలోకి చూచాడు.

"ఆనాడు మనకు రాఘవయ్యగారు చేసిన ఉపదేశం మరచిపోయావా? కూటికి బీదలమైనా, గుణానికి మనం బీదలం కామని ఈరెడ్డికి తెలియజెప్పాలి. భయపడి, దేహీ అంటే, నెత్తి అణగతొక్కుతారు బలవంతులు. నిలదొక్కుకొని ఎదురుతిరిగితే కాలు కదపలేరు. పిరికిపందలు."

సకిలించాడు సుబ్బులు.

"ఈ కమతం విడిచిపెట్టితే బ్రదకలేనని నీకు భయం వద్దు. నీకు నేనున్నాను; నాకు నీవున్నావు. మనిద్దరికీ రాఘవయ్యగారున్నారు. లే! వెళ్లి రేపే రెడ్డితో చెప్పి చక్కారా: వెళ్లిపోదాం."

"లక్ష్మమ్మని విడిచిరావడం ఎట్లా రమణీ?" అని అడిగాడు సుబ్బులు.

"ఆమె ఈకొడుకుని విడిచిపెట్టి వేరే కాపరం పెట్టితే అప్పుడు నువ్వూ నేనూ ఆమెపాదాలు వొత్తుదాం."

"ఆమె అడిగితే ఏం చెప్పేది రమణీ?"

"నేను రమ్మని లాక్కొనిపోతున్నానని నామీద చెప్పు."

"అయితే కమ్మవారిపాలెం వెళ్లుదామంటావా?"

"కమ్మవారిపాలెం నీ కిష్టంలేకుంటే, మరొకపాలేనికి పోదాం."అన్నది రమణి.

చంద్రుడ స్తమించి, చీకటిపడి తూర్పురేఖ లారకుండానే రమణి నింటికి తీసుకొనిపోయినాడు సుబ్బులు.

రామిరెడ్డికమతం విడిచిపోవడానికి నిశ్చయం చేసుకొని, బావవచేలో కుప్ప నూర్పించడం అయినమర్నాడు రమణిని ముందుగా కమ్మవారిపాలెం పంపించి, తాను వెనకనే నిలబడిపోయాడు.

[తరువాయికథ తరువాతి సంచికలో]




# ఆవిరియంత్ర చరిత్ర



**— శ్రీ డి. ఎ. ఎ. యస్. నారాయణరావు —**

ఈనాడు పరమాణుయంత్రాలు రాబోతున్నాయి. అవి వచ్చేయంటే ఆవిరియంత్రాలను వెనుకకు తోసేస్తాయి. కాని ఆవిరియంత్రాలు వచ్చి, మానవనాగరికతను ఎంతో వృద్ధిచేసేయి. అవే విద్యుచ్ఛక్తినీ, పరమాణుపరిశోధనలనూ సాధ్యంచేసేయి. ఈ కాలాన్ని ఆవిరియుగం (Steam Age) అంటున్నాము. కాని పరమాణుయంత్రాల రాకతో మానవ చరిత్రలో కొత్త అధ్యాయం ప్రారంభమవుతుంది. పరమాణుయుగం అనే మాట 'ఆవిరియుగం' స్థానాన్నాక్రమిస్తుంది.

అనేకవిధాల మానవాభ్యుదయానికి దారితీసిన ఆవిరియంత్రాల చరిత్ర అవలోకిద్దాం. ఈ చరిత్ర ౧౭-వ శతాబ్దంలో ప్రారంభమైనదని చెప్పవచ్చును. ౧౬౬౩ లో ఇంగ్లండులో లార్డు సోమర్ సెట్ అనువతడు కాస్పర్ కాల్ తోఫ్ అనే యంత్రపనివానిసహాయంతో ఒక ఆవిరియంత్రాన్ని నిర్మించేడు. అది చాలా ఆశ్చర్యాన్ని కలుగజేసింది. దాని ఆకర్షణశక్తిని చూసి తను సాధించిన విజయంతో గర్వం పొంది విఱ్ఱవీగకుండా జాగ్రత్తగా ఉండాలనుకొంటూ తన్ను తానే ఉద్దేశించుకుంటూ ఒక పద్యం వ్రాసుకొన్నాడు సోమర్ సెట్.

తరువాత మూడుదశాబ్దాలపాటు నిర్లక్ష్యం చేయబడింది ఆవిరియంత్రం. కాని ౧౬౯౮ లో ఇంగ్లండులోనే సేవరీ అనునతడు పూర్వపు యంత్రం కంటె మంచిదానిని ఊహించి, ప్లానులు వేసేడు. ౧౬౯౯ లో తన ఉద్దేశాలప్రకారం ఒక మోడలు నిర్మించి లండనులోని రాయలుసొసైటీకి చూపెట్టేడు. తరువాత చక్రవర్తికికూడా చూపెట్టేడు.

అదేకాలంలో ఫ్రాన్సుదేశానికి చెందిన పాపిన్ అను శాస్త్రజ్ఞుడు ఆవిరియంత్రనిర్మాణంలో నిమగ్నుడై ఉన్నాడు. పాపిన్ అసలు వైద్యశాస్త్ర విద్యార్థి. అతడు పేరిస్‌లో హైజిన్సు అనే సుప్రసిద్ధ శాస్త్రకారునివద్ద చేరి ఒక ఉష్ణయంత్రనిర్మాణంలో ముందు కొంత కృషిచేసేడు. ఆ తరువాత ఇంగ్లండు వెళ్లి అక్కడ కొన్ని యంత్రనిర్మాణాలు చేస్తూ రక్షణకవాటము (Safety valve) అన్నదానిని కనిపెట్టేడు. ఆవిరియంత్రాలన్నిటిలోనూ నీటిని మరగించే పాత్రకు ఈ రక్షణకవాటాన్ని ఉంచుతారు. ఆవిరి తొందరగా తయారై ఒత్తిడి విపరీతమైనప్పుడు ఆపాత్ర బ్రద్దలైపోవచ్చును. కాని ఈ రక్షణకవాట మున్నట్లయితే ఒత్తిడి మరీ ఎక్కువయినప్పుడు ఆవిరి దీనిని తెరచుకొని దీనిగుండా బయటికిపోతుంది. పాత్ర బద్ద

లయే ప్రమాదం తప్పుతుంది. ఇలాగ పాపిన్ కనిపెట్టిన గతుణకవాటను ఆ తరువాత అత్యుపయోగమైన దైనది.

ఫ్రాన్సునుండి ౧౬౮౫ లో ప్రొటెస్టెంట్లను తరిమివేసేరు. ఆ సందర్భంలో పాపిన్ తన దేశంలో నివసించే భాగ్యం కోల్పోయేడు. జర్మనీలోని హెస్సెనుకు చెందిన లేండ్ గ్రేవ్ కార్ల్ అతనిని ఆహ్వానించేడు. అక్కడ అతడు విశ్వవిద్యాలయంలో ఫిజిక్సు, గణితములమీద ఉపన్యాసములిస్తూ, యంత్రనిర్మాణం మీద కృషిచేసేడు. ఆవిరియంత్రాన్ని నిర్మించాలనే ఉద్దేశం కలిగిందతనికి. లేండ్ గ్రేవ్ కూడా అందుకు ప్రోత్సాహమిచ్చేడు. కాని ఆకాలంలో లూయీ XIV జర్మనీతో పోరాటం సల్పుతూండడంనుంచి లేండ్ గ్రేవ్ పాపిన్ పరిశోధనలమీద శ్రద్ధచూపెట్టలేకపోయేడు. పాపిన్‌కు ఆర్థికంగా ఇబ్బందులు వచ్చేవి. అలాగ కొంత నిరుత్సాహం వచ్చింది. ౧౬౯౦ లో అతడు ఆవిరియంత్రనిర్మాణానికి తాను వేసిన ప్లానును ప్రచురించివేసేడు. ఆ ప్లానులో ఎక్కువ ఒత్తిడిమీద పని చేసే యంత్రాలనుగురించీ, స్టీమర్లను నడపగల యంత్రాలనుగురించీకూడా ఉంది.

మళ్లీ ౧౬౯౮ లో ఆవిరియంత్రంగురించి పని చెయ్యడానికి పాపిన్‌కు అవకాశం వచ్చింది. లేండ్ గ్రేవ్ కి ఫుల్డానది ప్రక్కన ఒక భవనం ఉంది. ఆనదిలోనుండి తన భవనంగోపురంమీదకు నీళ్లను పంపేనిమిత్తం ఒక యంత్రాన్ని నిర్మించమని పాపిన్‌ను అడిగేడు లేండ్ గ్రేవ్. పాపిన్ తను ప్రచురించిన ప్లానుప్రకారం కాకపోయినా, ఇంకొకవిధంగా ఒక యంత్రాన్ని నిర్మించి అది నదిలోని నీళ్లను భవనగోపురంమీదకు తరిమేటట్లు చేసేడు. కాని కొద్దికాలంలోనే నదిలో గడ్డకట్టిన మంచు ఆ యంత్రాన్ని నాశనంచేసింది. లేండ్ గ్రేవ్ కి దానిమీద ఉత్సాహం పోయింది.

ఇదే సమయంలో ఇంగ్లండులో సేవరీ నిర్మించిన ఆవిరియంత్రంప్రఖ్యాతి వ్యాపిస్తూంది. అది విని లేండ్ గ్రేవ్ పాపినును ఇంకొక ఆవిరియంత్రం నిర్మించమని నియోగించేడు. ౧౭౦౭ లో పాపిన్ ఒక యంత్రాన్ని నిర్మించి అది ౭౦ అడుగుల ఎత్తుకు నీటిని పంపేటట్లు చేసేడు. కాని ఆ నీటిగొట్టాలు సరిగా లేక నీరుకారేది. లేండ్ గ్రేవ్ ఒక రాగిగొట్టాన్ని చేయించేడుకాని ఇతర పనులవలన దీనిమీద మళ్లా ఉత్సాహం చూపెట్టలేకపోయేడు. ఆ రాగిగొట్టాన్నికూడా ఏదో అవసరం వచ్చి పాపిన్‌వద్దనుండి తీసుకొన్నారు. దానితో పాపిన్‌కు అక్కడ ఉండడానికి నిరుత్సాహం ఎక్కువయింది. ఎలాగైనా ఇంగ్లండు పోయి, అక్కడ ఆవిరియంత్రనిర్మాణం చెయ్యాలని బుద్ధిపుట్టింది. ఇదివరకతడికి ఇంగ్లండులో పనులు సాఫీగా జరిగేయి. అందువలననే మళ్లా ఇంగ్లండు వెళ్లాలని బుద్ధిపుట్టింది. అతడు హెస్సెనులో నిర్మించిన యంత్రంవిపులాలను ప్రచురించి, ఆ విశేషాలను లైబ్నిట్జ్ అన్న శాస్త్రజ్ఞునికి పంపేడు. పాపిను నిర్మించిన యంత్రం పని చెయ్యడానికి ఒక మనిషి కూర్చుని దానిలో కవాటాలను (Valves) తెరుస్తూ, మూస్తూఉండాలి. అలా మనిషి అక్కరలేకుండా, వాటంతట అవే జరిగేటట్లుగా లైబ్నిట్జ్ ఒక సూచన చేసేడు.

పాపిన్ ఇంగ్లండు వెళ్లడానికి సన్నాహాలు చేసుకొన్నాడు. హెస్సెన్‌నుండి బ్రెమెన్‌దాకా స్వంతపడవమీద వెళ్లి, అక్కడనుండి తన పడవను స్టీమరుమీద పెట్టుకువెళ్లవచ్చు ననుకున్నాడు. అందుకని ఒక చిన్న పడవను నిర్మించుకొన్నాడు. దానిని ఇంగ్లండులో తా నిదివరకు చూసినమాదిరిలో చేసి, తనతోపాటు ఇంగ్లండు తీసుకొనివెళదా మనుకున్నాడు. అక్కడ దానికి చిన్న ఆవిరియంత్రాన్ని అమర్చి, యాంత్రసహాయాన్ని నడపాలని ఊహించేడు.

ఆస్తి, కుటుంబంతోపాటు తను నిర్మించిన పడవమీద బయలుదేరేడు. దాని ఆకారం ఆ ప్రాంతాలవారికి వింతగా ఉంది. ముండెన్‌ప్రాంతాలలో నావికులు పాపిన్‌పడవయొక్క వింత ఆకారాన్ని చూసి, దానిని నాశనంచేసేరు. ఆస్తిని పోగొట్టుకొని పాపిన్ ఇంగ్లండులో నిస్సహాయుడయ్యేడు. అతని శ్రేయోభిలాషులయిన బాయిల్, హుక్ మొదలైనవారు అప్పటికి మరణించేరు. అతడు తన ఆవిరియంత్ర నిర్మాణంప్లానులనుగురించి రాయల్‌సొసైటీకి చెప్పినా, అదేమంత ఉత్సాహం చూపలేదు. ౧౭౧౨ ప్రాం

త్లలో దుర్భరదారిద్ర్యానికి పాలయి అన్యదేశంలో మరణించేడు ఆవిరియంత్ర నిర్మాణంలో ఘనాయులు చేసిన పాపిన్.

నీరు మరిగే పాత్రనుంచి ఆవిరిపిస్టను అముర్చబడియున్న వేరే గొట్టంలోనికి పోయి అక్కడ వ్యాకోచిస్తే మంచిదని పాపినే మొదట ఊహించేడు. ఇతడు ౧౬౯౦ లో ప్రచురించిన గ్లాసును హుక్ అను శాస్త్రజ్ఞుడు ఇనపవర్తకుడు, నేర్పైన కంసాలి అయిన న్యూకోమెను అనువానికి ఇచ్చేడు. ౧౭౦౫ నుంచి న్యూకోమెన్, సేవరీలు కలిసి పనిచేసేరు. ౧౭౧౧ లో ఒక ఆవిరియంత్రం నిర్మాణమయి వచ్చింది. మొట్టమొదటిసారిగా అందులో నీరుమరిగే పాత్ర, ఆవిరి వ్యాకోచించే గొట్టము, పిస్టను ఉన్నాయి. దానిలో కవాటములను తెరుస్తూ మూస్తూ ఉండడానికి ఒక కుర్రవాడు నియోగింపబడ్డాడనీ, వాడు పిస్టనుకీ, కవాటానికీ తాడుతో ఒక బంధం ఏర్పరచి అవసరమైనప్పుడు కవాటం దానంతట అదే తెరచుకొనేటట్టూ, మూసుకొనేటట్టూ చేసి, ఆటసరదావీద వెళ్ళిపోయేవాడనీ అంటారు. ఏమయితేనేం, త్వరలోనే మనిషి అవసరం లేకుండా కవాటాలు వాటంతట అవే పని చేసే ఏర్పాటు ప్రవేశపెట్టబడింది. అలాగ ప్రస్తుత రూపానికి దగ్గరలో ఉన్న ఒక ఆవిరియంత్రం వచ్చింది. దీని సాయంతో బొగ్గుగనులలోని నీటిని తోడివేయడానికి వీలయింది. ఇటువంటివి ఇంగ్లండులో బొగ్గుగనులలో ఉపయోగపడ్డాయి ౧౮-వ శతాబ్దం మధ్యలో.

౭౦ సంవత్సరాల తరువాత ఆవిరియంత్రంలో జేమ్స్ వాట్ తెచ్చిన అభివృద్ధిని తెలిసికొనేముందు, ఇది ఏ సూత్రాలపై పనిచేస్తూందో గమనించాలి. ఒక గొట్టం (Cylinder) లో బిగువుగా పట్టే ఒక పిస్టను ఉంటుంది. ఇంకొక పాత్ర (Boiler)లో తయారయిన ఆవిరిని ఆ గొట్టంలోనికి క్రిందనుండి ఒక కవాటంగుండా పంపినట్లయితే అది పిస్టనును మీదకు తోస్తుంది. కాని ఇంతలో ఆ కవాటాన్ని మూసివేసి, గొట్టంలోని నీటిఆవిరిని చల్లార్చినట్లయితే, అది నీరుగా మారిపోతుంది. పిస్టనుక్రింద శూన్యం ఏర్పడుతుంది. అందువలన పై గాలిఒత్తిడి పిస్టనును క్రిందకు నొక్కుతుంది. పిస్టను క్రిందకు వస్తుంది. మళ్ళా కవాటాన్ని తెరచి, గొట్టంలోనికి ఆవిరిపంపితే పిస్టను మీదకు పోతుంది. ఇలాగ పిస్టను కిందకూ, మీదకూ ఆడేటట్లు చేయవచ్చును. ఈ చలనాన్నే ఒక లివరుమూలంగా ఇంకొక కమ్మీకికూడా కలిగేటట్లు ఏర్పాటు చేయవచ్చును. ఆ క్రిందకూ, మీదకూ ఆడే కమ్మీ నూతి నుండిగాని, గనులనుండిగాని నీరు తోడేటట్లు చేయవచ్చును.

న్యూకోమెన్ చేతులలో ఆవిరి యంత్రానికి కొద్దిగా రూపం వచ్చింది. అక్కడక్కడ ఉపయోగపడిందికాని దాని ఉపయోగంలో అనేకమైన నష్టాలుండేవి. వాటినన్నిటినీ పోగొట్టి ఆవిరియంత్రానికి సరియైన రూపాన్నిచ్చినవాడు జేమ్సు వాట్.

ఈ జేమ్సువాట్ స్కాట్లండులో జన్మించేడు. చిన్నప్పుడు చాలా నీరసంగా ఉన్నా, ఉత్సాహానికి లోపం లేదు. యంత్రసంబంధమయిన పనులమీద అభిరుచి కలిగి ఉండేవాడు. పేదతనమువలన యూనివర్సిటీ చదువుకు అవకాశం లేకుండా, పద్ధెనిమిదవ ఏటనే ఇతడు కర్మాగారంలో ఎప్రెంటిస్ గా చేరవలసి వచ్చింది. కొన్నాళ్లు అనుభవం సంపాదించిన తరువాత గ్లాస్గోయూనివర్సిటీలో మెకానిక్ గా నియోగింపబడ్డాడు. ఇతడప్పటికే అనేక విషయాలు నేర్చుకొని, పరికరణముల తయారులో అతినేర్పు చూపేవాడు. యూనివర్సిటీ ఆచార్యులకు ఇతడి నేర్పు, మంచితనముల మూలంగా ఇతడంటె ఎక్కువ ఇష్టంగా ఉండేది. ముఖ్యంగా అక్కడ రసాయనికశాస్త్రపండితుడు బ్లాక్ ఇతనికి ప్రాణస్నేహితుడైనాడు.

ఆవిరియంత్రంగురించి వాట్ కు మొదటిసారి ౧౭౫౯ లో తెలిసింది. అప్పటి కితడికి ౨౩ సంవత్సరాల వయస్సు. ఆ తరువాత కొంతకాలానికి గ్లాస్గో యూనివర్సిటీకి చెందినది అటువంటి యంత్రం ఒకటి ఉందనీ, అది లండనులో మరమ్మత్తుకోసం పోయి ఉందనీ అతడికి తెలిసింది. తాను మరమ్మత్తుచేయడానికిగాను ఆ యంత్రాన్ని తెప్పించవలసినదని యూనివర్సిటీని కోరి దానిని ౧౭౬౩ లో తెప్పించు

కొన్నాడు. ఈ మధ్యలో అతడు పుస్తకాలద్వారా అప్పటి ఆవిరియంత్రాలనుగురించి చదివి తెలిసికొని, ఆవిరియంత్రసూత్రాలమీద కొన్ని ప్రయోగాలు చేసేడు. తరువాత యూనివర్సిటీ తాలూకు యంత్రాన్ని బాగుచేసేడు. ఇలాగ ఆవిరియంత్రంతో సంబంధము పెట్టుకొన్న వాట్ ఆ న్యూకోమెను యంత్రాన్ని బాగుచేయడంతో ఊరుకోలేదు. అప్పటివరకు ఆ యంత్రాలు ఎందుకు ఎక్కువ ఉపయోగంలోనికి రాలేకపోయేయి, వానిలో ఉండే లోపాలేమిటి అని తీవ్రంగా ఆలోచించేడు. వాటిని అభివృద్ధి చెయ్యడానికి పూనుకొన్నాడు.

౧౭౬౩ నుండి వాట్ దీనిని గురించి ఆలోచిస్తూనే ఉన్నాడు. ౧౭౬౫ లో ఒక ఆదివారం సాయంత్రం షికారుగా నడుస్తూంటే అతడికి ఒక ఊహ తట్టింది. నీటి ఆవిరిని సిలిండరులోనే చల్లార్చకుండా, వేరే ఇంకొకచోటికి లాగివేసి, అక్కడ చల్లార్చినట్లయితే, చాలా ఉష్ణశక్తినష్టాన్ని తప్పించవచ్చును; అలాగ ఒక పెద్ద లోపాన్ని తప్పించవచ్చును. ఈ అభిప్రాయాన్ని ఆచరణలో పెట్టేడు. అదివరకు ఆవిరియంత్రంమూలంగా ముందువెనుకకు ఒకే గీతలో చలనముండేది. వాట్ మొదటిసారిగా ఆ చలనాన్ని చక్రాలు తిప్పడానికి వీలుగా ఉండేటట్లు చేసేడు. అంతేకాకుండా ఆవిరియంత్రంవలన చక్రాలు తిరుగుతున్నప్పుడు అవి ఎప్పుడూ ఒకేవేగంతో తిరిగేటట్లు ఒక కంట్రోలును ప్రవేశపెట్టేడు. దానిని వాట్ గవర్నరు అంటారు. ఇలాగ అతడు క్రమేపి ఎన్నో మార్పులు తెచ్చేడు ఆవిరియంత్రంలో ప్రస్తుతం ఉపయోగంలో ఉన్న ఆవిరియంత్రాలన్నిటిలో నూ ఇతడు తెచ్చిన మార్పులు ఉంటాయి.

వాట్ మొదటిలో తన అభిప్రాయాలప్రకారం చిన్న మోడలు నిర్మించిచూస్తే అది బాగా పనిచేసింది. ఇక పెద్ద ఆవిరియంత్రాన్ని నిర్మించడం సమస్య అయింది. అతడు యూనివర్సిటీని వదిలిపెట్టేడు. ఒక పెద్దయంత్రాగారం స్థాపించి, అందులో తన ఉద్దేశాలప్రకారం ఆవిరియంత్రాన్ని నిర్మిద్దామని వాంఛించేడు. కాని ఆర్థికపరిస్థితులు దానిని కొనసాగనియ్యలేదు. మార్గమేమని ఆలోచిస్తూ ఉండగా ఇతని స్నేహితుడైన బ్లాక్ ఇతనిని రోబుక్ అనే ఒక ధనవంతునికి పరిచయంచేసేడు. ఆ రోబుక్ అప్పుడు గనులనుండి బొగ్గును తీసే యత్నంలో ఉన్నాడు. కాని గనులలో నీరు చేరుతూంది. దానిని బయటికి తోడివేసేందుకు ఆవిరియంత్రం అవసరం. వాట్‌ను ఆ పనికై ఒక మంచి ఆవిరియంత్రం నిర్మించవలసినదిగా కోరి, ఖర్చులు భరించడానికి సిద్ధపడ్డాడు. అతడికి కర్మాగారంకూడా ఉంది. వాట్ దానిని గురించి తొమ్మిదిసంవత్సరాలు పాటుబడ్డాడుకాని ఫలించలేదు. ఆ కర్మాగారను వాట్ ఆవిరియంత్రనిర్మాణానికి అవసరమైనంత పెద్దది కాకపోవడమే దానికి ముఖ్యకారణం. ఆ కాలంలో రోబుక్ బొగ్గుగనులు నీటిలో పూర్తిగా మునిగిపోయి, అతనిని దివాలా

వాట్ కొంత నిరుత్సాహపడ్డాడు. అతడి యంత్రనిర్మాణానికి పెద్ద కర్మాగారము కావాలి, ఎలాగ అని కించపడుతున్నాడు. కాని అదృష్టవశాత్తూ బర్మింగ్‌హాము ప్రాంతంలో సోహో అనుచోట ఒక పెద్ద కర్మాగారానికి అధికారి అయిన బోల్టను అనునతడు వాట్‌ను తన కర్మాగారానికి ఆహ్వానించేడు. ౧౭౭౪ లో వాట్ అక్కడ చేరేడు. రెండేండ్లలో ఒక మంచి ఆవిరియంత్రం తయారయింది. అది చాలా విజయవంతమైనది. ఆ రోజు వాట్ ఆనందం పట్టరానిదైనది. సంవత్సరాల శ్రమ ఫలించింది. ఆ ఆవిరియంత్రం సాఫీగా పనిచెయ్యడం, దానిలో బొగ్గు ఖర్చు తక్కువవడం మొదలైన విషయాలు నాల్గుమూలలా వ్యాపించేయి. దానితో వాట్ డిజైను ప్రకారం ఎక్కువగా ఆవిరియంత్రాలు నిర్మింపబడ్డాయి. వాటిని స్థాపించడంలో చాలాచోట్ల వాట్ ముందుగా సహాయపడేవాడు. వాట్ యంత్రాలు వచ్చిన తరువాతనే చాలా బొగ్గుగనులు త్రవ్వడానికి వీలయింది. వాట్ యంత్రం గనులనుంచి బొగ్గు ఎక్కువగా తీయడానికి వీలుకలుగజేయడంవలన బొగ్గు ఉత్పత్తి ఎక్కువయింది. బొగ్గు ఎక్కువ లభించడంమూలంగా అనేక విధాలుగా అనేక ఆవిరియంత్రాలు ఉపయోగం

లోనికి రావడానికి వీలయింది. అలాగ ఆవిరియంత్రాలు వివిధపరిశ్రమలలోనికీ ప్రవేశించి, పారిశ్రామికవిప్లవం కొనితెచ్చేయి.

ప్రస్తుతం ఉపయోగంలో ఉన్న ఆవిరియంత్రానికి నిర్మాత వాట్ అనే చెప్పవచ్చును. అతడు మొదటిలో అనేక కష్టాలు పడ్డాడు. అతడు చేసిన పరిశోధనలు లాభదాయకమయినప్పుడు అంతా ఉపయోగించుకొనేవారేకాని ముందులో అతడు బాధపడుతూంటే సహాయముచేసేవారుకాని, యంత్రనిర్మాణం గురించి ఇబ్బందులుపడుతూంటే అవకాశాలిచ్చేవారు కాని అరుదు. మీదు మిక్కిలి అతని పనికి స్వలాభాపేక్షతో అడ్డుపెట్టినవా రున్నారు. అతడు ఒక మారు శ్లేషతో "మానవుని కుటిలత్వము నమ్మదగనంత ఎక్కువగా ఉంది" అన్నాడు. ఎన్ని అడ్డు వచ్చినా ఆవిరి యంత్ర నిర్మాణాన్ని సాధించేడు.

జేమ్సువాట్ స్మృతిచిహ్నంగా కట్టబడిన గోరీపై అతడు మానవశక్తులను వృద్ధిచేసినవాడనీ, మానవజాతికి మహోపకారాన్ని గావించినవాడనీ వ్రాయబడింది. నిజమే. అతడు మానవజాతికి ఎంతో శ్రేయస్సును కలుగజేసేడు. ఉష్ణశక్తిని యాంత్రిక శక్తిగా మార్చి, ఉపయోగించుకొని, వస్తూత్పత్తిని ఎక్కువచేసికోడానికీ, అసాధ్యములైన పనుల నెన్నో చేయగలగడానికీ అవకాశాలు కల్పించేడు. మానవ చరిత్రలో అతని పేరు చిరస్థాయిగా ఉండవలసినదే.

ఇలాగ సోమర్‌సెట్, సేవరీ, పాపిన్, న్యూకోమెన్, వాట్సుచేతులలో రూపం దాల్చిన ఆవిరి యంత్రం ఈరోజు మన సంఘజీవితంలో ప్రముఖపాత్ర నిర్వహిస్తూంది. కాని అనతికాలంలోనే దీని ప్రాముఖ్యానికి భంగం కలిగే సూచనలు అగపడుతున్నాయి.



# వరూథిని

[నాటిక]

= శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు =

## ప్రథమ దృశ్యం

(గాలిపాట)

వరూధినీ! వరూధినీ! వరూధినీ!
సుప్తి మేలుకొన్నుమిా,
స్వప్నసుషుప్తి మేలుకొనుమిా!
వరూధినీ! వరూధినీ! వరూధినీ!
హిమగిరినిస్రుతధునీ
కలకలధ్వనీ
పులకితాప్సరః ప్రణయినీ!
వరూధినీ! వరూధినీ! వరూధినీ!
సుషిమమందహాసినీ
ఉషస్వినీ కిసలయాంగుళీ
స్ఫుషితతనూవిలాసినీ!
వరూధినీ! వరూధినీ! వరూధినీ!
... ... ... ... ...
... ... ... ... ...

(చెలికత్తెల బృందగానం)

మలయపర్వతసాను
వులనుండి దిగివచ్చి
కమ్మతెమ్మెరకూన
కన్నురెప్పల పొంచె;
కలకలస్వర మొల్క
కలకంఠి నిను పిల్చె,
సెలయేటి బాలము
ద్దుల డోలికల పూన్చె!
గిరిబాల! నీ నెచ్చె
లుల పాట వినవేల,
వరవరూధిని, వికస
స్వరశుభోదయవేళ!
గిరిబాల! నీ నెచ్చె
లుల పాట వినవేల?

మొదటి చెలి—గిరిమల్లికల పాన్పుపైని కదంబ కందుకములు తలదిండుగా పవ్వళించి నిర్మలసుప్తి శాంతిలో మునిగితేలే మన వరూధినిఅధరోష్ఠము ఈ నిశాంతవేళ అర్ధచైతన్యముతో, అదేలనో, అలస నిశ్వాస మొలసినట్లు కంపనమొందుచున్నదేమే?

రెండవ చెలి—దినకరుని కవోష్ణకరస్పర్శకు మానససరోవరకల్హారముకుళములవలె తరళాక్షివరూధిని కనురెప్పలు, అవిగవిగో, వికసనోన్ముఖము లగుతున్నవి!

మొదటి చెలి—ప్రసవశయ్యపై ఒత్తిగిలిన నగ్న సుందరి వరూధిని స్నిగ్ధకోమలగాత్రము హర్ష పులకితమైనదో, లేక ఆశ్చర్యచకితమైనదోగాని, ఆపాదమస్తకము ఆరీతిని గగుర్పాటు పొందినదేమే?

రెండవ చెలి — అదిగో అమరనర్తకి, మన నెచ్చెలి, కోమలబాహువల్లరీవిన్యాసముతో ప్రక్కకు ఒరిగి, కలతనిద్దురతెరలను తొలగించుకుంటూ ఏమో కలవరిస్తున్నదే!

వరూధిని—(సగము మేల్కొని, ఆవలించి) "......తెరు వెవ్వరి వేడెదు, భూసురేంద్ర!" (అని కూనరాగం తీస్తుంది)

మొదటి చెలి—వరూ! వరూ! అదేమే, అర్ధ నిద్రలోనే కూనరాగ మాలపిస్తున్నావు?

వరూధిని—అబ్బా!!! ఆకల అంతర్ధానమైనదటే?...ఆతారుణ్యమూర్తి 'వసంతజయంతికంతులన్ చక్కదనంబునన్ గెలువజాలిన' పరమ తేజోశాలి సుమా!

మొదటి చెలి—ఆ గంధర్వకుమారుని ఆలోచన మేనటే రాత్రిందివాలు, వరూ?

వరూధిని—ఆ గంధర్వుని మాట నాతో అనవద్దంటినిగా?...ఈఅందగాడెవరో భూసురపుత్రుడే! కైతవకుసుమశరాసనుడే!... అమలాలోకముగా స్వప్నజగత్తున అవతరించి, నాప్రియుడు అమలజ్వాలగా ప్రొద్దుపొడుపున అంతర్హితుడైనాడే!

రెండవ చెలి—అది నీవు కలతనిద్రలో గాంచిన కలగాబోలునే, వరూ!......సరేకాని, ఈ ప్రభాతము ప్రొద్దుపొడిచిన మాటయే మరచితివా యేమే?

వరూధిని—ఔనే, సఖీ!...ఈ పొద్దుపొడుపు వేటకత్తె నా నిద్దురపాగమందుచపావురాయిని హరించినదే! ఎంత కటికిగుండెల కాణాచి!

మొదటి చెలి—ప్రభాతకాంతిలో ప్రస్ఫుటమైన యథార్థసౌందర్యానుభూతిని స్వీకరింపక, ఈ రీతిగా కలతనిద్దురకలవరింతలతో కాలముపుచ్చుట అచ్చరసానుల ఆచారము కాదే, వరూ!

వరూధిని — అంధరాత్రీతమస్సున విరిసిన ఆ స్వప్నసంయోగము నందనవనవిలసితమైన స్వర్గభోగము కన్న మిన్నగా తోచినదే, సఖీ! సురసౌందర్యము నా కీప్రొద్దున వెగటై, నా కలలోని భూసురగాంభీర్యమే ఆకర్షణీయముగా నున్నదే. మన స్వర్గసీమయే ఒక స్వప్నమై, ఆ భూతలస్వర్గమే యథార్థము కానున్నదేమో! కానిచో, తానై వలచివచ్చిన ఆ గంధర్వకుమారు నేల త్రోసిపుత్తును?...చెప్పవే చెలీ!

మొదటి చెలి — హిమగిరిసానువులనున్న యీ అప్సరల ప్రమదావనసీమ సురలకు స్వర్గసీమ; భూసురులకు స్వప్నసీమ. నేడు నీ వీలాగున సౌందర్యార్త్యన విడనాడి ఛాందసచర్చపాలైతివేమే, వరూ!

వరూధిని—సఖీ! నా మాటలు ఛాందసచర్చ కాదే. శృంగారాంబరమున నొక నూతనశృంగము నా స్వప్నతూలికతో చిత్రించుచున్నానే!

మొదటి చెలి—ఇదేమి విచిత్రమమ్మా, వరూధినీ!—జాగ్రత్తసుమా! నీ వంతగా కోరినచో నీ వింతకలయే నిజమై, నీ విపరీతశృంగారము పొంగిపొరలి, తుదకు శృంగభంగముపాలు కాగలవు!

వరూధిని—అచ్చరలకు పుట్టుకతో పుట్టిన స్వైరప్రణయమే అనాచారమని ఈ నాటికి నీ నోట విన్నానే, సఖీ!

మొదటి చెలి—సరేకాని, వరూ!, ఆ వీణియ నీ కొరకెంత పరితపిస్తున్నదో చూడు. నీపల్లవాంగుళీస్పర్శ నాసించి, రేయిరేయెల్ల కృశించి, కంపించి పాటపాడే ఆ విపంచికాతంత్రుల నీ వించుక శ్రుతి చేయవమ్మా, — నీ హృదయవిపంచితంత్రులు కూడ సమేళ మొందగలవు!

"వాలారుం గొనగోళ్ల నీ వలపతన్
వాయింపుచో నాటకున్
మేళంబైన విపంచి నిన్న మొదలున్
నీ వంటమింజేసె యా
యాలాపంబె యవేళ బల్కెడి, ప్రభా
తాయాతవాతాహతా
లోలత్తంత్రుల మేళవింపగదవే,
లోలాక్షి, దేశాక్షికిన్!"

వరూధిని—ఓ నా విపంచికాసఖీ! నీపైనను నా స్వప్నగాథను, నా విరహబాధను నీ సుకుమారతంత్రులపై ప్రపంచించవమ్మా! ఈ చెలికత్తెలు తలకు మించినవారై పోయినారు!

వీణా!
విరహవేదనాగాథ పల్కుమా!
వీణా!
కరుణసాంత్వనాసుధ చిల్కుమా!
హిమశిఖరీముఖరిత స్వర్ణదీ
లహరీగభీరరుతి గతిగా
వీణా!
విరహవేదనాగాథ పల్కుమా!



# రేవులోని పని

స్టీమర్లలో సరకులను నింపుట, మరియు సరకులను రేవుమీద తీయుటన్న మిక్కిలి సాహస కార్యము. దాహమును పుట్టించును. అందులో తీక్ష్ణమైన ఎండలో మరీ యెక్కువ. బరువును ఎత్తెడు యంత్రము బరువును దింపి తిరిగి వచ్చునంతలో ఇతర సరకులను తయారుగా నుంచవలెను. పంచులను, పెట్టెలను ఒకదానిపై నొకటి జోడించుట, స్టీమర్లలో నుండి ఓడలలో దింపుట కష్టమైన పని. అయితే వీరంత చురుకుగా నుండ నవసరము లేదు.

రేవులో పనిచేయు కూలీలు తమ పని ముగియగానే టీ త్రాగుటకు పోవుటలో ఆశ్చర్య మేమియు లేదు. తాజాయైన వేడి తేనీరు ఉపశమనమునకు అత్యావశ్యకము.

అందువల్ల కొన్ని చోట్లలో పోర్టు ట్రస్టు వారు రేవువద్ద అంగడి పెట్టుటకు అనుమతి యిచ్చినారు. భారత దేశపు రేవులలో సముద్రతీరపు పడవల ప్రయాణ ప్రదేశములలో నెల్ల నున్న టీ అంగళ్లకు తోటనుండి తాజాగా వచ్చిన తేయాకు క్రమముగా సప్లయి చేయబడుచున్నది.

తరచుగా పంపబడు టీ
నిస్సందేహముగా తాజాగా నుండును.

# బ్రూక్ బాండ్

## రెండు ఆకులు - ఒక మొగ్గ.

అదిగో! అదిగో! మేఘమందరస్వరము! చేరువ చేరువగా నా స్వప్నసుందరుని ఆగమనము!...సఖులారా! విన్నారా?

## ద్వితీయ దృశ్యం

(ప్రవరుని గానం : చేరువ చేరువగా)

హిమగిరీ! హిమగిరీ! హిమగిరీ!
ధాతధాతకలధౌతశబలశిఖరీ!
హిమగిరీ! హిమగిరీ! హిమగిరీ!
మేలుకొన్న మానసకాసారము,
తేరుకొన్న దూగకైలాసము,
పేరుకొన్న తుహినాద్రినివాసము
చేరుకొన్న నాదు మనికి ధన్యముగా—
హిమగిరీ! హిమగిరీ! హిమగిరీ!
ధాతధాతకలధౌతశబలశిఖరీ!
హిమగిరీ! హిమగిరీ! హిమగిరీ!

ప్రవరుడు—ఆహా! సిద్ధులొసగిన ప్రసిద్ధాంజన ప్రభావమువల్ల జీవితసాధనపరమార్థ మొక్కటి కళ్లో కరతలామలక మైనట్లు కనిపిస్తున్నది! అరుణాస్పదపురాగ్రహారసీమ యెక్కడ, మహిమాస్పదమైన తుహినాచలసానుదేశ మెక్కడ?... ఈ బాహ్యనేత్రానుభూతి స్వప్నసదృశమో, యథార్థదృశ్యమో గోచరింపకున్నది! . అదేమి?...ఆ కరుణగభీర గానారవము?...అదృశ్యులైన ప్రమథగణ మాలపించే ప్రబోధమేమో?

(ప్రమథగానం)

హిమకుజ్ఝటికా
భ్రమాకలిత మీ
హిమాలయోత్తుంగ
శృంగమోయి,-
సహేతుకప్ర
స్ఫురత్ హేతిధార
దారిజేసుక రావోయీ!
రావోయీ! ఇటు రావోయీ!
ప్రవరా! విప్రవరా!

ప్రవరుడు—నేత్రేంద్రియానికి అబోధమై, శ్రవణేంద్రియానికి ప్రబోధమై, మనోమయజగత్తెమోచ్చా టనపాటవము నెరపే అదృశ్యగాయకులారా! నాకీ అధిమానసిక అద్భుతప్రపంచపరిసరంలో మీరే మార్గదర్శకులై దారిజూపుదురుగాక!

(ప్రమథగానం)

ఇది హరిద్వార, మిది హృషీకేశ
మిది బదరికావనభూమ్మోయి!
రావోయీ! ఇటు రావోయీ!
ప్రవరా! విప్రవరా!
ఇది రతీమన్మథస్మృతీనిర్మథన
తృతీయనేత్రాగ్నుత్థానలద్యుతి
హృతానంగభస్మశిల్పమోయీ!
రావోయీ! ఇటు రావోయీ!
ప్రవరా! విప్రవరా!

ప్రవరుడు—అవిగో, అవిగో, ఆ తెల్లనిబుబ్బులు! అటుపైన అనతిదూరమునవనే అమలినాంభస్సంగడోలికల నోలలాడే ధవళధవళవిహంగమశ్రేణి. ఆహా! ఏమి యీ హిమవన్నగసానుదేశసుందర దృశ్యగతి! ఏమి యీ గిరిచుంబిప్రపాతసామగానసంగతి!!

(ప్రమథగానం)

ఉమాశివుల సఖ్యానురాగసంభవ
సుమాలయమ్మైన తెల్లటి లిల్లిదె గనుమా!—
హిమాద్రిసెల్ల సుకుమారదృశ్యము
సుమా ఈ స్థానమ్ము, భూసురోత్తమ!
రావోయీ! ఇటు రావోయీ!
ప్రవరా! విప్రవరా!

...... ...... ......

కాంచనగంగా గళితహిమానీ
కలనిస్రుతివిస్తృతధామ మిదె!—
కైలాసామరగంగావాహిని
ధరావతరణ విరామసీమ మిదె,—
మానససరోవరమ్మో!
అమ్లానరమ్యకమలాకరమ్మ,
కైవల్యతృషిత హృదయామృత మిదే
మానససరోవరమ్మ!
రావోయీ! ఇటు రావోయీ!
ప్రవరా! విప్రవరా!

ప్రవరుడు—అదృశ్యప్రమథులారా! హిమాలయపథప్రదర్శకులారా!

జ్ఞానపరమావధిగ
ధ్యానయోగసమాధి
మానససరోవీచీ
లోన ప్రతిఫలితమా
దూరకైలాసశిఖ
రీరమ్యమాడమ్ము
చేరుకోగా నాకు
చేయూతనిం డహో,
ప్రమథులారా!

(ప్రమథగానం)

ప్రమథులు నడిచే
పరిమిత పర్వత
పరిసీమను చేరితిమోయీ!—
కైలాసాలయ
కందరఘోషమె
గతి నీకిక వినుమోయీ!
ఇక రాకోయి! ఇక రాకోయి!
ప్రవరా! విప్రవరా!

(కైలాసకందరమునుండి అశరీరవాణి)

మేధస్సు మంచుగడ్డయి పేరి,
జ్ఞానమ్ము కఠినపాషాణమ్మై,
ధ్యాననిష్ఠ నిశ్చేష్టితమ్మై, నర
మానసమ్ము విరసీకృతమ్మై, హృత్
కోరకమ్ము నిరసీకృతమ్మైతే
చేరరాని దీకైలాసం!
దూరదూర మా కైవల్యం!
సిద్ధాంజన మిక వ్యర్థమ్మై, స్వత
స్సిద్ధహృదయశోధన గాంతువులే,
ఆర్ద్రవేదనానుభూతి నీ కగులే,
అమృతగాన మాలకింతు వికలే,—
అంతరాంతరమె ధన్యకైలాసమోయీ!
అంతరార్థ మంతరాత్మ దెలియగదోయీ!
ఓ ప్రవరా! విప్రవరా!

ప్రవరుడు—(గానం)
కైలాసకందరోద్గళితనిర్ఘోషమ్ము
కాలు కదుపగనీదు, కేలు మెదపగనీదు!
అద్వైతసిద్ధాంజనాలేపనము కరగ,
అర్థమెరుగని ద్వైతబుద్ధి లోలో పెరిగ,—
ప్రమథగానము దూరప్రతినాదమై సురిగ,
భ్రమపరీతవినూత్నపథనిమంత్రణ బరగ!
కనరాని కాంతికై, తనివోని భ్రాంతికై
హిమవన్నగారణ్యతమసావృతపథాన
పరితపించుటయె నా పరమకైవల్యమా?
త్రాహి! త్రాహి! మహాశివా!
నిత్యనిర్మలా!
పాహి! పాహి! హరోంహరా!
సత్యసుందరా!!

## తృతీయ దృశ్యం

(వరూధినికోననుండి అచ్చరల బృందగానం)

సుందరసత్యాన్వేషీ! ప్రవరా!
నందనసుమాభిలాషీ! ప్రవరా!
అందునందు బోవనేల, మా చెలి
మందిరమ్మె స్వాగత మొసగదో!
సుందరసత్యాన్వేషీ! ప్రవరా!
కఠినశిలాకర్కశాగ్రగామివై,
ఎటుల బోదువోయీ, వ్యర్థముగా—
ఇటు రావోయి, సుందరాంగ!
ఇటు రావోయి సుందరా!
సత్యాన్వేషీ! ప్రవరా! నందనసుమాభిలాషీ!

ప్రవరుడు — ఏదియో వినూతనకోమలగానారవము నన్నాహ్వానిస్తున్నది! నిర్మలమానససరోవరాంతరంలో హృదయకహ్లారకోరకవికాససాధన కిదే మార్గదర్శక మగునా? ఈ కలకాకలీస్వరకల్పనాసమ్మోహనము నన్నాకృషించి ఆకృషించి లాగికొనిపోవుచున్నది. ఈ గిరికందరము లెల్లదిశల నా నమ్రమైన నామధేయమే ఈ నాడు మారుమ్రోగుచున్న దేమొకో!

(అచ్చరల బృందగానం)

తెలతెలవారకతారకకాంతి లే
తెరల దొలగద్రోసి విరిసె నుదయిని!

కలతనిద్ర కలవరింత మేల్కొని
తెలిసి వేచె ప్రియునికై వరూధిని !
సుందర సత్యాన్వేషీ ! ప్రవరా !
నందనసుమాభిలాషీ ! ప్రవరా !
రావోయీ ! ఇటు రావోయీ !

ప్రవరుడు—ఏమి లతానికుంజములు, ఏమి సెల యేటికలగానవిరావము, ఏమి మకరందనిస్యందప్రవాహినులు, ఏమి పుష్పోడిదుమారము, ఏమి అతిలోక సుందరసమ్మోహనము !! కనులు మిరుమిట్లుగొల్పే ఇంద్రధనుస్సౌందర్యంలో ధవళకాంతికళిక దాగియున్న రహస్యస్థల మేది ?...ఈ సత్యము తెలిసిన గాని కైవల్యము కరగతము కాదని కైలాసనాథుని గభీరప్రబోధము గదా !...మలఃలై జిగు మరంద కుల్యలు దారిజూపు ఈ కోనదారి నన్వేషింతునుగాక !

(ఇంతలో వరూధినిగానం చేరువగా)
వీణా !
విరహ వేదనాగాథ పల్కుమా !
దూరమారగిరిసానుపారముల నేదో
మారుమ్రోగి చేరువైన మధురశ్రుతి !
వీణా !
కరుణసాంత్వనాసుధ చిల్కుమా !

ప్రవరుడు—అదిగో, ఆ రత్నవేదికపై ఆమ్రకుంజచ్ఛాయ నాసీనమైన ఆ తారుణ్యోజ్జ్వలదీపకళిక స్వప్నసుందరియో, అప్సరనందనియో ఏమో కాని,—ఏ యగాధాంతశ్చైతన్యలోకంలోనో ఆమెను నే నెరిగియుంటిని. అనాదిసంస్కృతి ఏదియో నా అపూర్వ సంస్కృతిని భంగించి, విజయశంఖం పూరించుటకు ఉద్యుక్తమాతున్నది !

విరహోత్కంఠితా ! సుందరీ !
నా తెరు వెరిగింతు వోకో, సుందరీ ?
నీ వెవ్వరో తెల్పుదువో, సుందరీ !
వరూధిని—
పేరు వరూధిని, విప్రకు
మార ! ఘృతాచీతిలోత్తమాహారిణీహే
మారంభాశశిరేఖలు
దారగుణాఢ్యలు మదీయలగు ప్రాణసఖుల్ !

ప్రవరుడు—ఈ ఒంటరికైవల్యపాంథుని నీ వెల్లెరుగుదువు, అప్సరీ !

వరూధిని — అప్సరలకు స్వప్నసంస్కృతియే జ్ఞానసంస్కృతిగదా, యౌవనకుభోంగా !

ప్రవరుడు—సుందరీ ! నా కైవల్యము నీ కేల నున్నదా ?

వరూధిని—కైవల్యము కైలాసశిఖరమున నుండును. స్వామీ ! నా హృదయాశయనుమాత్రము నీకేల నున్నమాట సత్యము !

ప్రవరుడు—నాకేల నున్న దీర్ఘద్రాక్షమాలికయే, బాలా !

వరూధిని—ఆ ద్రాక్షమాలికయే అప్సరప్రియులప్రతీక్షాసాఫల్యపతకమోయీ, తారుణ్యమూర్తీ !

ప్రవరుడు—అది మద భస్మకారకముసుమా !

వరూధిని—ఔన్లే అగును. రతీప్రియుని ఆకారము భస్మమొనర్చి మన్మథుని మరుక్షణమున అనంగునిగా, మనసిజునిగా నొనర్చి అనర్గళస్వాతంత్ర్యమొసగి, విచ్చలవిడి యొనర్చిన దారుద్రాక్షానలమే నోయీ. అదియే కైలాసనాథుడు, ఒక్క రతీపతి వ్రతకేకాక, సతీలోకమంతకు నొనర్చిన అక్రమముని అప్సరలోకమున చిరప్రవాదమోయీ !

ప్రవరుడు—మన్మథదేవుని మనసిజునిగా జేసి, పాంచభౌతికప్రకృతిని భంగించి, ఆధ్యాత్మికపరిణతిని ప్రబోధించిన పరమశివుని వరప్రసాదము సురలోక నిరత మెట్లగును, సుందరీ ?

వరూధిని—పాంచభౌతికత భూప్రపంచవాసు లెరిగిన పదార్థము కాబోలునోయీ ! ఇక, ఆధ్యాత్మికత యన్నను అప్సరలోకానికి ఏదో మిథ్యావాదమై నిరవగాహమైన విషయమే. నిత్యకామనయే మాకు సత్యభావన, సుందరా !

ప్రవరుడు—ప్రత్యేకేతు నాసించిన నిత్యకామనను మర్త్యలోకవాసులు భవబంధముగా భావింతురే గాని, సత్యసుందరముగా సంభావింపరు, అప్సరీ !

వరూధిని—శక్తిహీనమైన మానవలోకము రక్తి రహితమైన ముక్తిపథమునకు ప్రాథేయపడిన పడ నిమ్ము!—సురసుందరుల పరమాశయము ప్రణయబంధనమేనోయీ, ప్రవరకుమారా! ప్రత్యపేక్ష నాసించుట ముక్తిమార్గము నన్వేషించుట కాదా?... ప్రణయనిరీక్షణముమ్ముక్త్యమోక్షముకంటెదికాదోయీ! నిరవధికసంజీవనరసోల్బణమోయీ! అచ్చరల కోనసీమల ఈ సత్యమే అమృతనిస్యందమై ప్రవహిల్లునోయీ, సుశరీరా!

ప్రవరుడు—జ్ఞానతపోనియతి గృశించిన నా మ్లానదేహమున నీ కేసుగుణము గోచరించి, 'సుశరీరా' అంటివి, అప్సరీ?

వరూధిని—

మ్లానకుసుమ పేశలహృది
లో నడంగు ప్రణయాంబుధి,
మానవోత్తమా! అప్సర
కామిని కామితఫలమ్ము!
జ్ఞానమునకు సారము
లోని సుందరానందప్ర
సూనము నాకాంక్షితెమ్ము,
మానవోత్తమా! ప్రవరా!

ప్రవరుడు—(స్వగతం) అమలిన మానసిక సత్య పరిణామానికీ, అమృతకైవల్యధామానికీ మధ్యమార్గంలో అప్సరసౌందర్యసంకర్షణ నిత్యకైవల్యప్రాప్తి విధానమా, లేక అసత్యసౌందర్యభ్రాంతినిధానమా?... అప్సరకామన మర్త్యభావన కతీతమగునా?... కైవల్యధామా! పరమశివా! తమసో మా జ్యోతిర్గమయ!

వరూధిని—నీ డోలాందోళితమానసతరంగాగ్రాన్ని ఈ అప్సరసౌందర్యసుకోమలముకుళ ముద్రూతయాగి వికసితాంభోజముగుట కైలాసకందరప్రబోధమని ఎరుంగుమోయీ, సుందరాకారా!

"ఎందే డెందము కందళించు రహిచే
నేకాగ్రతన్ నిర్వృతిం
జెందున్, కుంభగతప్రదీపకళికా
శ్రీ దీప నెందెందు బో
కందే నింద్రియముల్ సుఖంబు గను నా
యింపే పరబ్రహ్మ' మా
నందో బ్రహ్మ' యటన్న ప్రాజ్ఞుదువు నం
తస్సిద్ధి నూహింపుమా!"

ప్రవరుడు—ఆహా!... ఆమాధుర్యము సౌందర్యమైన, ఆ గాంభీర్యము సత్యస్వరూపమే యగును! శివసుందరమైన నీ ప్రణయప్రతీక్షలోని సత్యమునకు నా జ్ఞానదీప్త నీక్షణను ధారవోయుచున్నాను!—

సురసుందరాంగి కంజలి హృత్ప్రసూనమ్ము,—
కైలాసవాసి కర్పణ మాత్మసూత్రమ్ము!
ప్రణయశిక్షణ మప్సరసరసాకృతినైన
ప్రణవమోక్షము మానవుని కగ్ని సంస్కృతినె!
వరవరూధిని, అచ్చరల రాణి, కలవాణి
పరమకైలాస వాక్ప్రతినిస్వన మ్మేని
సురసుందరాంగి కంజలిహృత్ప్రసూనమ్ము,
కైలాసవాసి కర్పణ మాత్మసూత్రమ్ము,
అమలాగ్నిహోత్ర జిహ్వాల కీతరుణగాత్ర,
మరుణాస్పదమున కంకిత మస్తికచయమ్ము!!

(అచ్చరల బృందగానం)

ధన్యకైలాసయాత్రికా! పుణ్యకైవల్యపథికా!
వరూధిని కళామరున్నారి నీ
వరప్రసాదిని, ప్రవరా!
గిరీశు మాయావిలాససుస్మిత
శరీరపేశల ప్రవరా!
అమాలిన్యమానవాళిమానస
సరోజవాసిని, ప్రవరా!
హిమాద్రికందర ముముక్షుపాంథుల
కు మోక్షదాయిని, ప్రవరా!

# 'పృథ్వీ' పాతము : గ్రహచేష్టలు

## = శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు =

గత (డిశంబరు) మాసారంభమున మదరాసు నగరములో నొక ఘోరమగు ఆకస్మిక ప్రమాదము జరిగి, తీరని ధనప్రాణనష్టము సంభవించిన దని వార్తాపత్రికల మూలముగా పాఠకలోక మెఱిఁగియుండును. పృథ్వీఇన్స్యూరెన్సు కంపెనీవారికి చెందిన ఒక మహోన్నత భవనముయొక్క కొంతభాగము తలవని తలంపుగా నేలఁగూలి అందు పని చేయుచుండిన కంపెనీఉద్యోగులలో కొందఱిని, కూలిపని వారిలో కొందఱిని మృత్యుముఖమున పడఁద్రోసినది. ఆభవనమును ఈ కంపెనీవారు కడచిన అక్టోబరునెల 1-వ తేదీ నాఁడు విక్రయించుకొని, దానిలో అదేనెల 16-వ తేదీ నాఁడు ప్రవేశించిరఁట. తరువాత ఏఁబదిదినములకే ఈ భవనభాగము కూలుట!

ఈ భవనము రమ్యమైన మూఁడంతస్తుల మేడ. మొదటి అంతస్తులో పై కంపెనీవారి ప్రధాన కార్యస్థానము నెలకొల్పఁబడి యుండినది. ఆ అంతస్తులోనే కొంతభాగమును తిరువాన్కూరు బ్యాంకువారి కార్యాలయమునకు బాడుగ కిచ్చియుండిరి. రెండవ అంతస్తులో శ్రీ శంకరన్ అనునతఁడు బాడుగకు కాపురముండెనఁట! నేలఅంతస్తు ఖాళీగా నుండినది. భీమాకంపెనీవారు దీనిలో ప్రవేశించిన తరువాత, తమ సౌకర్యమునకు వలసిన విధముగా ఆభవనమును కొంత మార్చుటకు, కొన్ని చిల్లర మరమ్మతులు జరుపుటకు నిశ్చయించినారు. గృహనిర్మాణశాస్త్ర నిష్ణాతులచే మరమ్మతు ప్లానులు తయారు చేయించఁబడినవి. గత నవంబరు మాసారంభమందే ఆ ప్లానులు మదరాసు నగర పరిపాలనా సంస్థ (కార్పొరేషన్)కు సమ్మతికొరకు పంపఁబడియెనఁట! ఉత్తరు విచ్చుటకు కార్పొరేషన్‌వారి కింకను లగ్నము కుదిరియుండ లేదు. కార్పొరేషన్ ఇంజనీయర్లు ఇంకను మీనము, మేషము అని ఎంచుచుండిరేమో! వారి యుత్తరువు రాకమునుపే, వచ్చితీరునను నమ్మకముతో కాఁబోలు, మరమ్మతు కార్యములారంభింపఁబడినవి. మరమ్మతు పనులకు గత నవంబరు 17-వ తేదీ నాఁడు గణపతిపూజ జరిగినది.

లోపలి కమానులు (Arches) క్రొత్తరకముగా నిర్మించుటకై నేల అంతస్తులోను, మొదటి అంతస్తులోను దూలములకు క్యాజుయారీనాగడ లానించి పోటీయిచ్చి, స్తంభముల పైభాగములో సగము తొలిచి రాతిపలకల నునిచి క్రొత్త ఇనుపదూలములను (గర్డర్లను) దూర్చి, గచ్చుపని చేయించుచు అర్ధచంద్రాకారముతో నున్న కమానులను పగులఁగొట్టి చౌకపు కమానులుగా నూతన పద్ధతితో పనివారు నిర్మించుచుండినారు. 5-12-1945 నాఁటికి 11 కమానుల పునర్నిర్మాణ మీలాగు పూర్తియైయుండినది. 12-వ ప్రాతకమాను గోడను పనివా రానాఁడు చెక్కివేయుట నారంభించినారు. మొదటి అంతస్తులో కంపెనీ కార్యములు తూగించు నుద్యోగులు, సేవకులు తమతమ పనులు తాము నిర్వహించుచుండినారు. పై అంతస్తులలో సయితము యథాపూర్వముగా జనులు కాపురముండిరి. నేల అంతస్తులో మాత్రము కంట్రాక్టరుచేతిక్రింది పనివారు కొందరు పని చేయుచున్నారు. ఈ మరమ్మతులు జరుగు కాలములో పై అంతస్తులను ఖాళీచేయవలెనని కంట్రాక్టరు సూచించలేదఁట! ఆ ప్రకారము సూచించవలయు నని అతని ప్లానులో ఆర్కిటెక్టు వ్రాసియుండలేదు కాఁబోలును. అతఁడు మాత్రము, పాపము, ఈయంశమును ప్లానులో ఎట్లు వ్రాయును? మరమ్మతులకు ప్లాను తయారుచేసి యిమ్మని అతని నడిగి యుందురు కాని, జనుల నివాసమునకు కాలనిర్ణయము చేసి ప్లానులో వ్రాయమని కోరియుండరు గదా?

అది యట్లుండె. ఆ వెనుకటిదినము, 4-12-1945 నాఁడు రాత్రి 11-36 p. m. (I. S. T.) లో నిండు అమావాస్య; తరువాత రమారమి 16 గంటల కాలములో, అనఁగా, 5-12-1945 నాఁడు సాయంకాలము 3-45 p.m. (I. S. T.) ప్రాంతములో, ఆభవనపు మొదటి అంతస్తులో ప్రధాన భాగము ఆకస్మికముగా, భూకంపమునందువలె, ఉన్నది యున్నట్లే, తటాలున విచ్చుకొని కొన్ని సెకండ్లలోనే గభీలుమని క్రిందకూలినది. ఆ అంతస్తులోని యొక గొప్ప

శాలలో భీమాకంపెనీ ఉద్యోగులు 12 మంది పనిచేయుచుండెడివారు.

"నమేంద్రాయ తక్షకాయ స్వాహా" అనురీతి, శాలలోనున్న బల్లలు, మేజాలు, అరలు, పెట్టెలు, బెంచీలు, కుర్చీలు మున్నగువానిలో కూడ అపు డందుండిన మనుష్యులు సయితము పాతాళము చేరినారు. ఏ అదృష్టశేషము వలననో, ఆక్షణములో కార్యవశమున బైటనుండఁగలిగిన భాగ్యవంతులు కొందరు తప్ప, ఇతరులందఱు భూగర్భములో దాఁగుకొన్నారు. నేల అంతస్తులో అపుడు పనిచేయుచుండిన వారిలో ముగ్గురు కూలీలు సయితము వారికి తోడుకావలసి వచ్చినది. ఘోరము! మొత్తముమీఁద, ఎనమండుగురు అకాలమృత్యువుపాలైయిరనియు, 10 గురికి గాయములు తగిలినవనియు విషాదవార్తలు వచ్చినవి.

ఆకస్మికముగా నిట్లు ప్రాణములు కోలుపోయిన వారిలో పలువురు యువకులు; ఏకర్మము నెఱుఁగనివారు: జీవితరంగమును గంపెఁడాసతో నూతనముగ ప్రవేశించిన వారు. ఇతరులలో, కూలీలు కడుపుకక్కుఁటితికై చెమట లూడ్చి కాయకష్టము చేసి ఆలుబిడ్డలను పోషించవలసినవారు. ఇంతమంది యీవిధముగ—ఒక్క క్షణములో—అకాల మృత్యువువాతఁ బడుటకు హేతువేమి?

ఆర్కిటెక్టు తయారుచేసియిచ్చిన మరమ్మతుప్లానులో లోపమున్నదా, కంట్రాక్టరు చేయించుచున్న పనుల పద్ధతిలో తప్పున్నదా, లేక మరమ్మతులకై ఉపయోగింపఁబడిన షోటీ స్తంభములలో, దూలములలో దోషమున్నదా - ఈ మొదలగు సమస్యలను విమర్శించుటకు కార్పొరేషన్ ఇంజనీర్లు, పోలీసు ఉద్యోగులు ఆత్రముతో పూనుకొనియే యుందురు. ఏ క్యాజుయారీనాగదలలోనో, ఏ పనివాని కొఱముట్టునందో ప్రమాదమున కాదికారణ మున్నదను తీర్మానమునకు సయితము వారు త్వరలో రావచ్చును; ప్రాణముల కోలుపోయినవారి కుటుంబములకు—అల్పమో, స్వల్పమో—విరాళములు లభించవచ్చును: గృహనిర్మాణ విషయకమగు నిబంధనల చట్టమును కార్పొరేషన్‌వారు మఱింత కఠినముగా జారీలో పెట్టవచ్చును; ఆ భీమాకంపెనీ వారు తమ భవనమును తగిన మరమ్మతు చేసియో, పునర్నిర్మాణము గావించియో, తమ కార్యస్థానమును త్వరలో సిద్ధముచేసుకోవచ్చును: అకాలమరణముపాలయినవారి స్థానములలో క్రొత్త యుద్యోగులను నియమించి కంపెనీ వారు తమ కార్యకలాపమును యథాపూర్వముగా నడపుకొనసువచ్చును. ఇవన్నియు యథావకాశముగా జరుగునను టకు సందియముండదు.

కాని, ఇట్టి శోచనీయఘోరపరిణామమును తెచ్చిపెట్టిన విషమకాల మెట్టిదో, మన మిచట చర్చించుట ప్రయోజనకారి. "వారి కర్మ చాలక వారు కాలధర్మముచెందినారు. ఎవరేమి చేయఁగలరు?" అనువారు లేకపోలేదు. సత్యమే! వారివారి ప్రారబ్ధకర్మకు వారే బాధ్యులు. కాని, దానికి ఎవరైనా ఇతరులు తాత్కాలిక కర్మబాధ్యత వహించవలసి యున్నదా అను ప్రశ్నకు మాత్రమే మనము సమాధాన మాలోచించవలసినది. ఇది అనవసరమనువారు ప్రకృతపు శిక్షాస్మృతిని (penal code) సంస్కరించు పుణ్యము నకైనా పూనుకోవలెను. కర్మ చాలనివాఁడెవఁడో, వాఁడేకదా హత్యగావింపఁబడును? ఆహత్యకై ఇతరుల బాధ్యతను గూర్చి విచారించు నుద్దేశము గల శిక్షాస్మృతి ఈధర్మనిర్ణేతల దృష్టిలో అన్యాయ్యము, అనవసరము అగునుగదా?

ప్రకృత మనుసరింతము. 5-12-1945 నాఁటి గ్రహస్థితు లెట్లుండెనో చూతము. ఇదే అప్పటికి గ్రహభావకుండలి:—

| | | | |
|---|---|---|---|
| | | I 11-37 | వ 15-31 |
| X 3-15 | పతనకాలము [సాయనము] | | రా 1-6<br>శ 24-8 |
| కే 1-6 | | | కు 3-14 (వక్రారంభము) |
| చ 20-36<br>బు 17-40<br>ర 12-55 | శు 29-2 | ఇ 8-16<br>గు 20-58 | |

తాత్కాలిక కుజుఁడు చతుర్థకేంద్రబిందువునం దుండఁగల్గుట నాఁడు 3-36 p. m. (I. S. T.) సంభవించును. వ్యత్యాసము అత్యల్పమగుటచే, అకాలముననే పైకుండలి గుణింపఁబడినది. ఇదికాక, ప్రమాదకాలమున సహజముగా నుండు అవ్యవస్థలో, ఆ భయానక విపత్కాలములో, ముంజేతి గడియారమును చూచి గంటలు, నిమిషములు గమనించు నెప్పుడి ఎవని కుండఁగలదు? కాన, ప్రకటితమైన కాలము అందాజుగా అంచనావేయఁబడినదే యని యూహించుట తప్పుగాదు.

ఈచక్రములో ముఖ్యముగా మనము గమనింపఁదగిన యోగము లివి— (i) ఆనాఁడే వక్రచార మారంభించిన

కుజుఁడు చతుర్థభావమందే యుండుట; (ii) లగ్నాధిపతి యగు శుక్రుఁడు అష్టమ (మృత్యు) భావములో గండాంతము లో నుండుట; (iii) అష్టమభావములో నున్న రవి, బుధ, చంద్రులకు వరుణగ్రహమునుండి సమసప్తక ప్రబలవేధ యుండుట.

సామాన్యదృష్టితో చూచినచో, ఈ యోగములలో ప్రమాద సూచకమగు గొప్ప వైషమ్య మున్నదా అనిపించు చున్నది కదా? ఈగ్రహసామగ్రి సర్వప్రపంచమునకును సామాన్యమగుటచే, ఈభీమాకంపెనీకిమాత్రమే నాఁడు ప్రత్యేకముగా అది దుష్ఫలప్రదమగుట యెట్లు? అని యడుగవచ్చును. ఈకంపెనీ స్థాపించిన కాలమునకు జాతకము గుణించినచో, మన కీవిషయమున తృప్తికరమగు సమాధానము లభించఁగలదు. కాని, నా కాసామగ్రి ప్రకృతము దొరకనందున, ఆ యంశమును చర్చించుట సాధ్యముకాలేదు. ప్రశంసావిషయమున కది యంతగా అనవసరము కూడ.

ఈభవనము చాలకాలముగా మంచిస్థితిలో నుండినది. ఇది యీకంపెనీవారి యాజమాన్యమునకు వచ్చుట 1-10-45 నాఁడు. తరువాత, వా రీభవనములో 16-10-45 నాఁడు నూతన ప్రవేశముచేయుట, అటుమీఁద 17-11-45 లో వారు దీనిని మరమ్మతుచేయింప నారంభించుట. ఈ భవనము ఆ కంపెనీవారి యాజమాన్యమునకు వచ్చిన తరువాత దాని జీవితములో వచ్చిన ముఖ్యదినము లివి. వీనితో ఈ విపత్తు సంభవించిన దినమున కేమి గ్రహసంబంధ మున్నదో, ఆయంశమును మాత్రము చర్చించుట మన ప్రకృత సందర్భమునకు చాలును.

వ్యయాధిపతియగు కుజుఁడు ఆ దినమందే వక్రియై నికరముగా చతుర్థస్థాన బిందువందే నిలుచుట ప్రమాదమునకు తగినట్లే యున్నది. కాని ఇచ్చట నొక విశేషము! తాత్కాలిక దశమకేంద్రమునకు నాఁటిరవి 50 భాగల దూరములో నున్నాఁడు. ఈ కంపెనీవా రీభవనముఁ బ్రవేశించిన నాఁటి నుండి ఈ ప్రమాదము 50 వ దినమందే నడచినదని మనకు తెలియును. దశమ కేంద్రము యొక్కయు, రవియొక్కయు దైనికగతి రమారమి దినమున కొకభాగ యని మనకు స్ఫురించెనేని ఈ సంఖ్యాసామ్యములో నొక వైశిష్ట్యము చూపట్టుచుండలేదా? ఇది కాకతాళీయన్యాయమందురేమో? దినాంతమున రాత్రి యుదయించుట ఎంత కాకతాళీయమో దీనిలో నయిత మంతే కాకతాళన్యాయ మున్నదని నామనవి. ఓపికపట్టి మరి కొంతదూరము పరిశీలింతము.

భవనమును కొన్న దినమందును, ప్రవేశించిన దినమందును గ్రహస్థితులతో పోల్చిచూచినచో పై సంఖ్యాసామ్యమునకు వాస్తవముగా వెలయున్నదని సుబోధము కాఁగలదు. భవన సంపాదనమునాఁటి గ్రహస్థితి యీ క్రింది చక్రము చూపుచున్నది:—

| | | | |
|---|---|---|---|
| | | | వ 17-25 |
| | భవన సంపాదన కాలము [సాయనము] | | రా 4-19<br>శు 13-2<br>శ 23-43 |
| కే 4-19 | | | చ 11-10 |
| I 12½ | | ఇ 6-15<br>బు 6-43<br>ర 7-40<br>గు 7-51 | కు 7-58<br>X 15½ |

నూతనభవనసంపాదనమునకు కంపెనీ వా రెంత శుభదినము నేర్పరచుకొన్నారో! భాద్రపదమాసములో కృష్ణపక్షము! దీనికి 'పితృపక్ష' మని సామాన్య వ్యవహారము. దీనిలో శుభకార్యము లెవ్వియు చేయరాదని సనాతన సంప్రదాయమున్నది. సోమవారము కలిసిన ఏకాదశీతిథి అది. దీనిని దగ్ధయోగ మందురు. ఆనాఁటి నక్షత్ర మాశ్లేష. ఇది నిషిద్ధనక్షత్రమని అంద రెరుఁగుదురు. ఈ శుభదినమందు భవన సంపాదనము జరుగుట! తాత్కాలిక రవినుండి 65 వ భాగ ధనుస్సులో 12½ భాగ అగును. ఈభాగలో అమావాస్య వచ్చిన వెంటనే ఈ ప్రమాదము జరుగుటంజేసి భవన విక్రయ దినమున ఆ ప్రత్యేక భాగకు ప్రాధాన్య ముండుట అవసరమగుటచే ఆభాగయే లగ్నముగా నుండుట సమంజసమని ఊహించుట కవకాశమున్నది. ధనుస్సులో 12½ భాగ ఆనాఁడు 11-36 a. m. (I. S. T. War time) లో లగ్నములో నుండఁగలదు. ఆక్షణములో ఈభవన విక్రయ పరిష్కారమో, పత్రలేఖనమో, మఱి యే ముఖ్య కార్యమో జరిగియుండి తీరవలెను. ఈ ఊహతో ఆకాలమునకే పైకుండలి గుణింపఁబడినది.

లగ్నకేంద్రములో శుభగ్రహబలము కానరాదు. దశమకేంద్రమునందు మాత్రము శుక్రుఁ డున్నాఁడనుట వాస్తవమే. కాని, యీ యోగము రమ్యమైనది కాదు. ఏలందురా,

శుక్రుఁడు నీచగ్రహము. కాక, వీనికి రోగ (షష్ఠ) స్థానాధిపత్య మున్నది. చాలదని, శనినుండి అర్ధకోణవిషమ దృష్టి యీ శుక్రునిపైఁ గలదు. సంపాదించిన భవనము చూడ్కికి బాగున్ననేమి, ప్రాతపడి రోగగ్రస్తమైనదని సూచన. అనఁగా, మరమ్మతు కోరుచున్నదని యర్థము. శుక్రుఁడు బుధుని అధీనములో (కన్యలో) నున్నాఁడు. మరమ్మతుపను లొక కంట్రాక్టరున కప్పగింపఁబడినవి. బుధుఁడు ఇంద్రరవుల మధ్యమున తులారాశిలో నున్నాఁడు. ఆ కంట్రాక్టరొక కంపెనీయొక్క వ్యవహర్త యనియు, మంచి చాకచక్యము, తెలివితేటలు కల విద్యావంతుఁడనియు ఈ యోగము తెలుపఁజాలును.

లగ్నాధిపతియగు గురువు లాభస్థానమం దున్నాఁడు. భీమాకంపెనీ ధనవంతమైనది; గొప్ప పలుకుబడి గల విద్యాధికులయొక్కయు, విత్తాధికులయొక్కయు ఆదరాశ్రయములతో అభివృద్ధిగాంచు పరిస్థితులలో నున్నది. పుణ్యసహమబిందువు నయితము (తులారాశిలో 16° వ భాగ) లాభభావమందే యుండుట కంపెనీ గౌరవమునకు తగియే యున్నది.

కాని, వ్యయాధిపతియగు కుజుఁడు, ధనాధిపతియగు శని పుణ్య సహమమునకు గుప్తవైరదృష్టితో, అష్టమ (మృత్యు) స్థానమం దుండుట మాత్రము చింతాకరము. దశమకేంద్రమందున్న రోగాధిపతియగు శుక్రునికి శనితో అర్ధకేంద్ర వేధకదా! అనవసరములగు మరణములవలన అధికధనవ్యయ ముండఁగలదని యీయోగము చాటఁగలదు. కాక, శుక్రుని షష్ఠాధి పత్యమువలన, కంపెనీసేవకుల కిది క్షేమకారి కాదు.

లగ్నమునకు సమసప్తకములో విప్లవకారియగు వరుణుఁ డున్నాఁడు. ఆకస్మిక ప్రమాదము నిది సూచింపఁ గలదు. అదృష్టబిందువు (part of luck) సింహ రాశిలో 11°-21' లో నున్నది.* అష్టమాధిపతియగు చంద్రుఁ డీ బిందువుసంయోగమునందే నిలిచియుండుట దురదృష్ట సూచకమగుటలో వింతలేదు.

వ్యయాధిపతియగు కుజునకును, దశమకేంద్రమునకును గల రాశ్యంతరము రవిసంచారమునకు నికరముగా 65 దినముల ప్రయాణమున్నది. నాఁటి రవి స్థానమునుండి లగ్నమునకుఁ గల రాశ్యంతరముకూడ 65 భాగలే. కాననే, ఆ లగ్నస్థానమునకు చారవశమున రవి వచ్చి అచటనే అమావాస్య పడుటచే, తరువాత కొన్ని గంటలకే,—అనఁగా 65-వ దినమున—ప్రమాదము సంభవించినది.

ఊహించిన లగ్నకాలము నాధారముగాఁ గొని దైనిక కేంద్రములను సాధించితిమేని, ప్రమాదదినమున దైనిక లగ్నము కుంభరాశిలో $11\frac{1}{2}°$ భాగకు రాఁగలదు. భవనసంపాదనదినమున మృత్యుస్థానాధిపతియైన చంద్రునికి ప్రత్యక్ష శత్రుస్థానములో ఈదైనికలగ్నము వచ్చినదనుట! ఇంతకన్న వేరు రాజ్యాజ్ఞ కావలయునా?

మఱియొక విశేషము! అమావాస్యాస్పష్ట కాలమునకు లగ్నమును సాధించినచో, అది కన్యారాశిలో 8° భాగలో వచ్చును. భవనసంపాదనకాలపు శుక్రస్థానమందే ఈ లగ్నము పడినది! ఈ శుక్రుఁడు భవనపు మరమ్మతు పరిస్థితుల కధికారిగదా? అగుటచే, మరమ్మతు పనుల సంబంధమువలన భవనమునకు ప్రమాదము సూచితమగుచున్నది. ఈ శుక్రస్థానమందు పడిన అమావాస్యా లగ్నము వృషభరాశిలో $11\frac{1}{2}°$ భాగకు జరిగివచ్చి అష్టమాధిపతియగు చంద్రునితో కేంద్రమునకు వచ్చినపుడే దాని దశమ కేంద్రము తాత్కాలికకుజునితో సమసప్తకవేధకు వచ్చుటం జేసి ప్రళయము సంభవించినది. మరమ్మతు కార్యములలో కుజుని కైవాట మున్నదికదా? ఏ ఇనుపగడారు పోటునకు గోడ కదలుటవలననో, ఏ ఇనుప దూలము పొర్లుటమూలముననో, పోటీలపై నిలిచియుండిన మొదటి అంతస్తు నేల పట్టుతప్పి క్రిందకూలియుండుట అసంభవముకాదు.

"కన్యారాశిలో 8° భాగనుండి వృషభరాశిలో $11\frac{1}{2}°$ భాగకు లగ్నము సంచరించువరకు అమావాస్యా దోషము కాచుకొని యుండనేల?" అనువా రుందురు. కేంద్రచలన పద్ధతిని గమనించినచో, లగ్నదశమ కేంద్రములు రెండును అష్టమస్థాన సంబంధము గల చంద్రకుజుల క్రూర దృష్టికి ఏకక్షణమందే రాఁగలకాలము నాఁడు వేరొకటి సంభవించదని స్పష్టము కాఁగలదు.

ఇది యిట్లుంచి, భవన ప్రవేశసమయపు గ్రహవైలక్షణ్యమునుకూడ కొంత పరికింతము. గడచిన ఆశ్వయుజ శుద్ధ దశమి—అనఁగా, విజయదశమి—నాఁడు కంపెనీవారు

* భూకంపము, అగ్నిపర్వత ప్రళయము మున్నగు ఉత్పాతములపై నధికారము కలదని ఇటీవల పాశ్చాత్య శాస్త్రజ్ఞులచే కనుగొనఁబడిన యమగ్రహము (ప్లూటో) ఈ దినమున సింహరాశిలో 11°-21' లోనే యుండుట విశేష విషయము. మఱియొక నూతనగ్రహము వచ్చినదా అని భయపడువారు దీనిని ప్రకృతము వదలవచ్చును. దీని యమగ్రహవిశేషము లింకను గ్రంథములలో బాగుగా ప్రచారమునకు రాలేదు కాన.

నూతన ప్రవేశము కావించిరఁట! ఆనాఁడు శ్రవణ నక్షత్రము; అంగారక వారము!! నాఁటి కుండలి యిది:—

| | | | |
|---|---|---|---|
| | | | వ 17-3 |
| చ 13-47 | భవనప్రవేశము | | గు 3-31 శు 20-16 శ 24-30 |
| కే 3-31 | (సాయనము) | | |
| I 11 | బు 1-55 | ఇ 6-48 ను 11-3 ర 22-25 | X 13-30 రా 26-43 |

సమస్త శుభకార్యములకును విజయదశమి ఉత్తమమని సామాన్యముగా ప్రతీతి కలదు. అందులో శ్రవణ నక్షత్రముతో విజయదశమి చేరినచో అత్యుత్తమమని పెద్ద లనిరి.

"ఇషమాసి సితా దశమీ విజయా
శుభకర్మసు సిద్ధికరీ కథితా.
శ్రవణర్షయుతా సితరాం శుభదా
నృపతేస్తు గమే జయసంధికరీ"

(ముహూర్త చింతామణి)

ఇట్టి శుభదినమునే కంపెనీవారు గృహప్రవేశమున కెన్నుకొన్నారు. తమ కనుకూలమైన శుభదిన మప్రయత్నముగా లభించినపుడు, మరల దైవజ్ఞులను విచారించు తొందర ఎందుకు? మంచిదే! కాని, దీనిలో నొకవిశేష మున్నది. విజయదశమి యుద్ధయాత్రకు, అనఁగా ప్రవాసమునకో, ప్రయాణమునకో ఉత్తమమేకాని ప్రవేశమునకు కాదు. ఆదినమున యాత్ర సాగించినచో పరాజయము కలుగదని నారదమహర్షి వచించెను.

"దశక్షపక్షదశమీ ఆశ్వినే విజయాభిధా,
జయప్రదా సా యాత్రూణాం సంధిర్వా, న పరాజయః"

విజయదశమియొక్క ఔత్కృష్ట్యము యుద్ధ యాత్రా ప్రకరణములోనే వర్ణింపఁబడినదని గమనించితిమేని, పొరఁబాటున కవకాశ ముండదు. ఫలిత మేమనఁగా ఇల్లు వెడలి పోవుటకు నిర్ధరింపఁబడిన దినమున ఇంట ప్రవేశించిన ట్లయినది! ఫలము ప్రత్యక్షమే!

ఆదినమున శ్రవణనక్షత్రము. ఇది చరతార; ప్రవేశమున కర్హము కాదు.

"శస్తా స్థిరాశ్చ మృదవశ్చ గృహప్రవేశే,
క్షిప్రా శ్చరాశ్చ విదధ త్యుడవః ప్రవాసం."

అని విద్యామాధవ సూత్రము. ఇవన్నియు నుండఁగా మంగళవారమునాఁడా గృహప్రవేశము? అంగారకవారమునకు నేతిబీరకాయవంటి ఈనామధేయము నేమహానుభావుఁడనుగ్రహించెనో?

అది యట్లుండె. ఆదినమున కంపెనీవారి కార్యస్థానమిచట ప్రవేశించుట 10–28 a. m. I. S. T. (War time) ప్రాంతములో జరిగియుండెనని నాయూహ. అప్పటికే కన్యారాశిని 13° వ భాగ దశమకేంద్రమునకు వచ్చుటయు, ప్రమాదదినమునాఁటి అమావాస్య దానికి కేంద్రవేధనిచ్చుటయు సంభవించును. భవనప్రవేశ విషయమున కార్యారంభమో, పూజాపురస్కారాదులో, మఱి ఏ ముఖ్యకార్యమో అప్పుడే జరిగియుండుట అసంభవము కాదు. ఈదృష్టితో ఆవేళకే పైకుండలి గుణింపఁబడినది.

ఆదినము సౌరమానమున కన్యామాసములో 30-వ తేదీ, అనఁగా నిరయనతులాసంక్రమణారంభ మానాఁడే జరుగునని సర్వవిదితము. నాఁటిరాత్రి 1-20 a. m. (I. S. T.) ప్రాంతములో నిరయనరవి తులాప్రవేశమగును.* అగుటంబట్టి భవనప్రవేశకాలము (10-28 a. m.) నుండి రాశి సంక్రమణ కాలము 15 గంటలు 52 నిమిషము లగును. ప్రమాదదినమున అమావాస్యా స్పష్టకాలము (11-36 p. m. L. M. T.) నుండి ఘోరవిపత్తు సంభవించిన కాలము నిరతముగా 15 గంటలు 52 నిమిషములే అగుచుండుట కాలస్వరూపుఁడగు భగవంతుని లీలాప్రభావము! ఏమనఁ ప్రవేశముహూర్తమునకు తరువాత ఎంతకాలమునకు రవి రాశిసంక్రమణము వచ్చినదో, ప్రమాదదినమునఅమావాస్యకు తరువాత అంతే కాలమునకే భవనము కూలినదని యర్థము.

పోనిండు. ఈ చక్రమందు సయితము లగ్నములో శుభగ్రహము కానరాదు. లగ్నాధిపతి గురువుమాత్రము లాభస్థానమును వదలలేదు. సప్తమభావమునుండి వరుణగ్రహ

* శ్రీకేతక జ్యోతిర్గణితము ననుసరించి 23°-5' అయనాంశల నుపయోగించినచో, ఈకాలములో నిరయన రవి తులాప్రవేశ మగును.

వేధ లగ్నమునకు యథాపూర్వముగా నున్నది. రోగాధిపతియగు శుక్రుఁడు తన పరమనీచభాగప్రాంతముననే వచ్చి మరమ్మతు అత్యవసరమని తెలుపుచున్నాఁడు. మరమ్మతుల కంట్రాక్టరు బుధుఁడు వృశ్చికరాశిలో కుజుని యాజమాన్యమునకు లోనయి, ఇంజనీయరు తయారుచేసియిచ్చు ప్లానువనునరించి మరమ్మతుపనులు జరుపుట కాయత్తపడినాఁడు. కాని, ఈకుజుఁ డష్టమస్థానములో నున్న పాపగ్రహము. ప్రవేశకాలమున అష్టమస్థానములో గ్రహము లుండరాదని శాస్త్రము చాటుచున్నది:

"అష్టమస్థాః గ్రహా స్సర్వే మృతిం దద్యుః ప్రవేశనే."
(జ్యోతిషార్ణవము)

అందులో కుజుని మాట చెప్పనవసరమేలేదు.

'కుజాష్టమో మహా దోషో
లగ్నా దష్టమగే కుజే.
శుభత్రయయుతం లగ్నం
త్యజే త్తత్తుంగగే యది." (నారదుఁడు)

ఇట్టి పరిస్థితులలో జరుపఁబోవు మరమ్మతు పనులవలన ఘోరప్రమాదము సంభవించుటలో విశేషము కానరాదు. ఈ దినము కుజ, బుధుల మధ్యబిందువు కన్యారాశిలో 11°-6' లోనే, లగ్నమునకు కేంద్రసంబంధమందే ఉన్నది కదా? ఆ బిందువు కుజునినుండియు, బుధునినుండియు 50½° భాగల దూరమందే నిలుచుట వింతలలో గొప్పవింత! నాఁటినుండి 50 దినములు గడచునప్పటికి ఈ కుజబుధుల సంబంధము వలని ఫలము భవనమునకు ప్రత్యక్షమైనది కదా?

ఇట్లనుటచే ఇంజనీయరుయొక్క కాని, కంట్రాక్టరు యొక్కగాని కార్యములలో లోపమున్నదని సూచించుట నా ఉద్దేశ మనుకొనరాదు. లోపము వారిలో నుండనవసరము లేదు. వారు విద్యావంతులు, సమర్థులు, కార్యనిపుణులు కావచ్చును. తగు జాగరూకతతో వారు ప్రవర్తించియే యుండనువచ్చును. మరమ్మతుల మూలముగా 50 దినములకు ప్రమాదము వచ్చు సంభవము దుర్ముహూర్తములో జరిగిన భవనప్రవేశమువలని దోషముకాని, వ్యక్తిదోషము కాదు. వేరు కంట్రాక్టరు, ఇంజనీయరు వచ్చియుండినా ఫలమింతే.

ఈ కుజబుధస్థితి కింత యర్థమున్నదా యని కొందరు సందేహింపవచ్చును. వేరు సాక్ష్యము చూడుఁడు. మరమ్మతుల నారంభించిన నాఁటి గ్రహముల స్థితి యిది:—

| | | | |
|---|---|---|---|
| | చ 24-27 | | వ 16-15 |
| | [సాయనము] మరమ్మతుల నారంభించిన దినము | | రా 1-56 శ 24-47 |
| కే 1-56 | | | కు 1-20 |
| బు 17-3 | శు 6-31 ర 24-47 | ఇ 7-50 గు 17-42 | |

చంద్రుని కీదినమున ప్రవేశకాలపు కుజశనుల నుండియు, రవినుండియు ఘోర ప్రాతికూల్యదృష్టి! ప్రవేశ దినమునకు దైనికదశమమును సాధించినచో, అనాఁ డది బృహస్పతిమీఁదనే యుండఁగలదు. గృహ యజమానుఁ డీ బృహస్పతియే కదా! భవనసంపాదనము నాఁటికి దైనిక లగ్నము నికరముగా శనికి సమసప్తక వేధాస్థానమును చేరుకొనుచున్నది.

మఱియు, ప్రవేశకాలపు క్రూరవరుణునికి సమసప్తక వేధకు బుధుఁడు వచ్చిననాఁడే మరమ్మతు లారంభమైనవి కదా? కుజుఁ డానాఁడు ప్రవేశకాలపు బుధునికి కేంద్రమందే నిలిచినాఁడు. ఈ కుజుఁడు తాత్కాలిక వరుణునితో అర్ధకేంద్రమందే. తాత్కాలిక బుధునితో సార్ధకేంద్రమందే ఉండుట గొప్ప విశేషము. మరమ్మతుపను లారంభమైన పదిదినములదాఁక, బుధుఁడు సక్రమముగా ముందుకు నడచినాఁడు. అట్లే ప్రయాణము సాగించియుండెనా, పనులు తృప్తికరముగా కొనసాగి యుండెడివి. కాని 27-11-1945 నాఁడు బుధుఁడు ధనుస్సులో 23-9లో నిలిచి వక్రించినాఁడు. నాఁటినుండి ఏదో కథ అడ్డముగా తిరిగి యుండును. పద్ధతులలోనో, పనులలోనో, పనిముట్లలోనో, ఏవో మార్పులు వచ్చియుండును. ఆ బుధుఁడు వెనుకకు తిరిగి 4-12-1945 నాఁటివరకు నడచునప్పటికి (4-54 p. m. L. M. T.) స్తంభించి వక్రియగుచున్న కుజునితో సరిగా సార్ధకేంద్ర విషమ దృష్టికి రాఁగలుగుట వాని దురదృష్టము. ఏ కీలు తప్పెనో, ఏ మర నడలెనో? తరువాత రమారమి 23 గంటలకే బుధుఁడు భవన సంపాదన కుండలియందలి వరుణుని కెదురురాఁగల్గుట ! పిడుగుపడినట్లుగా ప్రమాదము సంభవించి హల్లకల్లోల మయినది.

భవన సంపాదనకాలపు పుణ్యసహమ బిందువునకు దశమకేంద్రములో శని కుజులు కూర్చున్నారు కదా? మరమ్మతుల నారంభించిననాఁటి కీబిందువు చలించి ధనుస్సులో $1\frac{1}{4}$ భాగకు వచ్చి స్వస్థానముతో అర్ధకేంద్రవైరదృష్టి నార్జించినది. ఆదినమున నారంభించిన మరమ్మతువనులు భవనమునకు క్షేమకరముగా నుండఁగలవా? బుధుఁడు వక్రించిననాఁటి కీ సహమబిందువు గతి యేమయినదో చిత్తగింతురు కాక! ఆనాఁ డది నికరముగా శనికి సార్ధకేంద్ర శత్రుస్థానములో నిలిచి యుండె నని మనము కనుగొన్నచో, ఆకాశరంగమున సూత్రము లెట్లాడుచున్నవో ఊహించుకోఁగలము. ప్రమాదదినమున కీబిందువు చలించి ధనుస్సులో $16\frac{1}{2}$ భాగను చేరుకొని వరుణుని కెదురునిలిచినది. అనఁగా వక్రించిన బుధునితో కలుసుకొని వరుణునితో ముష్టాముష్టి యుద్ధము చేసినదనుట! ఇవి అన్నియు గమనించినచో బుధకుజుల వక్రస్థితినుండి మన మూహించిన అర్థమునకు వెల యున్నదని గోచరించుట కష్టముకాదు.

ఇది యంతయు ప్లానులోపమా, పనివారి లోపమా? కాలదోషముకాక! "కాలోహి దురతిక్రమః!" అనిరి పెద్దలు.

ఇంకొక విశేషము! భవనసంపాదన దినపు కుండలిని జూడుఁడు. లగ్నచతుర్థాధిపతి బృహస్పతికదా? ఇతఁడే భవనాధికారి. ఈబృహస్పతి అతిశీఘ్రముగా రవిసంయోగమును బొందనున్నాఁడని సులభముగా మన మూహింపఁగలము; అనఁగా, రవిసంయోగదగ్ధుఁడై నిస్తేజస్కుఁడగుననుట! లగ్నగృహాధిపతి కీగ్రహచారము పట్టినప్పుడు సంపాదించిన భవనమునకు క్షేమ మెచటినుండి రాఁగలదు? గురుమౌఢ్యమునకు ప్రాచీన శాస్త్రవేత్త లీఫలము నిర్వచించిరి:

"వివాహో వ్రతబంధోవా
యాత్రావా గృహకర్మచ,
గురా వస్తమితే శుక్రే
ధ్రువం మృత్యుం వినిర్దిశేత్."
(శార్ఙీయ వివాహపటలము)

ఆదినమున 10-1 a. m. (G. M. T.) లో, అనఁగా 3-22 p. m. (L. M. T.) కాలమునకు, బృహస్పతి రవిసంయోగము నందునని ఖగోళశాస్త్ర వేత్తలు నిర్ణయించినారు. అగుటచే, మన మనుకొన్న భవనసంపాదనకాలమునకు (10-27 a. m. L. M. T.) 4 గంటలు 55 నిమిషములలో ఆకాశరంగమున ఈసంయోగము జరుగునని అర్థము. రమారమి 4 నిమిషముల కొక్కభాగవంతున లెక్కించినచో, ఈకాలమునకు 75 దినములగును. సంపాదించిన 65 దినములకే విపత్తు సంభవించినది. తరువాత 10 దినములయినా వట్టదా కట్టడములోని శిథిలభాగములను కూలద్రోయుటకు? గురుమౌఢ్యదోష మప్పటికి కదా పూర్తి యగును?

ఇంకొకచిత్ర మున్నది. భవనసంపాదన దినమున షష్ఠస్థానాధిపతియగు శుక్రుఁడుండుట కన్యారాశిలో 8 వ భాగ కదా? లగ్నగృహాధిపతియగు గురువు రవిసంయోగదగ్ధుఁడగుట ఆశుక్రరాశి (తుల) లో 8 వ భాగలోనే! మరమ్మతుల నారంభించిననాఁడు పైనిక పుణ్యసహమము ధనుస్సులో 8 వ భాగకే వచ్చియుండిన దని కనుగొంటిమి. ప్రశంసలో నున్న అమావాస్యాస్పష్టకాలపు లగ్నము కన్యారాశిలో 8 వ భాగయందే పడెనని చూచితిమి, ప్రమాదకాలమున అష్టమ (మృత్యు) స్థానదిందువు ధనుస్సు 8 వ భాగలోనే యుండెనని పాఠకమహాశయులు గమనింపఁగలరు.

"భట్టి ర్నష్టో భారవీయోపి నష్టః
భిక్షుర్నష్టో భీమసేనోపి నష్టః
భుక్కుండోహం భూపతి స్త్వం హి రాజన్,
భభ్యావళ్యా మంతక స్సన్నివిష్టః"

అనురీతిగా, ప్రకృత సందర్భమున 8 వ భాగనే మృత్యుదేవత ఆవరించియున్నట్లు చూపట్టుచుండలేదా? ప్రమాదపు ఫలముగా అకాలమృత్యువునోటఁబడినవారు 8 మంది కదా? ఇది నయిత మాకస్మిక సంఖ్యాసామ్య మనవచ్చునా?

భవన సంపాదన కాలములో ప్రమాదసూచకుఁడగు వరుణుఁ డుండుట మిథునరాశిలో 18 వ భాగ; మరమ్మతులారంభించిననాఁడు గురువుండినది తులారాశిలో 18 వ భాగ! ఆదినము బుధుఁడు ధనుస్సులో 18 వ భాగయందుండెను. ప్రమాదకాలములో బుధుఁడు వక్రియై మరల చేరుకొన్నది. నయితము ధనుస్సులో 18 వ భాగయే! మొత్తముమీఁద ఈప్రమాదములో దెబ్బతిన్నవారు 18 మంది యేనఁట. మరమ్మతు లారంభించిన తరువాత 18 వ దినమందే యీ ప్రమాదము!

మఱియొకమాట. భవనసంపాదన కాలమున మృత్యుస్థానాధిపతియగు చంద్రుఁడు సింహరాశిలో 12 వ భాగలో నుండెను; నాఁటి అదృష్టబిందు వుండుటనయితము ఆ 12 వ భాగయందే; (ఆదినమున యమగ్రహస్థానము కూడ ఆ 12 వ భాగయే!) గృహప్రవేశకాలపు లగ్నము

ధనుస్సులో 12 వ భాగలోనే వచ్చుట; ఆనాఁడు కుజ బుధుల మధ్యబిందువు కన్యారాశిలో 12 వ భాగయందే వచ్చినదని కనుగొంటిమి; ప్రశంసలో నున్న అమావాస్య ధనుస్సులో 12 వ భాగయందే రవిచంద్ర సంయోగము విచ్చినది; ప్రమాదము సంభవించిన కాలపు లగ్నము వృషభరాశిలో 12 వ భాగయందే ఉదయమగుట; భవనములో 11 కమానుల మరమ్మతు జయప్రదముగా జరిగి 12 వ కమానుగోడ నూడఁదీయు సందర్భములోనే ప్రళయము వచ్చిన దఁట! కంపెనీ కార్యస్థానములోని శాలలలో ఏశాలలో 12 మంది ఉద్యోగులు కూర్చుండి పనిచేయు చుండిరో, ఆ శాలయొక్క అడుగుభాగమే విచ్చుకొని నేలఁగూలినది! ఏమి కాలప్రభావ మిది?

"ఇదంతా జ్యోతిషశాస్త్రపు ఇంద్రజాలము (Astrological Jugglary)" అను వివేకవంతు లుందరు. ఇంద్రజాల మైనా కానిండు, మహేంద్రజాల మైనా కానిండు. ఇది అంతయు కాలాత్మక పరబ్రహ్మ యొక్క లీలావిలాసము కాని, జ్యోతిష్కుల మాయ కాదు. ప్రపంచమంతయు మాయయే అను తత్త్వశాస్త్ర వేత్తల దృష్టిలో మాత్ర మిఁకనయితము మాయకావచ్చును. మనకు తెలియనిది, అర్థముకానిది అంతా మాయయే! కాని, ప్రపంచమే మాయ యని ఏమి వదలినాము? ఏమి వదలఁగలము? ఇది పోనిండు. ప్రమాదము నడచిన తరువాత చేయునట్టి యాచర్చ అంతయు "శవపరీక్ష" వంటిదని హేళనముచేయు విజ్ఞానసంపన్ను లుందురు. మోమోటము మాని మాటలాడితిమేని, ఈ ప్రమాదమునకు కారణమును నిర్ణయించుటకై కార్పొరేషనువారు, పోలీసు ఉద్యోగులు, ఇంజనీయర్లు మున్నగువారు ఇప్పుడు చేయుచుండు విమర్శన లన్నియు ఇట్టి "శవపరీక్ష"లే కదా? అట్లని వారు చేయఁబూనిన కార్యము తప్పనఁగలమా? లోప మెందున్నదో, ఎవరిదో కనుగొని, ప్రజాక్షేమము పరమోద్దేశముగా, అట్టి లోపములు మరల జరుగకుండుటకై కట్టుదిట్టములు చేయుకొరకేకదా వారు పూనుకొనుట? మన విమర్శనయితమట్టిదే అనవిండు. తప్పుకాదు. ఇట్టి వస్తుసామగ్రిని, ఈ విధముగా ఈ మరమ్మతు కార్యములో, ఉపయోగించియుండుట అజాగరూకత యని గృహనిర్మాణ శాస్త్రము ననుసరించి, శిల్పస్మృతి యాధారమున వారు తీర్మానించిరేని, ఇట్టి విషమకాలమున, ఇట్టి దుర్ముహూర్తమున, ఇట్టి అభివృద్ధి కార్యము నారంభించుట అవిచారకృత 'మని' ఖగోళశాస్త్రము ననుసరించి జ్యోతిషస్మృతి యాధారమున మనము సూచించుచున్నాము. అంతే.

పోనిండు. మొదటి అంతస్తులోని వేఱుభాగములో తిరువాన్కూరు బ్యాంకు కార్యస్థాన మున్నది. రెండవ అంతస్తులో శ్రీ శంకరన్ అనునతఁడు కాపురముండినాఁడు. ప్రమాద కాలమున ఈ భవనభాగముల కేనియు నుపద్రవము వచ్చినట్లు వినము. ఏల? వా రీ భవనమును భీమా కంపెనీవారు ప్రవేశించిన ముహూర్తములో ప్రవేశించి యుండరు కాన. కంపెనీవా రుపయోగించుకొన్న దుర్ముహూర్తపు ఫలము వారి కంటలేదు. కంపెనీ కార్యస్థానమును కూలద్రోసి, తత్సేవకులలో, మరమ్మతు కూలీలలో, గ్రహచారము చాలని కొందఱిని మాత్రము కబళించుకొని పోయినది. కంపెనీ ఉద్యోగులు 54 గురు, మరమ్మతు కూలీలు 37 గురు ఆదుర్దినమున నచట పనిచేయుచుండిరఁట! ఇందరిలో 8 మంది మాత్రమే మరణించి 10 మంది గాయముల పాలైరనుటలో నొక వైశిష్ట్య మున్నది కదా? తమ జాతకములలో క్రూర గ్రహవేధ యుండి, ఈ దుర్ముహూర్తపు సందర్భమున వేధపాలయిన ఖగోళభాగలతో తమ జాతకములందలి ప్రధాన స్థానములకు ప్రబల విషమ సంబంధమును సంపాదించుకొన్న దురదృష్టవంతులు మాత్రము ఈ ప్రమాదమున కాహుతియైరనియు, అట్టి సంబంధము లేనివారును, తక్కువగా కలవారును కొంచెముగనో, గొప్పగనో ఆర్థిక, కాయిక, మానసిక క్లేశములను యథాశక్తిగా ననుభవించి గండము గడచుకొనిరనియు మన మూహింపవలసి యున్నది. పాఠక మహాశయులలో శాస్త్రగౌరవము కల వారెవరైన, ఈ ప్రమాదమువలన అకాలమరణము నొందిన వారి యొక్కయు, ఆశ్చర్యకరముగా గండము గడచుకొన్న వారి యొక్కయు జాతకములను సంపాదించఁగలిగిరేని, పయి యర్థమును స్పష్టముగా చూపుట సాధ్యమని నా నమ్మకము. శాస్త్రదృష్టితో ఇట్టి చర్చలు, విమర్శలు, పరిశోధనలు సలుపుట లోకకళ్యాణమున కత్యంతావసరముకూడ.

హోరాశాస్త్రమున మహనీయులగు ప్రాచీనమహర్షులు శాసించిన విధులను గమనించ మేని, లోపము మనదే యని తెలుపుట కింత చాలు ననుకొందును. ఎన్ని వేల శతాబ్దముల అనుభవమునో క్రోడీకరించి వారు నిర్ణయించిన సూత్రము లపారమయిన విలువగలవి; మన కీ ప్రపంచమున,

"ఆపద కడవం బెట్టఁగ,
నోపి శుభం బైనదాని నొడఁగూర్పను"

చాలినట్టివి. ఇట్టి సూత్రములపై అకారణ ద్వేషమో, లేక నిరాదరమో చూపునట్టి స్థితికి పలువురు విద్యాధికు

లగు జాగరకపత్త్రములు చేరి నడుపు సంస్థలే పాల్పడి నచో, ఇఁక పామరులగు జానపదుల మాటయేమి?

ఈ వ్యాసము విట్లు ముగించి సంపాదకులకు పంపు సన్నాహములో నుండఁగా, 12-12-1945 వ తేదీన నా మిత్రుఁడు శ్రీ కే. పార్థనాథశర్మ మదరాసు నుండి వచ్చి ప్రశంసాభవనపు మరమ్మతుపనులను కంట్రాక్టు తీసుకొన్న కంపెనీవారి మానేజరు శ్రీ పి. గోపాలకృష్ణన్‌గారి జాతకసామగ్రిని నా కొసఁగెను. మఱియు, గృహప్రవేశ దినమున (16-10-1945) సుమారు 3-0 P. M. వేళలో పూజలు సలిపి ప్రసాదస్వీకారము చేసి భీమాకంపెనీ ఉద్యోగులు తమ పనుల నారంభించిరని నా మిత్రునివలన తెలియ వచ్చినది.

ఈ నూతన సామగ్రి మన యూహలతో నెట్లు సమన్వయపడఁగలదో పాఠకమహాశయుల కిచ్చట నివేదించుట అప్రస్తుతము కాదు. శ్రీ గోపాలకృష్ణన్ సాయన మిథున లగ్నములో, బుధుని ఆధిపత్యములో, శుక్రుని నవాంశలో జనించిన వ్యక్తి యని చదువరు లెఱిఁగినచో, "ఆహా" యని ఆశ్చర్యపడక మానరు. శుక్రునితో పరివర్తన యోగములో నున్న బుధుఁడు కదా మరమ్మతుల కంట్రాక్టు రనుకొంటిమి? ఇంకేమి సాక్ష్యము కావలయును? ఇతని దశమ కేంద్రము మీనరాశిలో 17½ భాగలో నున్నది. భవన సంపాదనము నాఁటి యొక్కయు, భవనప్రవేశము నాఁటి యొక్కయు వరుణగ్రహ స్థానమునకు మరమ్మతు లారంభించిన నాఁటి యొక్కయు, ప్రమాదకాలము యొక్కయు బుధగ్రహస్థానము నిండు సమసప్తక వేధలో నుండఁగా, ఈ రెండింటి సరిసడుమ కేంద్ర సంబంధముతో ఇతని దశమ స్థానముండుట మన ఊహలతో నెంత బాగుగా అతుకుచున్నదో చూడుఁడు! విశేష మేమనఁగా, ఇతని జాతకములో కుజుఁడుండుట ధనుస్సులో 12½ భాగ యందే! ప్రశంసాదినమున వచ్చిన అమావాస్య కంట్రాక్టరు జాతకపు కుజునిపైననే పడినదనియు, అది ప్రమాదకాలమున అష్టమస్థాన మధ్య బిందువే అయి యుండెననియు, భవన ప్రవేశకాలపు లగ్నము, పూజాకాలపు దశమకేంద్రము సయిత, మా ప్రదేశమే అనియు చదువరులు పోల్చుకొన్నచో గగుర్పాటు ననుభవించకపోరనుకొందును.

1945-వ సంవత్సరమునకు ఇతని జాతకమున లగ్నాధిపతి యగు బుధుఁడు చలించి ధనుస్సులో 8 వ భాగయందే విలిచియున్నాఁడు. భవన సంపాదన కాలపు శుక్రుని కిది గుప్తశత్రుస్థానము: ఇతని జన్మచంద్రుఁడు మేష రాశిలో 7 వ భాగలో నుండి భవన సంపాదన కాలపు ఇంద్ర, బుధ, రవి, గురువులకు సమసప్తక శత్రు స్థానములో నుండుట. ఇట్లుండ, 1945-వ సంవత్సరమునకు ఇతని చలితరవి వృశ్చికరాశిలో 21 వ భాగకు వచ్చి పయి ఇంద్ర బుధులకు అర్ధ కేంద్ర విషమ దృష్టిచే వచ్చి నాఁడు. ఇట్టి పరిస్థితులలో ఇతని యాజమాన్యమున జరుగు మరమ్మతు పనులవలన భవనము దెబ్బతినుటేమి వింత? మరచితిని. ఇతని దశమాధిపతియగు బృహస్పతి యుండుట భవనసంపాదన కాలపు కుండలిలో అష్టమ స్థానమునందే!

భవనప్రవేశ దినమున 3-5 p. m. (L. M. T.) లో ధనుస్సులో 12½ భాగ దశమ కేంద్రమందుండి మీన రాశిలో 8 వ భాగ లగ్నముగా నుండును. మన మనుకొన్న ప్రవేశలగ్నస్థానము పూజానంతరము కార్యారంభకాలమునకు దశమకేంద్రమునకు వచ్చుటయు, తాత్కాలిక లగ్నము భవనసంపాదనకాలపు నీచశుక్రుని కెదురుగావచ్చుటయు జరిగిన సంభవమునకు తగియేయుండి మన మునుపటి ఊహలను నిశ్చయముగా బలపరచుచున్నవి. ఆకస్మిక సంఖ్యా సామ్య మని ఇన్నింటిని త్రోసిపుచ్చఁ గలమా?

అతివిషాదకరమగు నీ ప్రమాదగాథను చర్చించు సందర్భమున ఈ సంస్థయొక్క వ్యవస్థాపకులనుగాని, కంట్రాక్టరులనుగాని. ఇతరులనుగాని తప్పుపట్టుట త్రికరణశుద్ధిగా నా ఉద్దేశము కాదు. అన్నివిద్యలయందును ముందంజవేసి పరిశోధనలు సలుపుట ప్రధానకార్యమని పలువురు విద్యాధికులు పలుతెరగుల పాటుపడుచున్న యీ కాలములో అతిప్రాచీనతా గౌరవమున కర్హమై, లోకకల్యాణమే పరమోద్దేశముగాఁగల ఈ హోరాశాస్త్రము సయితము వారి దృక్పథము నంటు భాగ్యము రావలయు నను కోరికతోనే నే నీవిమర్శకుఁ బూనుకొనుట. పాఠకమహాశయులలో నెవరైన నా యభిప్రాయముల నంగీకరించఁజాలని పట్ల, నా ఉద్దేశము నయినా వారు సంపూర్ణ సహృదయత్వముతో నాదరింతు రని నా విశ్వాసము.

"ఉత్పత్స్యతే హి మమ కోఽపి సమానధర్మా,
కాలో హ్యయం నిరవధిః, విపులా చ పృథ్వీ"

# ఉఱుములు, మెఱుములు

= శ్రీ పొట్లపల్లి రామారావు =

ఎవరయా ! ఈ కారుమబ్బుల
యిరులమాటున తోడలు చరచి
తేజుకత్తుల దిక్కులంటగ
తిప్పుచున్నారు ?
సమరము చేయుచున్నారు ?

ఏమిటా ! నులివెట్టు ద్వేషము ?
ఎందుకా ! మినుముట్టు రోషము ?
ఎవరు లేరా ! మీకు తీర్పరు ;
లింటివారలు
హృదయము నంటువారలు ?

వాడికత్తుల రాపిడులచే
వజ్రసమానఘట్టనలచే
దిశల గుండెలు కదలిపోయె
తీరదా మనసు ?
యింతకు, ఎందు కానలుసు?

ఎంత సీవెంతంచు మీరలు
యిటుల తెగి కయ్యంబు నేసిన
ప్రళయకాలమునాటికైనా
బాపగాలేరు
ఏరు మిమ్మాపగాలేరు.

అదిగో ! చూడుడి ! మబ్బుముత్తవ
ఎదను చించుక ఏడ్వసాగెను
ఎవరు మడిసిరో ! ప్రాణచుట్టము
లింటివారలు
యింతకు కానివారలు ?

మన్ను, మిన్నూ ఏకమయ్యెను
మబ్బుగుంపుల బొప్పలవారిచె
దిక్కులన్ని మూగిపోయెను
చిక్కచీకటిచే
అక్కట త్రోవ గానమిచే?

యింతకైనా తీరిపోదా ?
యీమహాప్రళయాట్టహాసము
ఏమిపడునో నెత్తిపైనని
యిల పడంకెడిని
ప్రాణములే కలంచెడిని !

# ఈవిధముగా వుతికిన యెడల బాదటంవల్లకలిగే నష్టము వుండదు






రంధ్రములు పడుట, చిరుగుట, ఛిద్రలయిపోవుట సంభవించును. ..బట్టలను శుభ్రపరచుటకు వురాతనపు మోటు పద్ధతిగా బాదుట వలన ఈ విధమైనటువంటి అనవసరమైన నష్టమునకు డబ్బు ఖర్చునకు పాల్పడుట తటస్థించును.




ఈ నెబంరు వేయబడిన చిత్రములనుచూడండి. బట్టలనుపాడుచేయకుండా వుతుకుట ఎట్లాగో ఇవి చూపగలవు.

(1) పంపు క్రిందగాని, తొట్టెలోగాని, చెరువులోగాని, కాల్వలోగాని వుతకవలసిన బట్టను బాగా తడపవలెను. (2) బట్ట బాగా తడిసిన తర్వాత సన్‌లైటుతోబాగారుద్దండి. (బాగా మురికిగావున్నచోట్ల సన్‌లైటు ఎక్కువగాపట్టించవలెను). (3) సబ్బుతోనిండిన బట్టను బాగా పుసమండి. బండకేసిబాదవద్దు (మామూలుగా చపాతీలు చేసేటప్పుడుపిండి కలిపేవిధంగా నన్నమాట). సబ్బుయొక్క నురుగునుబట్టంతటికి బాగా అంటేవిధంగా చూడండి. గట్టిగా రుద్దటంగాని మరి ఇతర విధంగా బాదటంగాని అనవసరము. సన్‌లైటుయొక్క "స్వయముగా శుభ్రపరచు నురుగు" మురికి నంతటిని తీసివేయును. (4) తరువాత మురికితో కూడుకొనిన నురుగంతయు పోయేటట్టు బట్టను నీటిలో ముంచిపిడవడి.

ఈ సన్‌లైటు పద్ధతిగావుతికినయెడలబట్టలు చాలకాలమున్నుతవి.

## సన్‌లైటు సబ్బు బట్టలను కాపాడును






LEVER BROTHERS (INDIA) LIMITED

# సంకురాత్రి

## [సూరి, సీతి, వెంకి]

★

= శ్రీ చింతా దీక్షితులు =

"ఓ తాయిల్లాగారి పెత్తిమీద గోరింక
చెప్పకు చెప్పకు చెడుపాప
చాపిరే నీ కళ్ళోతాయి"

అని నవ్వుతూ, చప్పట్లు కొడుతూ సూరిని చూచి సీతి అంది.

సూరి తలమీద తన్న బుడ్డిపనికి చేత్తో తీసేసుకొంది.

"ముసుణ్ణి వెసుక్కుంటోయి, ముసుణ్ణి వెసుక్కుంటోయి" అని సీతి మళ్ళీ నవ్వుతూ చప్పట్లు కొడుతూ గంతులేసింది.

"అమ్మతో చెప్తా నుండు. చూస్తూ నా ఏమిటది? అసహ్యం." అంది సూరి.

వెంకి వాళ్లమ్మ పచ్చడి కబ్బుకొంటే చేతిలో పచ్చడి వేయించుకొని నాకుతూ వాళ్ల దగ్గరికి వచ్చి "ఆయి బెల్లం ఆయి, ఆయి, నాకోయి ఆయి" అని ఊరించింది. సీతి "నేనువాత్రం తెచ్చుకోలేనా ఏమిటమ్మా" అంటూ ఇంట్లోకి పరుగెత్తుకువెళ్లి పచ్చడి చేతులో వేయించుకువచ్చి "ఆయి బెల్లం, ఆయి బెల్లం, ఆయి, ఆయి" అంటూ సూరిని ఊడికించింది. సూరి "నేనుకూడా తెచ్చుకోలేనా" అంటూంటే "రావే నీకూ పెడతాను" అని పిలిచి, "ఆయి ఆయి" అని మళ్లీ ఊరించి తరవాత సగం సూరికి పెట్టింది. ముగ్గురూ పచ్చడి నాకేసి చేతులు కడుక్కున్నారు.

"సంకురాత్రి నెల పట్టాగుటగాదుటే సూరీ" అంది సీతి.

"అమ్మ చెప్పిందికాదూ రేపటినుంచని" అంది సూరి.

"మరోసే! రేపటినుంచే కాదుటే ముగ్గెట్టడం" అంది సీతి.

"అవునే, గొబ్బిళ్లుకూడా రేపటినుంచేనే" అంది సూరి.

సూరికి ముగ్గెట్టడం వచ్చు. తెల్లవారకుండానే వాళ్లమ్మతో కూడా లేచేవారు సూరి, సీతి, వెంకిని. వాళ్ళమ్మ, సూరీ కలసి ఇంటిముందు పెద్దగా పేడనీళ్లు చల్లి ముగ్గులు పెట్టేవారు. సీతి, వెంకీ కలసి చిన్నచిన్న పేడముద్దలుచేసి, వాటికి పసుపుముద్దలూ, కుంకుంముద్దలూ పెట్టి గుమ్మడిపువ్వులు గుచ్చి వాటిని ఆ ముగ్గులమీద పెట్టి పసుపూ, కుంకుం చల్లేవారు.

వాళ్లమ్మ పెద్దపెద్ద ముగ్గులు పెట్టేట గుంట కోలేస్తూ, గింజల రథాలూ పల్లకీ పెడుతూ ఉంటే సూరి చిన్నముగ్గులు వాటిచుట్టూ పెట్టేది. తాంబేళ్ళూ, పాములూ, మిఠాయి పొట్లాలూ, తులసి కోటలూ మొదలైనవి.

గొబ్బిళ్లు పెట్టింతరవాత ముగ్గురూ కలసి గొబ్బిళ్ల పాట పాడేవారు. సీతి వెంకితనానికి సూరిమీద గొబ్బిపాట కట్టి పాడేది.

"సూరికి గొబ్బెమ్మ
మొగలీ పువ్వంటే

మొగుడీ నియ్యావే."

అంటే మూరికూడా ఉత్సుకమొత్తనంతో —

"సీతికి గొబ్బెమ్మ

మొగలీ పువ్వంటి

మొగుడీ నియ్యావే."

అని పాడేది.

వెంకి-

"మూరికీ, సీతికీ గొబ్బెమ్మ

మొగలీ పువ్వంటి

మొగుడీ నియ్యావే"

అని పాడుతూంటే సీతి "ఊరుకో వెంకీ" అని కొప్పడేది.

గొబ్బిపాటలు పాడింతరవాత బెల్లంముక్క నైవేద్యం పెట్టి అది నుగ్గుగా తినేవాళ్ళు.

ప్రతిరోజూ ఇలాగా గొబ్బిళ్లుపెట్టి కొంత సేపున్న తరువాత వాటిని తీసి చిన్న చిన్న చిల్లిపిడకలు చేసి ఎండించి దండలుగుచ్చి వాళ్లు ఆదండలన్నీ గసారాలో వేళ్లాడవేసుకొనేవారు.

ప్రతిసమూ వాళ్ల ఇంటివాకిలి కలకలలాడుతూవుండేది. సాయంత్రం అయ్యేటప్పటికి గొబ్బిళ్ల పాట పాడుతూ కొంతమంది ఆడపిల్లలు వచ్చేవారు. వాళ్లు గంప కింద పెట్టుకొని సంగుని చప్పట్లుకొడుతూ ఆగంప చుట్టూ తిరుగుతూ గొబ్బిళ్ల పాట పాడితే మూరీ, సీతి, వెంకి విని సంతోషించేవారు. వాళ్లు చెరో పిడకా ఆ పిల్లలకి ఇచ్చేవారు.

ఆడపిల్లలు వెళ్లిపోయిన తరవాత మగపిల్లలు భోగిక్రంకోసం పాడుకుంటూ వచ్చేవారు.

"కావడోయి భీమడోయి

కందిపప్పు కేముడోయి

చెన్నపట్నం చెరుకుముక్క

నీకోముక్క, నాకోముక్క"

అని వాళ్లు అరుస్తూంటే సీతి ఒక చిన్న కర్రముక్కో, లేకపోతే ఒక పిడకముక్కో ఇచ్చేది. వాళ్లు పాడుతూ ఇంకో ఇంటికి పోయేవారు,

సుద్దముక్క పుచ్చుకొని వెంకి ఇల్లంతా ముగ్గులు పెట్టడం నేర్చుకుంటోంది. మూరి నేర్పుతోంది సీతికీ, వెంకికీని. సీతికి కొంచెం ముగ్గులు పెట్టడం, అనగా బొట్లు పెట్టి కలపడం, మిఠాయిపొట్లం ముగ్గు పెట్టడం వచ్చింది. వెంకికి సుద్దముక్కతో గీతలు గియ్యడం తప్ప అసలు ముగ్గులేమీ రావు.

౨

ఇక సంక్రాంతి వారంరోజులుందనగా మూరీ, సీతీ, వెంకీ అరుగుమీద కూర్చుని గచ్చకాయ లాడుతున్నారు. ఆసమయంలోనే వాళ్లింట్లో వాళ్లమ్మకీ, నాన్నకీ చిన్న యుద్ధం జరుగుతోంది.

"నాదగ్గిర డబ్బులేదు. నేను కొనను" అంటున్నాడు వాళ్ల నాన్న.

"అయ్యో! కొనకపోతే ఎలాగ! పండుగని ఎంతో ముచ్చట పడుతున్నారు వాళ్లు పాపం" అంది వాళ్లమ్మ.

"ఇంకో పండుక్కి చూసుకోవచ్చులే. ఇప్పుడప్పుచేసి కుట్టించను, వాళ్లకి కొత్తబట్టలు."

"అయ్యో! అలా అనకండి. వాళ్ల కెంత గావాలి? ఏడాది కొక్కసారి వచ్చే పండుగాయెను."

"అన్ని పండుగలూ ఏడాదికొకసారే వస్తాయి. నెలనెలకీ ఏదో ఒక పండుగ వస్తూనే ఉంటుంది. చేతులో డబ్బు ఉన్నప్పుడు కుట్టిస్తాలే."

"ఇది పెద్దపండుగ. అలా అనకండి. పిల్లలు చిన్నపుచ్చుకుంటారు. పొరుగు పిల్లలందరూ కొత్త పరికిణీలూ, కొత్త చొక్కాలూ వేసుకుతిరుగుతూ వుంటే మన పిల్లలు మాసిన బట్టలు కట్టుకు తిరగడానికి యేమంత ఖర్మం వచ్చింది! ఊరుకోండి, ఎవరేనా వింటే నవ్విపోతారు."

"మరేం నవ్వరు లెద్దూ"

"ఇదేమిటమ్మా ఈ మొండిపట్టు? ఎంత చెప్పినా వినరు. పిల్లలకి కొత్తబట్టలే లేకపోతే ఈ పండుగలు చేసుకోడా లెందుకు? ఈ పిండివంటలు వండుకోడా లెందుకు?" అని బుగ్గలు చేతులతో నొక్కుకుంది.

వాళ్ల నాన్నకి కోపంవచ్చి కేకలేశాడు.

వీధిలో ఆడుతూన్న ముగ్గురు పిల్లలూ కేకలు విన్నారు.

అప్పుడు సీతి వెంకిలో అందిగదా: "వెంకీ, వెంకీ, నాన్నేం, మనకేం, కొత్త పరికిణీలు కుట్టించ నంటున్నారు. నీవిప్పు డేం చేస్తావాఅంటే నాన్న దగ్గరకు వెళ్లి నాన్న కాళ్లు రెండూ గట్టిగా పిటకరాయిలాగ పట్టుకో. పట్టుకొని అంటావు గదా 'నాన్నా, నాన్నా, నాకూ, అక్కయ్యలకీ కొత్త పరికిణీలు కుట్టించవూ' అని."

అపుడు నూరి అందిగదా: "ఒసే సీతీ, అలా చేస్తే నాన్నకి కోపం వస్తుందేమోసే. అమ్మ చెపుతుందిలే, నాన్నతో, కుట్టించమని"

"ఉండొసే నీకు తెలీదు. ఊరుకో నూరీ! వెళ్లవే వెంకీ, వెళ్లు."

వెంకి గబగబ పరుగెత్తుకెళ్లి వాళ్ల నాన్నకాళ్లు రెండూ గట్టిగా పట్టుకుంది. పట్టుకొని "నాన్నా, నాన్నా, కొత్త పరికినీలూ ఊ ఊ ఊ........"అని మూలగడం మొదలెట్టింది.

కొంత సేపయాక నూరీ, సీతీ వచ్చారు. నూరి అందిగదా: "నాన్నా, నాన్నా, వాళ్లమ్మాయే ఉల్లిపువ్వుల పరికిణీ కుట్టించుకొంది. నాన్నా, యెంచక్కుంది! మాకూడా కుట్టించిపెట్టవూ?"

సీతి అందిగదా: "పోనీలే నాన్నా, నీ వెప్పుడూ యింతే! కుట్టించిపెట్టమంటే కుట్టించవు. ఇప్పుడు వెడదాం రా నాన్నా బజారుకి"

వెంకి నాన్న పంచ లాగుతూ "రా నాన్నా బజారూ, గా నాన్నా బజారూ" అని అనడం మొదలెట్టింది. వాళ్లు ముగ్గురూ కలిసి నాన్నని బజారుకు లాక్కుపోయారు. వాళ్లమ్మ వంటింట్లోంచి చూచి నవ్వుకుంటోంది.

3

"ధర్మసంవర్ధనీ మాయమ్మ
నమ్మితినమ్మ
దాసుని దయజూడవలె నమ్మ
ఎన్ని జన్మము లెత్తితిని తల్లీ! కల్పకవల్లీ!
ఎన్ని జన్మము లున్నవో మళ్లీ."

అంటూ సాతాని కాషాయవస్త్రాలు కట్టుకొని గుమ్మడిపండు చెంబు నెత్తిమీద పెట్టుకొని తంబురా, చిరతలూ చేతులతో పట్టుకొని వాయిస్తూ భోగినాడు వాళ్లింటికి వచ్చాడు. తలంటునీళ్లోసుకొని, కొత్తపరికిణీలు కట్టుకొని, కొత్తజాకెట్లు తొడుక్కొని, కాటుకా బొట్టూ పెట్టుకొని, బుట్టెడు బియ్యం అరుగుమీద పెట్టుకొని నూరీ, సీతీ, వెంకీ ఇంటికి వచ్చిన బిచ్చగాళ్లందరికీ గుప్పెడు గుప్పెడు బియ్యం వేస్తున్నారు.

ఆరోజున వాళ్లందరూ తెల్లారకుండానే లేచారు. తలనీళ్లు పోసుకున్నారు. వసారాలో వేల్లాడదీసిన చిల్లిపిడకలన్నీ పెరట్లోనే పోగేసి భోగిమంట వేసుకొన్నారు. సీతి వాళ్లనాన్న రూళ్లకర్ర తెచ్చి భోగిమంటలో పడేసింది. వాళ్లమ్మ అప్పడాలకర్ర వెంకి పడేసింది. వాళ్లనాయన ప్రక్కవాళ్లదగ్గర వెదురుకర్ర తీసి భోగిమంటలోకి పడేశాడు. భోగిమంట దగ్గర వాళ్లింతోసేపు చలికాచుకొన్నారు.

"అబ్బీ, అబ్బీ, నీ కింకా పాటలొచ్చునా?" అంది నూరి.

"వచ్చునమ్మా" అని—

"ఘుమ్మఘుమ్మన పెరుగు తరచగ
కోరి విని ప్రార్థించి కృష్ణుడు
అమ్మ వెన్నా అనుచు కవ్వము
అణచిపెట్టగను
నమ్మరా కృష్ణమ్మ! పెరుగులో
నడుమ గుమ్మడు తిరుగు లాడును
నమ్మకున్నను ఘుమ్మ ఘుమ్మను
నాద మిటు వినుమీ
కృష్ణా! గుమ్మ డిదుగో!"

పాడాడు. నూరీ, సీతీ, వెంకీ గుమ్మడిపండు చెంబులో తలోగుప్పెడు బియ్యం పోశారు. సాతాని పాడుకొంటూ ఇంకోఇంటికి పోయాడు.

ఇలా ఎంతోమంది పాటలు పాడుకుంటూ వచ్చారు. వారిచేత రకరకాల పాటలు పాడించుకొని వారికి నూరీ, సీతీ, వెంకీ తలో దుప్పెడు బియ్యం పెడుతూనే ఉన్నారు. కాకులూ పిచికలూ అప్పుడప్పుడు వాళ్లదగ్గరకు వచ్చేవి. వాళ్లు కాసిని బియ్యం చల్లితే అవి తినేసిపోయేవి. ఇలా మధ్యాహ్నందాకా వాళ్లు బిచ్చగాళ్లకీ, కాకులకీ, పిచికలకీ బియ్యం వేస్తూనే ఉన్నారు.

ఇంతట్లోకే వాళ్లమ్మ "నాన్నగారు మడి కట్టుకున్నారు. రేంపర్రా బువ్వ తిందురుగాని" అని కేకేసింది.

"వస్తున్నామే" అని వాళ్లు అరుగుమీదనుంచి లేచారు. అడుక్కునే ముసిలమ్మ అలా పోతోంటే దాన్ని పిల్చి, బుట్టలో బియ్యం దాని వళ్లో పోసింది సీతి.

ముగ్గురూ ఇంట్లోకి వెళ్లిపోయారు.

ఇంట్లోకి వెళ్లి ముగ్గురూ కాళ్లుకడుక్కుని భోజనానికి కూర్చున్నారు. వాళ్లమ్మ వడ్డిస్తోంది.

"అమ్మా, నాకేం వండిపెట్టావు" అంది సీతి.

"నీకు పులిహోర చేసిపెట్టానులే" అందివాళ్లమ్మ.

"నాకో అమ్మా" అంది వెంకి.

"నీకు బొబ్బట్లు ఇష్టమేగా?"

"మరి నాకో! పరమాన్నం చేసిపెట్టావా అమ్మా" అంది నూరి.

"ఇన్నుంటే ఇంకా పరమాన్నం ఎందుకే" అన్నాడు వాళ్ల నాన్న.

"రేపు చేస్తాంలే" అంది వాళ్లమ్మ.

నూరి ధుమధుమలాడుతూంటే "నీ కోసం ఓ తాయిలం పెడతానులే" అంది వాళ్లమ్మ.

"నాకూ పెట్టాలి తాయిలం. నాకూను" అన్నారు సీతీ, వెంకీని.

తరువాత ముగ్గురూ కబుర్లు చెప్పుతూ ఒకళ్లమీద ఒకళ్లు పొడ్లు వేసుకుంటూ భోజనాలు చేశారు.

## ౪

పెద్దపండుగనాడు సూర్యుడు ఉత్తరదిశాభిముఖుడై ఉదయాన్నే ప్రకృతికంతకూ బంగారునీరు పూశాడు. దేశంలోనివాళ్లంతా కొత్తబట్టలు కట్టుకున్నారు. చెట్లుకూడా కొత్తబట్టలు కట్టుకున్నట్టే ఉన్నాయి. బీదవాళ్లుకూడా కొత్తబట్టలు కట్టుకున్న భావంతోనే ఉన్నారు. ఆ ఉదయాన్ని లోకము పెదవులలోనుంచి వెలువడిన మందహాసము సాయంకాలానికి పెద్దనవ్వుగా మారబోతోంది.

ఉదయాన్నే వినిపించాయి జేగంటలు. భాస్కరుని బంగారు కాంతికి మెరుగుపెడుతున్నాయి. దేవుడు పల్లకిలో ఎక్కి భక్తుల దర్శనం కోసం, భక్తుల కానుక లందుకోడం కోసం వీథివీథులా ఊరేగడానికి బయలుదేరాడు. పూలదండలతో, మంగళవాద్యాలతో, స్వస్తివాక్యాలతో, వాత్సల్యసౌరభాలతో.

ఆ పెద్దపండుగనాడు దుఃఖచ్ఛాయల్ని వేటాడి తరుమగొట్టడానికి దేవుడు బయలుదేరాడు.

నూరీ, సీతీ, వెంకీ కొత్తబట్టలు కట్టుకున్నారు. వాళ్లమ్మ వాళ్ల నలంకరించింది. దేవుడి బాజాలు వినిపిస్తున్నాయి. దేవుడికి హారతివ్వడానికి ముగ్గురూ ఉబలాటపడుతున్నారు. పెద్దపళ్లెంనిండా బియ్యం పోశారు. తాంబూలం పెట్టారు. హారతికర్పూరం పెట్టారు. అరటిపళ్ల అత్తం ఒకటి పెట్టారు. అన్నయ్య నాలుగు అగరొత్తులు పడేశాడు.

కాగడాలతోటే, బాజాలతోటే దేవుడు వాళ్లింటిముందరికి వచ్చాడు.

నూరీ, సీతీ, వెంకీ ముగ్గురూ పళ్లెం పట్టుకువచ్చి పూజారి కిచ్చారు. పూజారి బియ్యం, పళ్లూ అన్నీ దేవుడిముందు పోసి, కర్పూరం వెలిగించి దేవుడికి హారతిచ్చాడు. హారతిస్తూంటే వాళ్లమ్మ లెంపలు వాయించుకొని దేవుడికి దణ్ణంపెట్టింది. వాళ్లమ్మను చూచి నూరీ, సీతీ, వెంకీ కూడా దేవుడికిదణ్ణంపెట్టారు. పూజారి హారతిపళ్లెం నూరిచేతి కిచ్చాడు. అందరికీ శఠగోపం పెట్టి పువ్వుల ప్రసాదం ఇచ్చాడు. అందరూ దీపం కళ్లకద్దుకున్నారు. అద్దుకుంటూ వాళ్లమ్మ అంది

కదా-“దేవుడి పుణ్యాన్ని మా నూరికి మంచిసంబంధం వచ్చి చప్పున పెళ్లి అయితే బావుండేది.” అంటే నూరి సిగ్గుపడింది. సీతీ, వెంకీ నూరికేసి నవ్వారు. నూరికి ఉడుకుమోత్తనం వచ్చి ఇంట్లోకి పారిపోయింది.

ఆరోజల్లా వాళ్లు ముగ్గురూ బిచ్చగాళ్లకి బియ్యం వేస్తూ ఆడుకుంటూ, పాడుకుంటూ-ఖులాసాగా కాలం గడిపారు.

౨

కనుమునాడు తెల్లారకుండానే లేచి వాళ్లమ్మ, నూరీ, సీతీ కలిసి పెద్ద పెద్ద ముగ్గులు పెట్టారు. వాళ్లమ్మ పెద్దరథం పెట్టింది. వాళ్లు దానిచుట్టూ చిన్న చిన్న ముగ్గులు పెట్టారు. ఆ రథాన్ని పక్క ఇంటి రథంతో కలిపారు. ఈవిధంగా ఊళ్లో ఉన్న ముగ్గులన్నీ కలిసి ఒక ముగ్గు అయాయి. సౌందర్య దేవత కౌగిలిలో ఆ ఊరంతా ఆనాడు ఒదిగింది.

వాళ్ల నాన్న ఓగడ్డిమోపు కొని వాళ్లింటిముందర పడేశాడు. పశువులకుగూడా ఆనాడు పండుగే. యథేచ్ఛగా ఎవరింటికేనా వెళ్లి అవి కావలసినంత గడ్డి తినవచ్చు.

తాళాలు వాయిస్తూ, అంబోతులకు అచ్చు వేసి కాపులు వీధుల్లో ఊరేగిస్తున్నారు. వ్యవసాయదారులు తమ పశువుల కొమ్ములకు రంగులు వేసి వాటిని అలంకరిస్తున్నారు.

కనుమునాడు కాకికూడా మునుగుతుందని చెప్పి వాళ్లమ్మ అన్నయ్యకీ, నూరికీ, సీతికీ, వెంకికీ తలనీళ్లు పోసింది.

“అమ్మా! ఇవ్వాళ ఏం వండుతావే” అంది సీతి.

“కనుమునాడు మినుము తినాలికాదూటే” అంది నూరి.

“అయితే అమ్మా! ఈవాళ ఆవడలు చేసిపెట్టు” అంది సీతి.

“మీ నాన్నగారి నడిగి చెప్తానులే” అంది వాళ్లమ్మ.

“నాన్నా, నాన్నా, నీకు ఆవడలు కావాలి కాదూ” అంది సీతి.

“సరే మీ ఇష్టం” అన్నాడు వాళ్ల నాన్న.

నూరీ, సీతీ, వెంకీ అరుగుమీదకూర్చున్నారు. ఆదారిని పోయే పశువులు వాళ్లింటిముందరి గడ్డి తింటున్నాయి. అన్ని రకాల బిచ్చగాళ్లకీ బియ్యం పెడుతున్నారు వాళ్లు. బియ్యం పుచ్చుకొనే ఆనందం బిచ్చగాళ్లదీ, బియ్యంపెట్టే ఆనందం పిల్లలదీ, పిల్లలు పెడుతున్నారనే ఆనందం తల్లిదండ్రులదీ!

ఆ పెద్దపండుగ మూడు రోజులూ ఎవరు ఏపని చేసినా ఆపనులలో ఆనందాన్నే వారివారి మనస్సులు చూస్తున్నాయి.



# ప్రభాతవల్లకి

—

= శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

కడచిపోయెను పూర్వజీవిత
గాథ లేవో విస్మృతింబడి,
కడలనెల్ల నవీనరోచులు
కరుడుగట్టినవి.

శ్రావ్యమైన శకుంతగానము
స్వాంతముల రగులించుచున్నది
మాతృసేవామధురిమంబుల
మలయు సౌఖ్యములు.

తరుణమున నీహృదయ వీణా
తంత్రులను కదలింపుమోయీ
తరుణతరుణహృదంతరంబులు
తాండవింపగను.

ఎన్నిమూర్ఛన లుద్భవంబై
ఎంత బ్రహ్మానంద మొదవునో
భావభరితప్రభాతవల్లకి
పాటలో నింకా.

కాలవాహిని కలిసిపోయిన
గాథలోనే లీనమగునో
ఘనవినూతనవ్యాసకోదయ
గర్భమే గదలించునో!

# సర్వజ్ఞాత్మముని

— శ్రీ నిర్వికల్పానందస్వామి

సర్వజ్ఞాత్మముని అని ప్రసిద్ధిగాంచిన నిత్యబోధాచార్యులు శృంగేరీపీఠము నధివసించిన ఆచార్య పరంపరలో నొకడు. ఈయనగురుని పేరు దేవేశ్వరుడు. క్రీ. శ. ౮, లేక ౯-వ శతాబ్దము ఈయన జీవిత కాల మైయుండవచ్చును. ఈయనజీవితమునందలి విశేషము లేమియును తెలియవచ్చుట లేదు.

## సంక్షేప శారీరకము

కాని, అద్వైతవేదాంతవాఙ్మయమున ఏతత్కృతమగు సంక్షేపశారీరక మను గ్రంథము సమధికప్రసిద్ధిని గాంచియున్నది. ఈ గ్రంథము 'ప్రకరణ-వార్తిక' జాతీయ మని గ్రంథకర్తయే నుడివియున్నాడు. శాంకరభాష్యమునకు వార్తికస్థానీయమగు ప్రకరణ గ్రంథ మిది. ఇందు వేదాంతసూత్రములందువలెనే సమన్వయావిరోధసాధనఫలము లను నాల్గు ప్రకరణము లున్నవి. ప్రథమాధ్యాయమున ౬౫౩ శ్లోకములును, ద్వితీయాధ్యాయమున ౨౪౮ శ్లోకములును, తృతీయాధ్యాయమున ౩౬౫ శ్లోకములును, చతుర్థాధ్యాయమున ౬౩ శ్లోకములును కలవు.

## వ్యాఖ్యలు

ఈ గ్రంథమునకు మధుసూదనసరస్వతి రచించిన సారసంగ్రహ మను టీకయును, రామతీర్థస్వామి రచించిన 'అన్వయార్థప్రకాశిక' యను టీకయును ఉన్నవి. మూలగ్రంథమును, టీకలునుగూడ ముద్రితములైనవి.

ఈ 'సంక్షేప'శారీరకము శాంకరసూత్రభాష్యమును వివరించుటకు వ్రాయబడిన బృహద్గ్రంథము. ఇక, సర్వజ్ఞాత్మముని అనుసరించిన క్రమమును ఒకింత పర్యాలోకింతము.

## చతుస్సూత్రీ వ్యాఖ్య

బ్రహ్మవిద్యాధికారికిని, జిజ్ఞాస్యమగు బ్రహ్మమునకును అభిన్నత్వమే సమీచీనము. ఏలయన, 'త్వం' పదార్థవాచ్యుడగు ఈ ముముక్షువునకు స్వనిష్ఠమగు కర్తృత్వాదుల అధ్యాస యున్నది. దీనిని తొలగించుకొనుటకే బ్రహ్మజిజ్ఞాస. తానే బ్రహ్మము కాని యెడల ఈ ఎరుకవలన సిద్ధించున దేమియును లేదు. ఒకరికి సంబంధించిన జ్ఞానము మరియొకరి బంధమును ఎట్లు త్రుంపగలదు? కనుకనే జీవబ్రహ్మముల కభిన్నత్వము నంగీకరింపవలెనని వేదాంతసూత్రములలోని ప్రథమసూత్రము నిర్ణయించుచున్నదని సంక్షేపశారీరక కారు డనుచున్నాడు.

ద్వితీయసూత్రము జగత్కారణప్రవర్ణనవ్యాప దేశమున తత్పదార్థమును నిరూపించుచున్నది. తత్-పదార్థమగు బ్రహ్మమును, దాని స్వరూపతటస్థలక్షణములను నిర్వచించి, జీవబ్రహ్మముల నైక్యమును ప్రదర్శించుటయే ద్వితీయసూత్రతాత్పర్యము. చతుర్థసూత్రమీ నైక్యమును సమధికముగ ప్రతిపాదించుచున్నది. తృతీయసూత్రము బ్రహ్మముయొక్క శాస్త్రప్రమాణకత్వమును వాకొనుచున్నది.

## అనుబంధములు

ప్రత్యగాత్మయొక్కయు, బ్రహ్మముయొక్కయు ఏకత్వబోధయే ప్రయోజనము. ఇదియే ఉపేయము. త్వంపదార్థమును, తత్పదార్థమును విషయములు. వీనిలో తత్పదార్థము అజ్ఞాతము; త్వంపదార్థము మిథ్యాజ్ఞాతము. కనుక నివి విచారవిషయము లగుచున్నవి. ఆత్మ అప్రమేయము—అనగా ప్రమాణమునకు విషయీభూతము కానేరదు. ప్రమాణమునకు విషయీభూతమగుచో ఆత్మ దృశ్యమగును. దృశ్య

మగుచో జడమగును. జడమైన అనిత్య మగును. జడమునకు వికారము అవశ్యంభావ్యము. జీవబ్రహ్మములకు భేదములేదు. భేదము భ్రాంతిఫలము. భ్రాంతియే వివర్తమునకు మూలము. జ్ఞానమున అజ్ఞాన ముండజాలదు. జ్ఞానస్వరూపమగు బ్రహ్మమున ప్రపంచ ముండినప్పుడుకూడ ప్రపంచముయొక్క అభావమునే గుర్తింపవలెను. సదసద్విలక్షణమనునది మిథ్య. సత్య జ్ఞానమున మిథ్యాత్వబోధముండజాలదు.

### జగత్తుయొక్క ఉనికి

అగుచో, జగత్తు ఎందులకు కనబడుచున్నది? జ్ఞానస్వరూపమగు బ్రహ్మమున జగత్తును, తత్కారణమగు అజ్ఞానమును నుండజాలవు. కనుకనే అజ్ఞానవశమున జగత్తు ప్రతీతము కాజాలదు - అని ప్రశ్నించినచో: బ్రహ్మాకారమగు వృత్తిజ్ఞానము అజ్ఞానమునకు విరోధి; బ్రహ్మము విరోధికాదు. ఇట్టి వృత్తిజ్ఞానము వలన అజ్ఞానము నష్టమైన బంధనము ఘటిల్లదు. అప్పుడు అజ్ఞానరహితమగు బ్రహ్మము మాత్రమే యుండును. అజ్ఞానము జగద్భ్రమకు కారణము కాకపోయిన జ్ఞానమువలన నిర్విశేషముక్తి కలుగదు. ఈశ్వరేచ్ఛాదికములను కారణములుగ స్వీకరించినయెడల, చాల దోషములు ఘటిల్లును. అద్వైతవాదికి విశదమగు చరమ పూర్వపక్షమును, సమాధానమును గూడ నిదియే.

### అధికారి: సాధన

బ్రహ్మజ్ఞానమునకు విధితో నిమిత్తము లేదు. అధికారి నిర్ణయ ప్రసంగమున యమనియమములను గురించి సర్వజ్ఞాత్మముని యొనర్చిన వ్యాఖ్య మధురముగ నున్నది.

యమస్వరూపా సకలా నివృత్తి
స్తథా ప్రవృత్తిః నియమస్వరూపా,
నివర్తకా దత్ర యమప్రసిద్ధిః
ప్రవర్తకాత్ స్యాన్నియమ ప్రసిద్ధిః.
(సం. శా. ౧-౫౭)

సర్వవిధములగు ప్రాణిపీడ నుండియు, అనృత వాక్య ప్రయోగము నుండియు నివృత్తమగుట యమము. శౌచాదిరూపమగు ప్రవృత్తి నియమము. హింసాది నివర్తకమగు శాస్త్రము యమము. శౌచాది ప్రవర్తకమగు శాస్త్రము నియమము. హింసాదులను పరివర్జించి శౌచాదులను గ్రహించుటవలన బ్రహ్మజ్ఞానమున కధికారి యగును. నివృత్తి ద్వివిధము. ప్రథమము బహిఃస్థితమగు శరీరేంద్రియముల సంయమము. ద్వితీయము అంతరస్థమగు కూటస్థచిత్స్వరూపావస్థానము. కేవలము బహిరింద్రియములయొక్కయు, మనస్సుయొక్కయు సంయమమును సంపాదించిన చాలదు. ఒకానొక బహిర్విషయమును గ్రహించి మనస్సు ఏకాగ్రతను బొందినను బొందవచ్చును. దాన లాభములేదు. ఆత్మస్వరూపావస్థితియందే మనస్సంయమము సార్థకత్వమును సంపాదించుకొనచున్నది.

నిష్కామ కర్మము జ్ఞానమునకు సహకారి రూపమున బరిగ్రహించి, పరిపూర్ణాంతఃకరణుడైన ముముక్షువే వేదాంత విద్యాశ్రవణమునకు అధికారి

శాస్త్రప్రయోగ పరిపక్వతా సాధనేన
సాధ్యప్రభావత్ప్రభాసన ముముక్షుః,
సంగ్రహమనే గురుముఖేన సహాత్ర
వేదాంతవాక్య విషయశ్రవణాధికారీ.
(సం. శా. ౧-౬౦)

యజ్ఞాదికములను కర్మములు ఫలాకాంక్షా వర్జితములై అనుష్ఠింపబడినయెడల నిర్మలము, అనగా బ్రహ్మజ్ఞానేచ్ఛ కలుగును. ఈ ఇచ్ఛను గలిగింపజేయుటయే కర్మతాత్పర్యము.

తరువాయి గ్రంథమున గురుశిష్య సంవాద రూపమున ప్రత్యగాత్మయే బ్రహ్మమని నిరూపింపబడుచున్నది.

### వాక్యార్థము : లక్షణ

శబ్దముయొక్క ప్రవృత్తి వస్తుమాత్రము. బ్రహ్మాత్మ వస్తు నిరూపణము నిమిత్తము; అన్యప్రమాణముతో నిమిత్తము లేదు. వేదాంతవాక్యములు అనర్థనివృత్తి నొనర్చుచు నిషేధముఖమున వస్తునిరూపణ మొనర్చుచున్నవి. కనుక, నీ విషయమున వేదాంత వాక్యములును, అనుభూతియును ప్రమాణము లగుచున్నవి.

బ్రహ్మాత్మబోధము అప్రమేయము. బ్రహ్మము ప్రత్యగాత్మస్వరూపమగుటవలన నెట్టి ప్రమాణమునకును విషయము కాజాలదు. ప్రభాకరమతస్థు లంగీకరించు నియోగవిధి కవకాశము లేదు. తత్త్వమస్యాది వాక్యవిచారమున లక్షణాబలమున నర్థము సిద్ధించుచున్నది. ఈ లక్షణయే జహదజహల్లక్షణ. త్వంపదార్థము యొక్కయు, తత్పదార్థముయొక్కయు ఉపాధులు పోయినయెడల శుద్ధమగు నిర్విశేష బ్రహ్మమే సిద్ధించుచున్నది.

నిత్యః శుద్ధో బుద్ధముక్త స్వభావః
సత్యః సూక్ష్మః సన్ విభు శ్చాద్వితీయః
ఆనందాబ్ధిః యః పరః సోఽహమస్మి
ప్రత్యగ్ధాతు ర్నాత్ర సంశీతిరస్తి.
(సం. శా. ౧-౧౬౩)

## విధి : నియోగము

ఆకాశాదులు వ్యావహారిక (ఆపేక్షిక) నిత్యములు. కాని, ప్రత్యగాత్మ పారమార్థిక నిత్యము. అట్లే ఆకాశాదుల శుద్ధత్వ నిత్యత్వాదులు వ్యావహారికములు. కాని ప్రత్యగాత్మయొక్క శుద్ధత్వనిత్యత్వములు పారమార్థికములు. సత్యమునకును, జ్ఞానమునకును భిన్నత్వము లేదు. ఈ జ్ఞానమే ఆనందము. ఇది ఆత్మబోధమువలననే సిద్ధించుచున్నది.

కేవలము ప్రభాకరమతమునే గాక భాట్టమతము ననుసరించి చూచినను, శబ్దభావనతో నిమిత్తము లేదు.

అతో న వేదాంతవచస్సు విద్యతే
విధి ర్నియోగో న చ శబ్దభావనా,
న కర్మకాండేపి నియోగతోఽస్య సా
యతో నిషేధేషు న విద్యతే విధిః.
(సం. శా. ౧-౮౮౭)

శంకరుడు భాట్టమతమును నిరసింపలేదు. సురేశ్వరుడు 'విధివివేకము'న దానిని నిరసించినాడు. సర్వజ్ఞాత్మముని దానిని ఖండించుట ఉచితమే! నిష్క్రియబ్రహ్మ ప్రతిపాదనమే వాక్యతాత్పర్యము. అఖండబోధ వాక్యబలముననే సిద్ధించుచున్నది. వేదాంతవాక్యముల ననుసరించిన ముక్తి లభింపగలదు.

శక్నోతి సిద్ధ మవబోధయితుంచ వాక్యం
శక్నోతి కార్యరహితం వదితుంచ వాక్యమ్,
శక్నో త్యఖండ మవబోధయితుంచ వాక్యం
శక్నోతి ముక్తిఫల మర్పయితుంచ వాక్యమ్.
(సం. శా. ౧-౫౬౨)

వేదాంతవాక్యము లన్నియును నిష్క్రియమును, నిర్విశేషమును నగు బ్రహ్మమునే ప్రతిపాదించుచున్నవి. ఇదియే సరసికమగు సిద్ధాంతము.

## ప్రమాణాగోచరత

స్వప్రకాశమగు వస్తువును ప్రమాణిత మొనర్ప ఇతర ప్రమాణముల ఆవశ్యకత లేదు. ప్రమాణప్రమేయ వ్యవహారము అవిద్యాకల్పితము. సమస్తప్రమాణములును జడవస్తునిష్ఠములు. అజ్ఞాతవస్తుజ్ఞాపనము ప్రమాణాధీనము కాదు. అజ్ఞానియే వ్యవహారకాలమున ప్రమాణాదుల సాయము నంగీకరించి, లోకవ్యవహారమును నడుపుకొనుచున్నాడు.

అజ్ఞాత మర్థ మవబోధయితుం నశక్త
మేవం ప్రమాణ మఖిలం జడవస్తునిష్ఠమ్,
కిం త్వప్రబుద్ధపురుషం వ్యవహారకాలే
సంశ్రిత్య సంజనయతి వ్యవహారమాత్రమ్.
(సం. శా. ౨-౨౧)

## బౌద్ధమతము

బౌద్ధమతమునకును, శంకరమతమునకును ఎట్టి సాదృశ్యమును లేదు. బౌద్ధమతమున సకలమును క్షణికము; అగుటచే ప్రమాణప్రమేయవ్యవహారము అసంభవమగుచున్నది. శంకరమతము ఈ వ్యవహారమునకు సత్త నంగీకరించుచున్నది. బౌద్ధమతమున జ్ఞానమగు నదియే అనిత్యమును, అస్థిరమును. కాని, శంకరమతమున జ్ఞానస్వరూపము నిత్యమును, స్థిరమును. వివర్తమనబడు విభ్రమమునకు ఆశ్రయము అఖండజ్ఞానము. కనుక, ఈ రెండు మతములకును ఎట్టి సాదృశ్యమును లేదు. బౌద్ధమతఖండనావసరమున సర్వజ్ఞాత్మముని శాక్యభిక్షు, బుద్ధముని, భదంతముని మున్నగు పదములను బుద్ధుని సూచింప ప్రయోగించినాడు.

## ఆరంభపరిణామవాదములు

కూటస్థనిర్వికారమగు బ్రహ్మమునకు పరిణామ మసంభవము. చైతన్యస్వరూపమగు బ్రహ్మము ఘటాదులవలె పరిణామము నందజాలదు. కార్యకారణభావము ప్రతిభాసమాత్రమే. కనుక వివర్తవాదమే స్వీకార్యము. కణాదుడు ఆరంభవాది. బౌద్ధుడు సంఘాతవాది. కపిలుడు పరిణామవాది. ఈ వాదము లన్నియు అయౌక్తికములును, శ్రుతిసిద్ధాంత విరుద్ధములును. సంఘాతవాదము నంగీకరించు బౌద్ధులకు నిత్యుడగు సంధాత లేడు. ఆరంభవాది ఆది ఎవ్వడో చెప్పలేడు. సాంఖ్యులు చెప్పునట్లు జడప్రకృతిచే సృష్టికర్తగ నంగీకరించిన, విచిత్రజగద్రచన కది సమర్థమని నిర్ధారణ చేయజాలము. కనుక వాచారంభణశ్రుతి ననుసరించి వివర్తవాదమే అంగీకార్య మగుచున్నది.

## ఏకజీవవాదము

అవిద్యా-ప్రతిబింబమే ఈశ్వరుడు; అంతఃకరణప్రతిబింబమే జీవుడు. ఈ జీవు డొక్కడే అనుచో క్రమ బద్ధముండు మనకు పెక్కులుగ తోచు జీవులలో నొకని అజ్ఞానము తొలగినయెడల అందరి అజ్ఞానము తొలగవలసియుండును గాదె అనిన: వ్యక్తియొక్క అజ్ఞానము పోయినను, అది జాతిరూపమున నిలచును. వ్యక్తికంటె జాతి అపేక్షికముగ నిత్యము. కనుక వ్యావహారికముగ ఈ అజ్ఞానము నిలిచియే యుండును.

అజ్ఞానం సకలప్రమోహజనకృత్
పిండేషు సామాన్యత
జీవానాం ప్రతిబింబకల్పనపుషాం
బింబోపమే బ్రహ్మణి,
విద్యాంశం పురుషం జహాతి
విద్యావిహీనం పరం
వస్త్రాన్తమివ వాత్మపింషేమథునా
జాతిస్థ శ్రైకే జనుః. (సం. శా. ౨-౧౩౨)

## జీవబహుత్వ నిరసన

అద్వైతులలో కొందరు అజ్ఞాన బహుత్వమును, జీవబహుత్వమును అంగీకరించుచున్నారు. సర్వజ్ఞాత్మముని ఈ అభిప్రాయములను సమర్థింపలేదు. మరి కొందరు ఆకాశమున నొక తావున పక్షి యుండినను, అన్యత్ర లేకుండునట్లు శుద్ధబ్రహ్మమున భావాభావములు స్వీకార్యము లనుచున్నారు. అవిద్యాయుక్తుని బద్ధునిగను, రహితుని ముక్తునిగను గ్రహింపవలెను. అవిద్యావిలాసమున కాశ్రయమగు శుద్ధబ్రహ్మమే జగత్కారణమని అన్యులు. ఈ పక్షము ననుసరింప బూనినను, నిరంశబ్రహ్మమున యుగపత్తుగ అజ్ఞానముయొక్క భావాభావములను సమర్థింపజాలము. వీరు తమోవృత్తియే చైతన్యనిరోధకమందురు. ఈ సిద్ధాంతము నంగీకరించి బద్ధముక్తవ్యవస్థను నేర్పరిచినను, ఈవ్యవస్థ యుక్తియుక్తమని తోచదు.

ఇక అజ్ఞాన మొక్కటేనని యైనను తత్కార్య బహుత్వమును స్వీకరించు పక్షమువారు, అజ్ఞానమునందు ఒక అంశము నాశమైనను మరియొక అంశము మిగిలియుండు నందురు. ఇదియును బద్ధముక్తవ్యవస్థను నిల్పుటకే. అన్యపక్షీయులు అజ్ఞానానేకత్వ బహుత్వము నంగీకరించుచు, ప్రత్యేకాజ్ఞానగత ప్రతిబింబభూతమగు జీవనానాత్వమును స్వీకరించుచున్నారు. ఇతరులు ఈశ్వరుడు బద్ధుని ప్రతిమాయాజాలమును ప్రసృత మొనర్చుచు, ముక్తునినుండి వినివృత మొనర్చుచున్నాడందురు.

భేదమును అంగీకరించు ఈమతము లన్నియును అసంగతములు. జీవనానాత్వముకూడ అనంగీకార్యము. ఏలయన ఆత్మ విభువై ప్రతిశరీరమున భిన్నమగుచున్నదనిన, ఒకే శరీరమున పెక్కు ఆత్మల సంస్థితి నొప్పుకొనవలసియుండును. కాని, ఆత్మ సర్వదా ముక్తము. జీవుడు భ్రాంతివలన బద్ధుడనని తలచినప్పుడు కూడ అది ముక్తమే. బద్ధముక్తవ్యవస్థ అజ్ఞానకల్పితము. పారమార్థికదృష్టికి మాయ లేదు. జ్ఞానమున దేశకాలవ్యవస్థితముగ అజ్ఞానముయొక్క ఉనికి సంఘటితముకాజాలదు. కనుకనే, బ్రహ్మస్వరూపమున మాయకు త్రికాలాభావము.

నృష్టం తమః స్ఫురణమాత్రం న తత్ర తద్వత్
సర్వేశ్వర ఇతి తత్ర నిషిద్ధ్యతే తత్,

బింబే తథా నిపతితే ప్రతిబింబకే వా
దేహాద్వయావరణ వర్జిత చిత్స్వరూపే.
(సం. శా. ౨-౧౭౬)

## సాధన

తత్త్వమస్యాదివాక్యముల విచారణయే అంతరంగ సాధనము. యజ్ఞాదికర్మములు చిత్తశుద్ధి కారణములు. కర్మము జ్ఞానమునకు సహకారి కారణము.

యజ్ఞాది కృపిత సమస్త కల్మషాణాం
పుత్రాది త్రయగరసంగ వర్జితానామ్,
సంశుద్ధే పదయుగళార్థ తత్త్వమార్గే
ప్రాయేణోద్భవతిహి జన్మనీహ విద్యా.
(సం. శా. 3-3౮౩)

శ్రవణ మనన నిదిధ్యాసనములే సాధనములు. గురునినుండి శ్రుతివాక్యములను వినుటయే శ్రవణము. ఆ వాక్యమును మనసున విచారించుటయే మననము. తత్ప్రతిపాద్య వస్తుధ్యానమే నిదిధ్యాసనము. మహావాక్య విచారబలముననే ఆత్మసాక్షాత్కారము సిద్ధించుచున్న సన్న్యాసికి బహిరంగ సాధనమగు కర్మానుష్ఠానము త్యాజ్యము. అంతరంగ సాధనములగు శ్రవణాదులనే అతి అభ్యసింపవలెను.

అంతరంగ మపవర్గ కాంక్షిభిః
కార్యమేవ యతిభిః ప్రయత్నతః,
త్యాజ్యమేవ బహిరంగసాధనం
యత్నతః పతనభీరుభిర్భవేత్.
(సం. శా. 3-3౨౩)

## ఫలము

సగుణవిద్యాఫలముగ బ్రహ్మలోకము సిద్ధించును. ఈ విద్య క్రమముక్తికి సోపానము. అద్వైతాత్మజ్ఞానికి ఉత్క్రమణము లేదు. నిర్గుణబ్రహ్మవిద్యావిచారఫలము జీవన్ముక్తి. జ్ఞానోత్పత్తితో సంచిత క్రియమాణములు నశించును. ప్రారబ్ధశేషమునకుగాను శరీరము మిగిలియుండును. విదేహకైవల్యము నందిన జ్ఞాని బ్రహ్మస్వరూపముననే అవస్థితుడగును. అతనికి మనాగమనములు లేవు.

## అభిప్రాయ భేదములు

౧. శ్రవణమును గురించి: అద్వైతాచార్యులలో వివిధాభిప్రాయము లున్నవి. 'ప్రకటార్థకారుడు' శ్రవణాదులకు సంబంధించిన విధిని అపూర్వవిధి యనుచున్నాడు. 'వివరణకారుడు' నియమవిధి యనుచున్నాడు. వివరణమతానుసారులగు మరికొందరు శబ్దజాతమగు నిర్విచికిత్స పరోక్షజ్ఞానమే శ్రవణఫలమందురు. తరువాత మనననిదిధ్యాసఫలముగ అపరోక్షజ్ఞానము కలుగుచున్నది. మరి కొందరు వేదాంతశ్రవణమునగాక మనస్సువలననే బ్రహ్మసాక్షాత్కారము సిద్ధించుచున్న దనుచున్నారు. సర్వజ్ఞాత్మముని అద్వితీయ బ్రహ్మ తాత్పర్యకములగు వేదాంతవాక్యముల శ్రవణఫలము బ్రహ్మతాత్పర్యావధారణమును, న్యాయవిచార రూపమును నగు చిత్తవృత్తి విశేషమని చెప్పుచున్నాడు. శ్రవణాదుల గోచరించు విధిస్వరూపము పురుషాపరాధమును నిరాసమొనర్చి రుచిని గలిగించుట కేర్పడిన స్తుతిమాత్రమే.

౨. జగదుపాదానమును గురించి: 'వివరణకారుడు' సర్వజ్ఞత్వాదివిశిష్టుడును, మాయాశబలితుడును నగు ఈశ్వరుడే జగత్కారణ మనుచున్నాడు. 'పదార్థతత్త్వనిర్ణయకారుడు' బ్రహ్మము వివర్తరూపమునను, మాయపరిణామరూపమునను ఉపాదాన మనుచున్నాడు. మరికొందరు జీవుడు స్వప్నమున స్వరూపవిచ్యుతి నందకుండ స్వప్రపంచమున కుపాదానమగునట్లు, బ్రహ్మముకూడ ఆకాశాదుల సృష్టికని చెప్పుచున్నారు. సర్వజ్ఞాత్ముని శుద్ధబ్రహ్మమునే ఉపాదానముగ నంగీకరించినాడు.

3. ప్రతిబింబవాదమును గురించి: 'ప్రకటార్థవివరణకారుడు' మాయయందలి చిత్ప్రతిబింబమే ఈశ్వరుడనుచున్నాడు. పరిచ్ఛిన్నమొనర్చు మాయయే అవిద్య. ఈ అవిద్యాచిత్ప్రతిబింబమే జీవుడు. 'తత్త్వవివేకకారుడు' శుద్ధసత్త్వప్రధానమగు మాయయందలి ప్రతిబింబమే ఈశ్వరుడనియు, మలిన సత్త్వప్రధానమగు అవిద్యాప్రతిబింబమే జీవుడనియు వ్యాఖ్యయొనర్చుచున్నాడు. కొందరు మూలప్రకృతియే విక్షేప

ప్రాధాన్యమున మాయయగుచున్న దనియు, ఇదియే ఈశ్వరోపాధియనియు చెప్పుచున్నారు; ఆవరణ ప్రాధాన్యమున అవిద్యయై జీవోపాధి యగుచున్నది. సర్వజ్ఞాత్మముని అవిద్యాచిత్ప్రతిబింబమును ఈశ్వరు డనియు, అంతఃకరణచిత్ప్రతిబింబమును జీవుడనియు నిరూపించుచున్నాడు. 'వివరణకారుడు' ఈశ్వరుని బింబస్థానీయునిగను, జీవుని ప్రతిబింబస్థానీయుని గను గ్రహించుచున్నాడు.

### సమన్వయము

"అద్వైతాత్మనిరూపణమే ఈ ఆచార్యుల అభిప్రాయము. మాయానిర్మితమగు జగత్స్వరూపమును వ్యాఖ్యానించుటలోనే ఈ అభిప్రాయభేదము లేర్పడినవి. జగత్తును గురించి యెట్టి వ్యాఖ్యనొనర్చినను 'ఫరవా'లేదు. అద్వైతాత్మ నిరూపణమైన చాలును. కనుక, ఈ ఆచార్యులలో ఇట్టి భేదము లెందులకు పొడచూపినవని విస్మయము నందవక్కరలేదు. ఆత్మస్వరూప మవగతమైన చాలును" అని సిద్ధాంతలేశకారుడగు అప్పయ్యదీక్షితులవారు చెప్పుచున్నారు.

# అమెరికా - బ్రిటన్ ఆర్థిక ఒడంబడిక

= శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావు =

దాదాపు మూడుమాసముల సమాలోచనల అనంతరం అమెరికా, బ్రిటన్ ప్రభుత్వప్రతినిధులు ఆర్థికఒడంబడికవిషయమై ఒక సమాధానమునకు రాగలిగారు. ఒక స్థితిలో సమాలోచనలు భగ్నమయ్యే సూచనలుకూడా కనిపించినవి. అమెరికానుండి అప్పు తీసుకోవడమును బ్రిటిష్‌కన్సర్వేటివ్ ప్రముఖులు కొందరు విమర్శించిరి. అమెరీప్రభృతులు తమ అయిష్టతను బహిరంగముగనే ప్రకటించుచువచ్చిరి. ఇక అమెరికనువర్తకప్రముఖులు బ్రిటిష్‌కార్మికప్రభుత్వము తనదేశమున సోషలిస్టుఆర్థికవ్యవస్థను ఏర్పాటుచేయదలచినచో అందుకు అవసరమగు అప్పుకొరకు మాస్కోపోవలెనుగాని వాషింగ్టన్ వచ్చి ప్రయోజనముండదని సలహాఇచ్చిరి. కాని బ్రిటనుకు అమెరికానుండి డాలరుఋణము పొందుట ఎంత అవసరమో అమెరికాకు బ్రిటనుకు అప్పుపెట్టుటకూడా అంతే అవసరమైనది. ౧౯౩౧-౩౯ సంవత్సరముల మధ్యకాలమున బ్రిటన్ అనుసరించిన వ్యాపారరక్షణవిధానము, ద్రవ్యచలామణీవిధానము అమెరికావ్యాపారవిస్తరణకు తీవ్ర అవరోధములను కలిగించినవి. ఉత్పత్తిఅయిన సరుకు విక్రయమునకు వసరైన మార్కెట్లు లభ్యముకానందున వస్తువుల ధరలు పడిపోవుట, తత్ఫలితముగ పరిశ్రమలలో ప్రతిష్టంభన మేర్పడి నిరుద్యోగుల సంఖ్య పెరిగిపోవుట తటస్థించినది. ఈ దుస్థితిని నివారించుటకు ౧౯౩౩ లో అమెరికాఅధ్యక్షులు రూజ్‌వెల్ట్ ప్రయత్నించెను. కాని ఫలించలేదు. శత్రుసంహారకార్యమునందున్న ఐక్యత శాంతిస్థాపనాకార్యమున లేకుండెను. సైనికసంగ్రామము ముగిసి ఆర్థికసంగ్రామము ప్రారంభమయ్యెను. తుదకు ద్వితీయసంగ్రామమునకు దారితీసెను. కనుకనే ఈదఫా అమెరికా ముందునుంచి తగు జాగ్రత్తలోఉండి రాజకీయ, సైనికవ్యవహారములందు సామరస్య సహకారములు ఎంత అవసరమో ఆర్థికవ్యవహారములందును అట్టి సామగస్య, సహకారధోరణి అంత అవసరమేనని ప్రచారముచేయుటేగాక అందుకు ౧౯౪౧ నుండియే చర్యతీసుకొనసాగెను. ౧౯౪౫ డిసెంబరు ౬న బ్రిటన్, అమెరికాలకు జరిగిన ఒడంబడికకు బీజములు ౧౯౪౧ ఆగస్టులోనే నాటబడినవి. అమెరికాఅధ్యక్షులు రూజ్‌వెల్టూ, బ్రిటిష్‌ప్రధాని చర్చిలూ కలిసి ప్రకటించిన అట్లాంటిక్ ప్రణాళికయందలి ౪,౫ సూచనల ననుసరించియే ఈఒడంబడిక జరిగినది. స్వేచ్ఛావ్యాపారసిద్ధాంతమును బ్రిటన్ ఆరోజునే అంగీకరించింది. సామ్రాజ్యాభిమానమును సవరించుకొనటకు సంసిద్ధతను వెల్లడించింది.

ఒడంబడికవివరములు వెలువడినతరువాత బ్రిటన్, అమెరికాదేశములలో తీవ్రవిమర్శలు బయలుదేరినవి. అమెరికాస్నేహముకొరకు బ్రిటన్ ఎక్కువ త్యాగము చేసినదని ఆంగ్లవ్యాపారప్రముఖులు విమర్శించిరి. పాతబాకీలు వసూలుకాకనే, అరువుకవులు అప్పు తీరకనే అమెరికా బ్రిటనుకు నామమాత్రపు వడ్డీమీద 3,౭౫౦,౦౦౦,౦౦౦ డాలరులు అప్పు ఇచ్చినదని అమెరికనుప్రముఖుల ఆక్రందన. కాని ఉభయదేశముల ఆర్థికస్థితిగతులనూ గమనించినచో ఎవరి అవసరమునకు తగినట్టు వారు ప్రవర్తించిరేగాని ఇందు ఒకరి త్యాగము, మరొకరి స్వార్థమూ లేదని స్పష్టముకాగలదు.

అమెరికాప్రభుత్వపు మాజీకార్యదర్శి కార్డెల్ హల్ అన్నట్టు ప్రపంచపారిశ్రామికశక్తిలో సగము అమెరికాఅధీనము. అదేవిధముగ ప్రపంచవిక్రయశాలలో సగము బ్రిటన్ అధీనము. ఉభయులూ గృహకల్లోలమును నివారించుకొనవలె ననిన అధికముగా

ఎగుమతులు చేయవలసియున్నది. అమెరికాలో ౧౯౪౫ నాటికి ౭౦ లక్షలమంది ఉద్యోగములేనివారగుదురని వాణిజ్యశాఖాకార్యదర్శి హెన్రీ వాలెస్ అంచనా వేశాడు. పరిశ్రమల ఉత్పత్తి తగ్గినది. పనిచేయు కాలమూ తగ్గినది. కనుక యుద్ధకాలమున ఏదో ఒక వ్యాపారమున చిక్కుకొన్నవారు దాదాపు సగముమంది యుద్ధవిరమణముతో నిర్వ్యాపారులైనారు. వీరందరికిని తిరిగి ఉద్యోగములు దొరకవలెనన్న, ప్రస్తుతము పనిచేయుచున్నవారికి కనీసభృతి ముట్టవలెనన్న అమెరికను పరిశ్రమలు దాదాపు యుద్ధకాలమందువలెనే పనిచేయవలసియుండును. అంత ఉత్పత్తికి తగిన అమ్మకము జరుగుటకు అవకాశము లేదు. బ్రిటనే దాదాపు అమెరికా ఎగుమతులలో పదోవంతు వినియోగించుకొంటున్నది. ఇక బ్రిటిష్ అధీనదేశములమాట వేరుగ చెప్పనవసరము లేదు. అది యావత్తూ బ్రిటన్ దయాదాక్షిణ్యములపై ఆధారపడియున్నది. కనుక బ్రిటన్ కోరికలను మన్నించి తిరిగి బ్రిటన్ పారిశ్రామిక దేశముగ నిలబడుటకు అవకాశములు కల్పించకపోయినచో అమెరికా ఆర్థిక వ్యవస్థ పూర్తిగా దెబ్బతినిపోతుంది. అమెరికా ఎగుమతివ్యాపారము విస్తరింపవలెనన, బ్రిటన్ తన సామ్రాజ్యాభిమానమును, వ్యాపారరక్షణపద్ధతులను సడలింపవలెను. ఇది పొందుటకు అమెరికా ఎంతటి త్యాగమునైనను చేయగలదు. చేయకతప్పదు. అయితే ఏ దేశమునకూ తగినంత డాలరునిధి లేదు. బంగారమునంతా యుద్ధకాలములో అమెరికా భద్రం చేసుకున్నది. కనుక అమెరికా తన ఎగుమతివ్యాపారము సంతృప్తికరముగ సాగవలెనన్న క్రయమున కవసరమగు డాలరులనుకూడా అమెరికా ఇచ్చుకొనవలసిన స్థితి ఏర్పడినది. అమెరికను ప్రభుత్వ సహాయకార్యదర్శి విలియం క్లేటన్ జూన్ ౧౧-వ తేదీన అమెరికా ఎగుమతివ్యాపారవిస్తరణావకాశములను చర్చించుచు అమెరికా తయారుచేయు అదనపుసరకుల అమ్మకమునకు తగినన్ని విక్రయశాలలు ఉన్నవిగాని, క్రయదారులకు అవసరమైనంత డాలరుధనము లేదనీ, అట్టి నిధిని వారికి సమకూర్చిపెట్టుటమీదనే అమెరికా వ్యాపారభవిష్యత్తు ఆధారపడియున్నదనీ తెలిపిరి.

కనుకనే అమెరికా తన ఎగుమతివ్యాపారము సంతృప్తికరముగ సాగవలెనన్న ముందు తన ఖాతాదారులకు డాలరుఅప్పు మంజూరు చేయవలెనని అమెరికను వ్యాపారప్రముఖులు సూచించిరి. ఈ విధముగ ప్రతి దేశమూ ఆర్థికవ్యాపారవిషయమున అమెరికా అదుపులో ఉండవలసివచ్చును. ఇంతవరకు ఒక్క బ్రిటిష్‌వారి అదుపులోనే ఉంటున్న సామ్రాజ్యదేశాలు ఇప్పుడు బ్రిటన్-అమెరికా అదుపులో ఉండవలసివస్తుంది. కనుకనే ఆంగ్లో-అమెరికను ఆర్థిక ఒడంబడిక వివరములను పరిశీలించుచు ప్రసిద్ధ అమెరికన్ గనయిత యాయాఫివర్ "బ్రిటన్‌కు అప్పు పెట్టుటద్వారా అమెరికా బ్రిటిష్ సామ్రాజ్యమున వ్యాపారభాగస్వామ్యమును సంపాదించింది" అని వ్రాసెను.

అసలు అమెరికా వ్యాపారావసరములను తెలుసుకొనిన యెడల వాషింగ్టన్ ఒడంబడిక అంతరార్థము వెల్లడికాగలదు. వాణిజ్యశాఖాకార్యదర్శి ఈ విషయమై ఇలా వ్రాశాడు: "లాటిన్ అమెరికా మనకు దొడ్డివాకిలివంటిది కనుక మన మా దేశముతో వీలైనంత స్నేహభావముతో వ్యాపారవ్యవహారములు సాగింపవలెను. ఇంగ్లండు, పశ్చిమయూరపు మనకు పక్కవాకిలి కనుక వాటితో మనము వర్తకముచేయవలెను. ప్రపంచము రెండు ప్రతికూలవర్గములుగా విభాగము కాకుండుటకై రష్యాతో వ్యాపారసంబంధముల నేర్పరచుకొనకతప్పదు. ప్రపంచభవిష్యచ్ఛాంతి వ్యావసాయికదేశములగు ఇండియా, చైనా పారిశ్రామిక అభివృద్ధిపై ఆధారపడియుండును గనుక మన మా దేశములతో వ్యాపారముచేయవలెను."

కనుకనే బ్రిటన్ అరువుకవులుక్రింద ఇవ్వవలసిన బాకీలో ౩౭౦౦ లక్షల డాలరులను వసులుకొని తిరిగి ఇంత మొత్తమును అప్పు ఇవ్వ అమెరికా సిద్ధపడినది.

ఇన్ని మగతులకు లోబడి, ౧౯౩౧ లో ఏర్పడిన ఆర్థికమాంద్యమున రక్షగా ఉంచిన సామ్రాజ్యాభిమానము, వర్తకరక్షణశాసనములనువదులుకొని, బ్రిటన్ అమెరికాలోనే అప్పుచేయుటకు ఎందుకు సిద్ధమైనది?



# చర్మసౌందర్యము ఆరోగ్యవంతమైన దేహముతో ప్రారంభమగును!

# రెక్సోనాతో చర్మఆరోగ్యము కాపాడుకొనుడు

మీ దేహము మిక్కిలి అందంగా వుండవలెనంటే ముందు మీ చర్మము ఆరోగ్యవంతముగా వుండు ట ముఖ్యము. లేనియెడల చర్మ సౌందర్యము నిలువదు. చర్మముయొక్క ఆరోగ్యమును వృ[illegible] చేసుకొనుటకు కాపాడుకొనుటకు.—యీ అ[illegible] మైనటువంటివన్నీ అతి వచ్చగావుండువటువంట వన్నీ త్వరగా నురుగు వచ్చునటువంటివన్నీ. ఓషధి మిశ్రమమైనటువంటివన్నీ. చర్మ ఆరోగ్యమును చేకూర్చునటువంటివన్నీ క్యాడిల్‌తో కూడుకొన్న టువంటివన్నీ. సువాసనగల రెక్సోనాను ప్రవేశ పెట్టడమైనది.

రెక్సోనాయొక్క మృదువైన త్వరగా వచ్చే నురుగు. ఆరోగ్యమునిచ్చే ఈ క్యాడిల్‌ను చర్మరంధ్రములలోకి చొచ్చుకొని పోనిచ్చి. చెమటవల్ల ఏర్పడే మాలిన్యమును పోగొట్టి. శరీరమును శుభ్రపరచి. మృదువుగావుంచి. రంక్షించుటకు తోడ్పడును. దేహము యొక్క ఆరోగ్యము కొరకు ప్రతిసారి రెక్సోనాతోనే శుభ్రపరచుకొనుడు.

రెక్సోనా పిల్లలకు: రెక్సోనాయొక్క నురుగు అతిమృదువు గాను చల్లగానువుండుటవలన పిల్లలకు చాలమంచిది. డాక్ట [illegible] ప్రత్యేకముగా దీనిని వాడమని చెప్పుచున్నారు.



రెక్సోనాలోని క్యాడిల్ పిల్లల చర్మముపైపొక్కులను మరియితర మలినమును పోగొట్టి చర్మమును రక్షించుచున్న విషయము బాగా జ్ఞాపక ముంచుకోండి సుమా.

★ రెక్సోనాలోని క్యాడిల్ అనే పదార్థము ఒకప్రత్యేకపు విషక్రిమి నాశక ఓషధి మిశ్రమము. చర్మము యొక్క ఆరోగ్యమును చేకూర్చుటలో బాగా తోడ్పడును మృదువుగా వుండునట్టి రక్షణనిచ్చునట్టి. క్యాడిల్ యొక్క గుణములు శాస్త్రజ్ఞులచే మెప్పువడని అందరికి సిఫార్సు చేయబడినవి.




రెక్సోనా అయింటుమెంటును వాడండి. కోతలకు. పుళ్లకు. కురుపులకు. మొటిమలకు. పగుళ్లకు దురదకు. తామరకు దెబ్బలకు. మరి అన్ని విధములైన చర్మ సంబంధమైన మాలిన్యములకుదీనిని వాడండి.

ఉత్తమ శైవమత గ్రంధము **పండితారాధ్యచరిత్ర**

పాల్కురికి సోమనాథకవి రచించిన ఉత్తమ ద్విపద కావ్యము. డా॥ చిలుకూరి నారాయణరావుగారిచే సంస్కరింపబడినది. దీక్షా, పురాతన, వాద, మహిమ, పర్వతములను అయిదు ప్రకరణములును ఒకే సంపుటమున గలవు. ఇంతనిర్దుష్టముగ ఈ గ్రంధము నిదివరకెవ్వరును ప్రచురించియుండలేదు. నారాయణ రావుగారు రచించిన అమూల్యమైన పీఠికకూడ కలదు.

**ఆంధ్రగ్రంథమాల, పో. బా. 212, మద్రాస్.**

---

## దౌర్బల్యము - ధారణశక్తి

నిస్సత్తువను తొలగించు ఓషధీ రసాయనము మీకు అందజేయుచున్నాము.

## రెజువెనేటా

మీకు సంతృప్తి కలిగించును. ధారణశక్తి ఎక్కువగును. మొదటి కొన్ని మోతాదులకే దీని ప్రభావము మీకు అత్యద్భుతముగా కన్పించును. యౌవనము, దార్ఢ్యము చేకూరును. ఎటువంటి దార్బల్యము నైనను రూపుమాపును.

సీసా ఖరీదు రు. 2-8-0.

జాబులు ఇంగ్లీషులో వ్రాయుడు.

**Dr. R. Mohalanovis,**
Post Box No. 10013, CALCUTTA.

---

## మదనకామేశ్వర లేహ్యం

ఇది రక్తవృద్ధిని చేయు విలువ గల వస్తువులచే తయారు చేయబడినది. మేహములు, నిక్కాక, నిస్సత్తువ, శుక్లనష్టము, అతిమూత్రము మొదలగు వాటిని ఖండించి, మంచిబలమును వీర్యపటుత్వమును కలిగించుటలో అద్భుతమయినది. అనేక సర్టిఫికెట్లు గలవు. 2 డబ్బీలు చాలును.

20 తులముల డబ్బి రు. 2/-

పోస్టేజి ప్రత్యేకము.

**పి. సి. ఏ. అండ్ కంపెని,**
అయుర్వేదసమాజం,
పెరిదేపి, (నెల్లూరు జిల్లా).

---

## ప్రాణసుధ

క్షీణించిన వీర్యశక్తిని పెంపొందించును. నరములకు పటుత్వమును కండపుష్టి నిచ్చును.

మెదడుపని చేయువారికి ఆత్మమిత్రము.

**మలబార్ ఆయుర్వేదిక్ స్టోర్సు**
107 బ్రాడ్వే, మదరాసు



---

పక్షవాతమునకు అమోఘమయిన

## క్షీరబల ఆయవరము

101 సార్లు ఆవర్తితము

ఉపయోగించుడు. తృప్తి చెందుడు.

ఆయుర్వేదాచార్య ఎన్. మాధవమీనన్,
ఎ. ఎం. ఎ. సి. కన్సల్టింగు ఫిజీషియన్.

**మలబార్ ఆయుర్వేదిక్ స్టోర్సు**
107 బ్రాడ్వే, మదరాసు

ఈ ఒడంబడికను ఆమోదించవలసినదని కోరుతూ బ్రిటిష్ ప్రధాని మేజర్ క్లిమెంట్ అట్లీ అప్పుచేయుటకు గల కారణములను కామన్సు సభలో ఈవిధంగా ప్రకటించాడు: "అమెరికాలో వస్తువులు వగైరాలను క్రయము చేయుట సుకరముకాగలందులకును, యుద్ధము ముగిసి తిరిగి సాధారణ పరిస్థితులు ఏర్పడులోపున నిత్యలావాదేవీలలో ఏర్పడే లోటును భర్తీచేయుటకు వీలు కలుగగలందులకును, అవసరములకు తగ్గట్టుగా డాలరులు, బంగారము నిలువచేయుటకు, బహుముఖ వ్యాపార పద్ధతి బాధ్యతల నిర్వహింపగలందులకును ఈ అప్పు ఉపయోగపడుతుంది."

సర్ స్టాఫర్డ్ క్రిప్సులాంటి సోషలిస్టులు సైతము, బ్రిటను తిరిగి తలయెత్తుకొనవలెనన్న, అసలు బ్రిటిష్ ప్రజలు ఊపిరినిలుపుకొనవలెనన్న ఎగుమతి వ్యాపారమునే విపరీతముగా వృద్ధిచేసుకొనవలసియున్నదని ప్రకటించిరి. జర్మను విమానదాడుల ఫలితముగా పరిశ్రమ కేంద్రములు కొన్ని దెబ్బతినిపోయినవి. తిరిగి అన్ని పరిశ్రమలను యథాస్థాయికి తీసుకొనిరావలెనన్న కీలకయంత్రములను, ముడిపదార్థములను దిగుమతి చేసుకొనక తప్పదు. బ్రిటన్ పారిశ్రామికావసరములను అమెరికాయే తీర్చగలదు. పూర్వముకూడ అమెరికా తన ఎగుమతి వ్యాపారములో అయిదవవంతు తనంత పారిశ్రామిక దేశమైన బ్రిటన్‌తోనే జరుపుచుండెనని హెన్రీ మార్గెంథో ఈ మధ్యనే ప్రకటించియుండెను.

పశ్చిమమున జర్మనీ, తూర్పున జపాన్ బ్రిటన్, అమెరికాలతో పారిశ్రామిక వస్తువుల ఉత్పత్తి సప్లయిలందు పోటీచేయుచుండెను. నేడా రెండు దేశములును పూర్తిగ శిథిలమైపోయినవి. ఈ రెంటిని కేవలము ముడిసరుకు తయారుచేయు దేశములుగనే ఉంచవలెనని మిత్రరాజ్యములు నిర్ణయముచేసెను. కనుక ప్రపంచవ్యాపారమునంతను బ్రిటన్, అమెరికాలే ఇక గుత్తకు తీసుకొనినట్లు సాగింపవచ్చును. అందులకీ ఒడంబడిక ఉపక్రమణిక. ఈ విషయమును అమెరికా ప్రభుత్వ కార్యదర్శి జేమ్సు బిర్నె విస్పష్టముచేసెను. "౩,౭౫౦,౦౦౦,౦౦౦ డాలరులు ఒక పెద్ద మొత్తము కాదు. రెండు వారములు యుద్ధము చేయుటకు అమెరికా ఇంత ఖర్చు చేయుచుండెను. ఇది ధర్మంగా ఇచ్చిన మొత్తమున్నూ కాదు. వడ్డీమీద ఇచ్చిన అప్పు. ఈ డబ్బు యాభైసంవత్సరములలో తిరిగి రావడమేగాక, అమెరికాకు కొన్ని అదృశ్యలాభము లున్నూ కలిగినవి. అన్ని దేశములతోనూ అమెరికా వ్యాపారము చేయగలుగునట్లు వ్యాపారవిధానముల మార్పు జరుగుతుంది. ఈ విధముగా మనము మన ప్రజలకు పని కల్పించగలము. మనము బ్రిటనుకు అప్పు ఇవ్వని పక్షములో బ్రిటన్ ఇతర దేశములతో వస్తువుల మారకము పద్ధతిని వ్యాపారము సాగించును. ఆ దేశములున్నూ బ్రిటనుతోనే వ్యాపారము చేయవలసియుండును. ఈ పద్ధతిన ప్రపంచము ఆర్థిక వ్యాపారరీత్యా విభాగమగును. అప్పుడు ప్రపంచ శాంతికే భంగము కలుగును. ఆర్థికరీత్యా ఏక ప్రపంచమును ఏర్పాటుచేయుటకిది తొలిప్రయత్నము."

బ్రిటన్-అమెరికాల ఈ ఆర్థిక ఒడంబడిక కేవలము ఆ రెండు దేశములకే సంబంధించినది కాదనీ, ఇది కేవలము అమెరికానుండి బ్రిటన్ అప్పుతీసుకోవడమునకు మాత్రమే సంబంధించినదికాదనీ, ఉభయపక్షములూ కేవలము తమతమ అవసరములను అనుసరించే ఈ ఒడంబడిక చేసుకొనినారనీ స్పష్టమైనది.

ఇక ఒడంబడిక షరతులను, ఇందువల్ల భారత దేశమునకు సమకూరు లాభనష్టములను పరిశీలించెదము. ఈ ఒడంబడికలో మొత్తం పన్నెండు క్లాజులు ఉన్నవి. ఈ ఒడంబడిక ఏ తేదీనుంచి అమలులోనికి వచ్చేదీ తెలుపు క్లాజు మొదటిది. ఈ ఒడంబడికను అమెరికను కాంగ్రెసూ, బ్రిటిష్ పార్లమెంటూ అంగీకరించవలసియున్నది. బ్రిటిష్ పార్లమెంటు మాత్రము గత మాసము బ్రెటన్‌వుడ్సు ఒడంబడికతోబాటు దీనినీ ఆమోదించినది. ఇక పోతే అమెరికను కాంగ్రెసు ఆమోదించవలసియున్నది. అది ఈ మాసములో జరుగవచ్చునని ఆశించుచున్నారు. అది జరుగగానే అమెరికను ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వమునకు తెలియజేయును. ఆ రోజు ఈ ఒడంబడిక అమలులోనికి వచ్చినట్లగును. నాటినుండి ౧౯౫౧ డిసెంబరు ౩౧వ తేదీ లోపుగా

ఈ ఒడంబడికవల్ల మన దేశమునకు కలుగు లాభములను పరిశీలించుటకు ముందు బ్రిటన్, అమెరికాలకు చేకూరిన ప్రయోజనములను, ఇందువల్ల ఉభయ దేశముల ఎగుమతి, దిగుమతి వ్యాపారము మార్పు చెందేదీ గమనించుట అవసరము.

యుద్ధానికి పూర్వము బ్రిటన్ ఎగుమతి వ్యాపారముకంటె దిగుమతి వ్యాపారమే హెచ్చుగా ఉంటూ వచ్చినది. యుద్ధకాలమున బ్రిటిష్ వ్యాపారము—ముఖ్యముగా ఎగుమతి వ్యాపారము—చాలా తగ్గిపోయినది. ౧౯౩౮-వ సంవత్సరను వ్యాపారము దాదాపు మూడింట రెండువంతులు తగ్గినది. దీనితోబాటు ఇతర దేశములందలి బ్రిటిష్ పెట్టుబడులూ తగ్గిపోయినవి. నౌకాబలము వాణిజ్యకంగా తగ్గినది. ఇందువల్ల బ్రిటిష్ దిగుమతి వ్యాపారమునకు అవసరమగు ధనము కొరవడినది. దీనినంతను ఇప్పుడు పూర్తిగా సరకులను ఎగుమతి చేసియే సరిపెట్టవలసియున్నది. అందుచేతనే బ్రిటన్ తాను దిగుమతిచేసుకొను సరుకును మించి ఎగుమతి చేయవలసివచ్చినది. ఇందుకు అమెరికా అప్పు కలిగించగలదు. బ్రిటన్ నుక్కతిప్పుకొని, తిరిగి ప్రపంచమున అగ్రపారిశ్రామిక దేశముగా నిల్చుటకు సాధ్యమగును. అమెరికా ధనరూపమునగాక, వస్తురూపమునవే బ్రిటనుకు ౯౩,౭౫,౦౦,౦౦,౦౦౦ సౌనులు ఇచ్చును. అంటే బ్రిటన అమెరికానుండి తన పరిశ్రమల కవసరమగు ముడిపదార్థములను, ఆహారవస్తువులను, ఇతరావసరములను పొందును. ఇందువల్ల లోగడ బ్రిటన్ ఏయే దేశములనుండి ఈ పదార్థములను దిగుమతిచేసుకొనుచుండెనో ఆయా దేశములనుండి ఇప్పుడు అంత ఎక్కువగా వ్యాపారము సాగింపజాలదు. అమెరికా ముడిపదార్థములతో పారిశ్రామిక వస్తువులను తయారుచేసి స్టర్లింగ్ దేశముల కెగుమతి చేసి యుద్ధకాలమున చేసిన బాకీని తీర్చుకొనుటకు ప్రయత్నించును. ఒటావా ఒడంబడిక ఫలితముగా 'స్టర్లింగ్ ఏరియా' వలుపలనున్న దేశములతో భారతదేశము చేయుచుండిన ఎగుమతివ్యాపారమేవిధముగా తగ్గిపోయినదో అట్లే తిరిగి ఇప్పుడీ ఆర్థిక ఒడంబడికవల్లకూడా భారతదేశములాంటి 'స్టర్లింగ్ ఏరియా' దేశముల ఎగుమతివ్యాపారము మందగింపవచ్చును. అంతేగాక ౧౯౩౩వ సంవత్సరములో ప్రపంచ ఆర్థికమహాసభలో అమెరికాప్రతినిధులు వివిధవస్తువుల, పంటల ధరలను స్థిరపరచవలసిందని కావించిన సూచనను తిరస్కరించినట్లే తిరిగి ఇప్పుడును ఉత్పత్తిసరుకుల ధరల నిర్ణయమును చేయ బ్రిటన్ ఇత్యాదిదేశములు నిరాకరించినచో కేవలము వ్యావసాయిక దేశములుగా నున్న ఇండియా, చైనా, ఈజిప్టులు పండించు ముడిసరుకులకు న్యాయమైన ధర లేకుండాపోవును. పారిశ్రామికముగా బ్రిటన్ అమెరికాలే ప్రపంచావసరములను తీర్చగలిగియున్నందువను, వీరియువురును ఒక ఒప్పందము కుదుర్చుకొనినందున పారిశ్రామికవస్తువుల ధరలు వీరిష్టప్రకారము నిర్ణయింపవచ్చును. వీరికి ఇతరదేశముల పోటీ లేదు. వ్యావసాయిక దేశములు పూర్తిగా వీరి దయాదాక్షిణ్యములపై ఆధారపడవలసియుండును. ఈ విధముగా ప్రపంచము పారిశ్రామిక, వ్యావసాయిక కూటములుగా విభాగముకాకతప్పదు. భారతదేశమునకు కీలకయంత్రములను సప్లయి చేయు విషయమున బ్రిటిష్, అమెరికను ప్రభుత్వములూ, పారిశ్రామికులూ ప్రదర్శించిన వైఖరి ఈ విషయమును స్పష్టము చేయుచున్నది. వాణిజ్య, పారిశ్రామికవిషయకముగ ఈ ఆంగ్లో - అమెరికను వ్యాపార ఒడంబడిక (దీనిని ఆర్థికఒడంబడిక అనుటకంటె వ్యాపారఒడంబడిక అనుటయే సబబు) ప్రాంతదేశములకు—ముఖ్యముగ బ్రిటిష్ సామ్రాజ్యదేశములకు—ఎట్టి ప్రయోజనములనూ చేకూర్చకపోగా, ఇప్పటి పారిశ్రామికదుస్థితినుండి మరి కొంతకాలము—అధమపక్షము మరొక దశాబ్దము—వరకు కోలుకొనలేకుండా చేసివేసినది.

పోతే భారతదేశమునకు రావలసిన బ్రిటిష్ బాకీసంగతి ఏమవుతుంది? బ్రిటనుకు ఇప్పుడు ౧,౧౦౦,౦౦౦,౦౦౦ సౌనులు లభించినందున భారతదేశమునకు చెల్లుబడి కావలసిన కొంత మొత్తమైనా చెల్లు అవుతుందా? ఒక సంవత్సరమువరకూ వీటి ప్రస్తావనే రావడానికి వీలులేదు. అమెరికానుండి పొందిన మొత్తముతో ఈ బాకీలను పరిష్కరించుటకు

వీలులేదు. బ్రిటన్ స్టర్లింగ్ బాకీలు కేవలము బ్రిటనుకూ, ఆయా దేశములకూ సంబంధించిన విషయమే అని బ్రెటన్‌వుడ్స్ ద్రవ్యసభలో అమెరికా అంగీకరించింది. ఇప్పటికిని పాతబాకీవిషయమై అమెరికా వైఖరి అంతే కాని తన బాకీదారు ఎక్కువ అప్పులలో బడి ఇన్సాల్వెంటు కాకుండా చూచుకొనుటకు అమెరికా ప్రయత్నించింది. పాతబాకీలను దామాయిషాగా పరిష్కరించవలెననీ, బ్రిటనుకు అప్పుపెట్టినవారందరూ తమకుగా తాము తమ బాకీలో కొంత భాగమును వదులుకోవలెననీ అమెరికా హెచ్చరించింది. భారతీయు లెవ్వరూ ఈసూచనను హర్షించలేదు. అమెరికాఋణమునకు ప్రమాదము సంభవింపకుండగలందులకు భారతదేశము తన కష్టార్జితమును వదులుకొనజాలదని హెచ్చరించిరి. కాని ఫలితము శూన్యం.

బ్రిటన్ ఇతరదేశముల కివ్వవలసిన మొత్తము ౩,౩౫౫,౦౦౦,౦౦౦ పౌనులు. ఇందులో స్టర్లింగ్ ఏరియాకు చెందిన దేశములకు ఇవ్వవలసినది ౨,౮౨౩,౦౦౦,౦౦౦ పౌనులు. ఈ బాకీ పరిష్కారమునకు అమెరికా అప్పు ఏవిధంగానూ ఉపయోగపడదు. గుడ్డిలోమెల్ల అన్నట్టు అమెరికాయే అప్పు ఇవ్వకపోతే బ్రిటన్ తన కిష్టము లేకపోయినా, అశక్తివల్ల ఈ మొత్తమునంతనూ ఎగవేయవలసివచ్చేది. ఇప్పుడది జరుగక పోవచ్చు. రాయబారాలు జరుగుసందర్భములో అమెరికా తాను ఇవ్వగోర్న మొత్తములో కొంత భాగమును స్టర్లింగ్ బాకీలక్రింద ఆయా దేశముల కివ్వవలసిందని పట్టుబట్టెను. బ్రిటన్ అందుకు సమ్మతించక ఒడంబడిక అమలులోకి వచ్చిన ఒక సంవత్సరములోపున ఇప్పటి 'సామ్రాజ్య డాలరునిధి'నుండి ఆయా దేశములు తమ మొత్తములను అమెరికానుండి సరుకులను కొనుటకు వీలుచేయ అంగీకరించింది. ఇప్పుడు స్టర్లింగ్ బ్లాకువేరిగాను సంబంధించిన దేశములు అమెరికాకు ఎగుమతి చేయుటవల్ల పొందు డాలరులను వెనుకటివలెగాక ఇప్పుడే వినియోగించుకొనవచ్చును. ఇందువల్ల అమెరికానుండి భారత దేశమునకు ౨౦౦ లక్షల డాలరులుమాత్రం రాగలవు. ఈ మొత్తంవల్ల ప్రయోజనం కొద్ది.

ఇక స్టర్లింగ్ బాకీవిషయములో భారతదేశమును సంప్రతించకనే వాటి పరిష్కారమును గురించి బ్రిటన్, అమెరికాలు ఒక పద్ధతిని ఏర్పాటుచేసినవి. ఈ బాకీని మూడుతరగతులుగా విభజించిరి. ముందు కొంత మొత్తమును తీసి 'నిధి'గా ఏర్పాటుచేస్తారు. అంటే ఈ మొత్తము ఎప్పుడు, ఏ విధముగా బ్రిటన్ చెల్లువేస్తుందో తెలియదు. ఈ నిధిమొత్తము చాలా ఉంటుందని భారత ఆర్థికశాస్త్రజ్ఞులు భయపడుతున్నారు. ఈ మొత్తము 'పెదరాపూరుఖాతా'లో జమ అయినట్లే ఎంచుకోవచ్చునని లూయీఫిషర్ సైతము స్పష్టపరిచాడు.

ఆరుసంవత్సరములవరకూ మిగతా మొత్తమునుండి బ్రిటన్ ఏమీ చెల్లింపనవసరములేదు. అంటే అమెరికానుండి బ్రిటన్ తన పూర్తిమొత్తమును తీసుకొని మొదటి రెండువాయిదాలూ చెల్లువేయువరకూ స్టర్లింగ్ బాకీ చెల్లింపవీలులేదు. అన్నిమినహాయింపులూ పోగా మిగిలిన కొద్ది మొత్తమయినా వెంటనే బ్రిటన్ చెల్లించనవసరములేదు. వాయిదాలమీద కొన్నేళ్లలో చెల్లింపవచ్చును. పాతిక, ముప్ఫయి సంవత్సరములని కొందరు సూచించారు. కాలపరిమితి నిర్ణయముకాలేదు. ఇదంతా బ్రిటను వీలునుబట్టి నిర్ణయమవుతుంది. తక్షణ ఉపయోగమునకు కొద్ది స్టర్లింగు మొత్తమును మాత్రము బ్రిటన్ డాలరులగా మార్చి భారతదేశమున కిచ్చును. ఇది చాలా తక్కువ మొత్తముగా ఉండగలదు. అమెరికాతో భారతదేశము సరాసరి జరుపు వ్యాపారమువల్ల ౨౦౦ లక్షల డాలరులకు మించిరాదు. ఈమొత్తమునే బ్రిటన్ వెనుకటివలె డాలరుపూలులో చేర్చి భారతదేశమునకు లభ్యపడకుండా చేయక వదలి వేయనంగీకరించింది. ఈ మొత్తము, బ్రిటన్ వెంటనే ఇవ్వనుద్యమించిన మొత్తముకూడ భారతదేశము తక్షణావసరములలో కొన్నింటినైనను తీర్చుకొనుటకు చాలదు. వీటన్నింటినీ బట్టి ఆంగ్లో - అమెరికను ఒడంబడిక భారతదేశ ఆర్థికసమస్యల పరిష్కారమునకుగాని, స్టర్లింగ్ బాకీ పరిష్కారమునకుగాని ఏవిధంగానూ ఉపయోగపడదని స్పష్టమైంది.

ఆంగ్లో-అమెరికను అప్పుపత్రము యెడల భారతీయుల భావము లేవిధముగానుండునన్న ప్రశ్నకు ఒక ప్రముఖ భారత ఆర్థికశాస్త్రజ్ఞు డీవిధముగా నివేదించెను : "ఈ ఒడంబడిక భారతదేశమున తీవ్రవిమర్శకు గురికాగలదు. విముఖతే హెచ్చుగా ఉండును. భారతీయ స్టర్లింగ్ నిలవను డాలరులలోకి మార్చుకొనుటకు వీలగునట్లు ఈ ఒడంబడికయందు ఒక షరతును అమెరికా చేర్చునని భారతీయులు తలచిరి. కాని అమెరికా బ్రిటన్‌ఫుడ్స్ వైఖరి నింకనూ విడనాడలేదు. ఇది తీరని ఆశాభంగమును కలిగించును. అంతేగాక ఒడంబడికలోని ౭,౧౦ క్లాజుల ప్రకారము భారతదేశమునకు రావలసిన స్టర్లింగును డాలరులలోకి మార్చుకొను అవకాశము లభించువెంటనే దాదాపు ౪౦౦౦ మిలియను స్టర్లింగ్ బాకీలోని హెచ్చు మొత్తము ముడుపుసొమ్ముగా మారిపోవును. బ్రిటన్ తన వీలువెంట, తన ఇష్టప్రకారం ఇవ్వదలచిన ఏ కొద్ది మొత్తమో తప్ప మిగిలిన స్టర్లింగు అంతా స్టర్లింగ్ ఏరియాలో అయినా వినియోగించుకొను అవకాశము లేకుండాపోవును. తన వస్తువుల అమ్మకమునకు భారతదేశము చాలా అనుకూలమైన విక్రయశాలగా అమెరికా భావించుచున్నది. అట్టి పరిస్థితులలో స్టర్లింగును డాలరులలోకి మార్చుకొనుటకు వీలుగాని బ్రిటిష్ షరతును అంగీకరించుట అమెరికా సంకుచిత, దూరదృష్టిరహిత విధానమును వెల్లడించుచున్నది.

"స్టర్లింగ్ నిలవను బ్రిటన్ - భారతదేశములు చర్చించి పరిష్కరించుకొనవలెనని ఈ ఒడంబడిక సూచించుచున్నది. బ్రిటన్ తన బాకీని వస్తువుల రూపేణా చెల్లించుకోవలసిందే గాని, ధనరూపేణా ఇవ్వలేదు. కనుక భారతదేశము తప్పనిసరిగా తన బాకీకింద బ్రిటిష్‌వస్తువులనే కొనవలసియుండును. ఈ విధముగా అమెరికా భారతదేశముతో జరుప వీలగు వ్యాపారము చాలావరకు తగ్గును. కనుకనే అమెరికా స్టర్లింగ్ బాకీలను ఆయాదేశములను వదులుకొనవలసిందిగా కోరుచూ వచ్చెను.

"ఈ ఒడంబడిక ప్రకారము బ్రిటన్ భారతదేశముతో స్టర్లింగ్ బాకీవిషయమై చర్చలు ప్రారంభించునపుడు భారతీయులు మూడువిషయములలో పట్టుదల చూపవలసియున్నది. మొదటి అయిదుసంవత్సరములలో భారతదేశము వీలైనంత ఎక్కువగ కీలకయంత్రములను దిగుమతి చేసుకొనవలెను. అందువలన భారతదేశమునకు కావలసిన కీలకయంత్రసామగ్రి యెంత అనునది ముందు నిర్ణయము కావలెను. ఇందులో ఎంత డాలరు మొత్తమునుండి - అంటే అమెరికాలో క్రయముచేయుటే - విధిగా ఏర్పాటు కావాలి? మరెంతసామగ్రి బ్రిటన్ సప్లయిచేయగలదు? బ్రిటన్ సప్లయిచేయు సరుకు స్టర్లింగ్ బాకీకిందనా, లేక వర్తమాన లావాదేవీలకిందనా అనే విషయము, ఏపద్ధతినైతే భారతదేశమునకు ఎక్కువడాలరు లభించును అన్న విషయముపై ఆధారపడవలెను."

బ్రిటన్ స్టర్లింగ్ బాకీని తగ్గించివేయడం మించి అమెరికా ఏమీ ఆలోచించలేదు. స్టర్లింగ్ బాకీ తగ్గింపు అమెరికా వ్యాపారాభివృద్ధికి అవసరము. లేకున్న బ్రిటన్ తన బాకీని తీర్చుకొనుటకు, స్టర్లింగ్ ఏరియాదేశములు తమ బాకీని రాబట్టుకొనుటకు పెనుకటి పద్ధతినే వ్యాపారము సాగించుచుండును. దీన్ని అమెరికా నివారింప యత్నించినది. బ్రిటన్ అందుకు అంగీకరించినది. వాషింగ్‌టన్ సంప్రదింపులు జరుగుతూ ఉన్న సమయములో మాజీ ఇండియా కార్యదర్శి అమెరీ సామ్రాజ్యాభిమానము బ్రిటన్ స్వవిషయమనీ, ఆ విషయము ఇతరులతో తాము చర్చింపజాలమనీ, అది తమ ఇంటి బీగాలు అనీ, వానిని ఇతరుల కిచ్చివేయమనీ ప్రకటించాడు. అయితే ఈ ఒడంబడికవల్ల జరిగిందేమిటే అంటే అమెరికా ఈ బ్రిటిష్ సామ్రాజ్యం బీగాలను సంపాదించినది. స్టర్లింగ్ ఏరియాలో యథేచ్ఛగా సంచరింప స్వాతంత్ర్యమును సంపాదించినది. ఈ ఒడంబడిక ప్రాధాన్యం ఇదే.

తరచు స్టర్లింగ్‌ఏరియా ప్రస్తావన వచ్చినందున ఈ స్టర్లింగ్‌ఏరియా ఏమిటో వివరించెదను. ౧౯౩౧లో బ్రిటన్ గోల్డుస్టాండర్డును త్యజించినప్పుడు ఏర్పడిందీ స్టర్లింగ్‌ఏరియా. బ్రిటనుతో ఎక్కువ వ్యాపార సంబంధములు గల దేశము లన్నీ బ్రిటనుతో పాటు గోల్డుస్టాండర్డును త్యజించి బ్రిటిష్‌పౌనుకు

# సేవామందిరము

## = శ్రీ టి. గోపాలకృష్ణమాచార్యులు =

ఆంధ్రావనిలో జాతీయపునర్నిర్మాణకార్యనిర్వహణమునకు కృషిసల్పుచుండు సేవాసంస్థలలో నిది యొకటి. అనంతపురముజిల్లా హిందూపుర పట్టణసమీపమున సముద్రమట్టానికి ౨౨౦౦ అడుగుల ఎత్తున పవిత్రఉత్తరపినాకినీతీర ఉన్నత శిలాభూమిని విశాలప్రదేశమునందీ సేవామందిరము నెలకొల్పబడినది. స్థాపకులు శ్రీ కల్లూరు సుబ్బారావుగారు. సహాయకులు, నిర్వాహకులు శ్రీ ఏ. ఎం. లింగణ్ణగారు. వీరిద్దరు ఈ మందిరపుపుట్టుకకు, పురోభివృద్ధికి శ్రద్ధాభక్తుల పని చేయుచున్నారు.

లక్ష్యము, ఉద్దేశము:—భారతదేశానికి గ్రామమే పునాది. గ్రామప్రజల సౌభాగ్యమే భారతప్రజల సౌభాగ్యము. నేటి పల్లెటూరి ప్రజలు అజ్ఞానాంధకారమున్నారు. ఆర్థికముగ, నైతికముగ అధోగతిపాలైనారు. వారిని శ్రీమంతులుగ, ధైర్యవంతులుగ, నిజమైన పౌరులుగ నొనర్చుటయే దేశసేవకుల ప్రథమకర్తవ్యము. ఈయదియే మహాత్ముని సందేశము. కావున ఆ గ్రామ ప్రజలలో ఉన్న సామర్థ్యములతో నొనరించి జనహిత జీవితమునకు ఆధారములగు క్రమశిక్షణ, ఆరోగ్యభాగ్యము, విజ్ఞానవికాసములు, ఆర్థికస్థితి సంపాదించుటకు కృషిసల్పుటయు, ప్రజాసేవయే పరమేశ్వరసేవగా భావించి ప్రజల యోగక్షేమాల నిరంతరము సేవా, త్యాగములుచేయు సేవకులను తరిఫీదుచేయుటయు ఈ మందిర ముఖ్యలక్ష్యము.

ఈ లక్ష్యనిర్వహణానికి విద్యామందిరములు (Educational Institutions), ఉద్యోగమందిరములు (Industrial homes), విజ్ఞానమందిరములు (Cultural clubs), వ్యాయామమందిరములు (Physical culture & clubs), ఆరోగ్యమందిరములు (Medical Dispensaries) స్థాపించి, ప్రజల నావరించి యుండు అజ్ఞానమును, ఆర్థికదైన్యమును, అనారోగ్య స్థితిని తొలగించి ఆత్మవికాసమును, దేహదార్ఢ్యమును సంపాదించుటకు వలయు సేవకులను, సిబ్బందిని ఏర్పరచి పనిచేయుటయే ఉద్దేశ్యము.

ధర్మకర్తలు:—దేశసేవాగ్రతులు, నిర్మాణకార్యక్రమమునందు సంపూర్ణవిశ్వాసము కలవారు నయిన శ్రీ కల్లూరు సుబ్బారావుగారు, ఏ. ఎం. లింగణ్ణగారు, యం. యస్. అశ్వత్థయ్యగారు, కె. యస్. రఘునాథాచార్యులుగారు, ఏ. చిదంబరరెడ్డిగార్లు దీనికి ధర్మకర్తలు. లింగణ్ణగారు ఈ ధర్మకర్తలసంఘమునకు కార్యనిర్వాహకులుగానుండి, మందిరావరణముననే నివసించుచు కడుజాగరూకతతో, భక్తితత్పరతతో కార్యములు నిర్వహించుచున్నారు.

ధ్వజస్థాపన:—ఈ ప్రదేశమున ప్రథమమున మద్రాసు మాజీప్రధానియగు శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు ౫-౧-౧౯౩౭ తేదీన "భారతదేశ స్వాతంత్ర్యదినమునకై తమ జీవితము లర్పించిన త్యాగశీలుర స్మారకచిహ్నముగా" జాతీయ ధ్వజస్తంభము స్థాపింపబడినది. ప్రతిసోమవారము త్రివర్ణపతాకారోహణము జరుపబడును. మిగతసమయమున జాతీయపర్వదినములలో మాత్రము జండా ఎగురవేయబడును. ఆ నదీతీరమున ఎత్తైన ప్రదేశములో ఆకాశవీధుల త్రివర్ణపతాకము విహరించుచుండుట చూపరుల కెంతయు మనోహరముగ నుండును.

ప్రారంభమునుండి ఇప్పటివరకు:— ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు సహాయకార్యదర్శులగు నీలం సంజీవరెడ్డిగారు ౨౨-౮-౪౨ తేదీన దీనిని ప్రారంభించిరి. ప్రథమవత్సరమున ఖాదీ ఉత్పత్తి విక్రయము,

చేతికాగితముల పరిశ్రమ మాత్రమే నిర్వహింపబడెను. ఆ సంవత్సర వార్షికోత్సవమునకు యం. గోవిందరెడ్డి గారు అధ్యక్షులు. రెండవసంవత్సరమున శ్రీ రాజ గోపాలాచార్యులుగారు అధ్యక్షత వహించిరి. మూడవ సంవత్సరమున శ్రీ పట్టాభిసీతారామయ్యగారి పెద్దరికము. ఈ మూడు సంవత్సరములలో పెద్దలనేకుల ఆదరాభిమానములనుపొంది దినదినాభివృద్ధి నొందుచున్నది.

శాఖలు:—ఇందు నాలుగుశాఖలు పనిచేయుచున్నవి: (౧) విద్యాశాఖ—ఈ సంస్థ యాజమాన్యమునకు లోబడి ముదిరెడ్డిపల్లె, పెదరెడ్డిపల్లె, కొల్లపల్లె, ధనాపురంగ్రామములలో ఐదవతరగతివరకు ప్రాథమికపాఠశాల లున్నవి. కొడిగేపల్లెలో 3-వ తరగతివరకు నొక పాఠశాల గలదు. సేవామందిరమున ప్రాథమికోన్నతపాఠశాల నడుపబడుచున్నది. ఉపాధ్యాయులు ఉత్సాహముతో, దీక్షతో పనిచేయుచున్నారు. ఈపాఠశాలలలో సక్రమముగ పనులు జరుగుటకును, వలయునప్పుడు తగు సలహాలిచ్చుటకును, అనుభవజ్ఞుడగు నొకయుపాధ్యాయుని సూపర్‌వైజరుగా నియమించి యున్నారు. ఈ విద్యాలయములలో ౩౯౭ మంది విద్యనభ్యసించుచున్నారు.

విద్యాపద్ధతి:— సాధారణనిత్యపాఠములేగాక, ప్రాథమికోన్నతపాఠశాలలో చదువు విద్యార్థులకు విధిగా చేతితో కాగితములు తయారుచేయుట, వడుకుట, నేయుట, వ్రాంగము నేర్పించుచున్నారు. ఈ పాఠశాలలోని బాలురు మూడుభాగములుగ విభజింపబడి, పై పరిశ్రమలలో నేదేనొకటి సంపూర్ణముగ నేర్చుకొనితీరవలెను. మొదటి ఐదుతరగతులలోని బాలురకు ఏకులుచేయుట, తక్లిపైనను, రాటముపైనను నూలు వడకుట నేర్పబడును. ఇదిగాక విద్యార్థులు పదిపది మందిగా విభజింపబడి రాత్రింబగళ్లు ఒక ఉపాధ్యాయుని ఆజ్ఞకు లోబడి ఆతని సన్నిధియందే యుండి విద్యనభ్యసించు పద్ధతి గలదు. ఈ పద్ధతి సక్రమముగ జరుగుచున్నది.

వసతిగృహము:—సేవామందిరమునందే యుండి విద్యాభ్యాస మొనర్చువారికి తలయొక వసతిగృహము నిర్మింపబడినది. ఇందు జాతిమతవివక్షత లేక అన్ని మతములవారును కలిసిమెలిసి భోజనము సల్పుదురు. ప్రస్తుతము ఈ వసతిగృహమున ౮౦ మంది విద్యార్థులు గలరు. ఈ పాఠశాలకు చుట్టుముట్టుపల్లెలనుండి వచ్చు యాబదిమంది విద్యార్థులకును, మందిరములోని విద్యార్థులకును మధ్యాహ్నభోజనము సుమారు నూరుమందికి ఉచితముగ నివ్వబడును. హరిజన బాలబాలికలకు సోమేశ్వరకంపెనీవారు ఇచ్చిన విరాళమునుండి పుస్తకములు, దుస్తులు మున్నగు అవసరములు తీర్పబడుచున్నవి.

హిందీపాఠశాల:—రాష్ట్రభాషాప్రచారమునకు సేవామందిరము స్థాపించినప్పటినుండి మొదటి రెండేండ్లు హిందీ ఉపాధ్యాయుని నియమించి హిందూపురములో పాఠశాల యేర్పరచి ప్రాథమిక, రాష్ట్రభాషాపరీక్షలకు చాలమందిని తయారుచేసిపంపిరి. గడచిన సంవత్సరము హిందూపురములో ప్లేగువ్యాపించుటవల్ల అచ్చట నిలిపివేయబడెను. మందిరములోనే ఉపాధ్యాయుని నియమించి ౬, ౭ తరగతుల విద్యార్థులకు హిందీ బోధించుచున్నారు.

(౨) ఉద్యోగశాఖ: ఖాదీఉత్పత్తికేంద్రము:— మొదట సేవామందిర ధర్మకర్తలగు లింగణ్ణగారిచ్చిన వెయ్యిరూపాయల మూలధనముతో ఖాదీఉత్పత్తి విక్రయము ప్రారంభింపబడెను. దీనికితోడు శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు క్షామపీడితప్రజల సేవాకార్యమున నిమగ్నులై సంచరించుచు సేవామందిర కార్యక్రమము తిలకించి ఖాదీఉత్పత్తికి రెండు వేల రూపాయలు, వారికి ప్రత్యేకముగ సమర్పించిన విరాళములనుండి, మూలధనముగ నిచ్చిరి. మొదట హిందూపురములోను, తర్వాత పెనుకొండతాలూకా ముద్దపుకుంటగ్రామము కేంద్రముగా చేసుకొని పని జరుపబడెను. ఇప్పుడు కేంద్రము సేవామందిర చుట్టుముట్టుగ్రామములకు మార్చి స్వయంపోషకసిద్ధాంత రీత్యా వడుకుపని జరుగుచున్నది. నూలలనేకులు వడికిన నూలు తీసుకొని, నేతనేసి యిచ్చుచున్నారు.

తిమ్మాపురకేంద్రము:—సేవామందిర యాజమాన్యమున కళ్యాణదుర్గము తాలూకా తిమ్మాపురమునందు శ్రీ ఎ. వి. తక్కరుబాబాగారి ఆదరమువల్లను, కంబ

దూగు శ్రీ లక్ష్మీనారాయణ గారి కృషివల్లను ౧౯౪౮ మే నెలలో గ్రామపునర్నిర్మాణకేంద్రము స్థాపింపబడినది. ఈ కేంద్రమునకు బొంబాయి రాయలసీమ క్షామనివారణనిధివారు రెండువేల రూపాయలును, 'వందేమాతరం' ధర్మకర్తలు శ్రీ ర్యాములదాసు గారు వెయ్యి రూపాయలును విరాళ మొసగిరి. ఆ గ్రామములో స్వయంపోషక పద్ధతి చక్కగా అమలు జరుపబడుచున్నది. పల్లెలలో ప్రతియింట రాట్నగానము వినబడుచున్నది. హరిజనులకు ఒక విద్యాశాలయు జరుపబడుచున్నది. ఆ గ్రామీణులలో నూత్నవికాసము పొడసూపుచున్నది.



చేతి కాగితములు తయారుచేయుట

చేతి కాగితముల పరిశ్రమ:— ధర్మకర్తలలో నొకరగు శ్రీ కె. ఎస్. రాఘవాచార్యులవారిచ్చిన 3 వందలరూపాయల మూలధనముతో ఈపని ప్రారంభింపబడెను. దీనికితోడు బొంబాయి రాయలసీమ క్షామ నివారణ సంఘమువారు రెండు వేలరూపాయలిచ్చిరి. ఇందు కాగితము తయారుచేయుటే కాక విద్యార్థులకు కాగితముచేయు పద్ధతి బోధింపబడుచున్నది ఇతర గ్రామములనుండి కొందరు వచ్చి ఇందులో శిక్షణ బడయుచున్నారు. కాగితముపనిలో చుటుచుట్టు ప్రజలకు కూలిగిట్టుచున్నది.



వడ్రంగము

వడ్రంగము:— ఈశాఖ పరిగి గ్రామవాసవ్యులగు శ్రీ కె. వి. కోనప్పగారి రెండువేలరూపాయల విరాళముతో ప్రారంభింపబడి లాభదాయకముగ పని చేయుచున్నది. అనంతపురము జిల్లా బోర్డువారును, సహకారసంస్థలును ప్రోత్సహించుచున్నారు. చక్కని పనితనమునకు పేరుపొందినది. సుమారు ౩౦ మంది పనివారు గలరు. పనిముట్ల



సూర్య నమస్కారములు



తక్లీలతోనూ, రాట్నములతోనూ నూలు వడకుట





పల్లెటూరివారు పని అభ్యసించుచున్నారు. విద్యార్థులకుకూడ కరిక్యులం ప్రకారము వడ్రంగము నేర్పబడుచున్నది.

(3) ఆరోగ్యశాఖ:—సేవామందిరపాఠశాలల విద్యార్థులకును, చుట్టుపట్లపల్లెలవారి ఉపయోగమునకును ఉద్దేశించి ౧౫-౬-౪౭ వ తేదీన సేవామందిరములో ఒక ఆరోగ్యమందిరము స్థాపింపబడినది. ఆ ప్రాంతము చుట్టుపట్ల కలరా, ప్లేగు సంభవించినపుడు ఈ మందిరమువారు శ్రద్ధతో నివారణకు కృషిసల్పిరి.

(4) ప్రచారశాఖ:—ఈ ఆదర్శకేంద్రము నేర్పరచి ప్రతిగ్రామములోను ఇట్టి స్థితి కల్పించుటయే మందిరముఖ్యోద్దేశముగాన గ్రామములలో మందిర ప్రచారకులు వెళ్లి ప్రచారమొనర్చుచున్నారు. రాజకీయ, ఆర్థికపరిస్థితులను చెప్పి గ్రామసేవాదళములను ఏర్పరచి ప్రబోధముచేయుచున్నారు. ప్రజల ఆదరాభిమానములు మందిరము సంపాదించుచున్నది. సంతోషముతో ధనధాన్యరూపేణ విరాళము లిచ్చుచున్నారు.

ఇంతవరకు ఒకపర్యాయము గ్రామసేవకశిక్షణాశిబిరము శ్రీ హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతన నడుపబడెను. విజయనగర సామ్రాజ్యస్మారక మహోత్సవము గడచిన ఏడు వైభవముగా జరిగెను.

శ్రీ ఠక్కరు బాబాగారు, దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు, రాజగోపాలాచార్యులుగారు, ప్రకాశం, పట్టాభిగారలు ఈమందిరమును సందర్శించి కార్యకలాపమును తిలకించి, అనతికాలములో బడసిన అభివృద్ధిని హర్షించి ఆశీర్వదించిరి.

ఈమందిరము ఆప్రాంతమున కంఠశోభాయమానముగ నలరారుచున్నది.



ఒడ్రి నేత



మద్రాసులో గతమాసము జరిగిన అయిదవ ఆంధ్రరాష్ట్రపత్రికా రచయితల మహాసభ సమావేశము.

## మృత్యుగుహ (Death Cave)

పవిత్ర కైలాస మానససరోవర తీరవాసులగు శ్రీ ప్రణవానందస్వాములు ప్రసంగవశమున చెప్పిన విషయములలో నొకటియగు 'మృత్యుగుహ'కు సంబంధించిన యీవిషయమును యథాతథముగ నిచట పొందుపరచుచున్నాను:

"'ఖేంగా' నుండి 'గర్బ్యాంగ్'కు పోవు మార్గమునకాక 'దార్మా'కు పోవు మార్గమునందు నాలుగు మైళ్ల ఎగువన 'నో' అను పేరు గల గ్రామ మున్నది. అందు మూడు ఇండ్లుమాత్రమే కలవు. ఇండ్లకు వెనుక భాగమున ౬౦, లేక ౮౦ గజముల దూరములో 'ఖర్ ఉడ్యార్' (మృత్యుగుహ—Death Cave) అను పేరు గల గుహ యొకటి కలదు. ఇది యొక పర్వతము యొక్క క్రింది భాగమున నున్నది. గుహాముఖము దక్షిణముగ నున్నది. లోపల చీకటిగాకాక వస్తువులను చూచుటకు కావలసినంత వెలుతురుతో నిండియున్నది.

ఈ గుహాపొడవు ౨౪ అడుగులు. వెడల్పు ప్రారంభమునందు ౯ అడుగులును, లోపలికి పోనుపోను ౬ అడుగులును ఉన్నది. ఎత్తు ప్రారంభమున ౧౨ అడుగులును, క్రమముగ లోపల ౬ అడుగులును ఉన్నది.

ఈ గుహలోనికి ఏ ప్రాణియయిన ప్రవేశించిన వెంటనే మృత్యువువాత పడుచుండును. కనుకనే దీనికి 'ఖర్ ఉడ్యార్—మృత్యుగుహ' అను నామము కలిగినది.

నేను మొట్టమొదట మృత్యుగుహ చూచుటకు ౧౯౩౭ అక్టోబరు ౨౧ వ తేదీని వెళ్లితిని. బయటనుండి చూడగా లోపల నల్లరంగు గల 'కల్ చూణా' యని పిలువబడు ఎన్నియో పిట్టలు, కాకులు, ఎలుకలు, కప్పలు, పెద్దపెద్ద అడవి సాలీడులు, ఇంక నెన్నియో యితరములగు పక్షులు చచ్చిపడియున్నవి కనబడినవి. ఇంతియకాక చచ్చిపోయిన రెండు కొండచిలువల పురాణ అస్థిపంజరములుగూడ కనబడినవి. గుహలో తడితడిగాను, తేమగాను ఉన్నది. మృతకళేబరములు కొన్ని అప్పుడే చచ్చినట్లుగ క్రొత్తవిగ నున్నవి. గుహకు కొలదిదూరమున గంధకపు బుగ్గలుకూడ ఉన్నవి.

నే నా గ్రామములోనికి పోయి గ్రామస్థులను ఈ గుహను గురించి విపులముగ తెలిసికొనిన తరువాత వారీక్రింది విషయములను చెప్పిరి:

'చాలమంది తెల్లదొరలు, కమీషనరులు ఇచ్చటకు వచ్చి ఈ చిత్రమును చూచిరి. కాని లోపలికి పోయి ఏమున్నదో, ఎందు కిట్లు ప్రాణులు చనిపోవుచున్నవో తెలిసికొనుటకు సాహసింప జాలకపోయిరి.'

'ఒకమారు రెండు 'భోట్' గ్రామముల అధికారు లిద్దరు వచ్చి మేకలకు త్రాళ్లు కట్టి కర్రలతో వానినిత్రోసి లోపలికి ప్రవేశపెట్టిరి. అందులో నొకటి వెంటనే మరణించినది. రెండవది గిలగిల తన్నుకొనుచుండగా బయటికి లాగి నీళ్లు చల్లిరి. చావునకు సిద్ధమయిన యామేక కొంతవడికి మరల బ్రతికినది.'

'సంవత్సరమునకు నాలుగుమాసములు గుహనుండి విషము బయటికికూడ వ్యాపించుచుండును. మే మెరుగుదుము.'

ఈ విషయములు వినిన తరువాత లోనికి పోయి గుహను పరీక్షించి విష మేమిటియో తెలిసికొనవలయు

వని నాకు తీవ్రసంకల్పము కలిగినది. గ్రామస్థులు నన్నా సంకల్పమునుండి మరలించుటకు ప్రయత్నించిరి. కాని నేను విరమింప నిచ్ఛయింపలేదు.

వెంటనే ముగ్గురు మనుష్యులను గ్రామమునుండి తీసికొని గుహదగ్గరకు వెళ్లితిని. నా మొలకు పొడవయిన త్రాళ్లను కట్టి వారి చేతి కిచ్చి విషవాయువుచే తల తిరిగి పడిపోవునపుడు బయటికి లాగి నీళ్లు చల్లుడని చెప్పితిని. ఏకారణముచేనయిన ప్రాణభంగము వాటిల్లిన నా జేబులోని ధనమును వ్యయపరచి అంత్యక్రియను నెరవేర్చు విధానమునుగూడ ఉపదేశించితిని. ప్రాణాయామముచే శ్వాసను బంధించి లోపల ప్రవేశించితిని. లోపల మెల్లమెల్లగ శ్వాసను విడుచుచున్నను, మరల లోపలికి పీల్చుచున్నను నాకే బాధయు కలుగుటగాని, తల తిరుగుటగాని సంభవింపలేదు. ధైర్యముతో శ్వాసను ధారాళముగ విడచుచు పీల్చుకొనుచుంటిని. నాకేహానియు కలుగలేదు. ఆశ్చర్యము కలిగినది. గుహలో నాల్గువైపులకు తిరిగి స్వేచ్ఛగ లోపలనంతయు పరికించితిని. కూర్చుని కూడ శ్వాసను పీల్చితిని. విపరీతము లేవియు జరుగలేదు. బయటికి వచ్చి యామనుష్యులను కూడ లోనికి రమ్మంటిని. కాని వారు లోనికి వచ్చుటకు చాల భయపడి నిరాకరించిరి. నే నెంత చెప్పినను వారు నమ్మలేకపోయిరి. ఎదురుగ చనిపోయిన జంతుజాలమును చూచిన వారికి ధైర్యమెట్లు కలుగును? ఎన్నిసారులో వారు చూచుచుండగ చాల ప్రాణులు మరణించుట వా రెరుగుదురు. అందువలన వారు నా క్షేమపూదమును వాటిల్లకపోవుట చూచి నే నొక మంత్రగాడ ననియు, మంత్రబలముచే నట్లు పోగలిగి నాననియు, కావుననే నాకే యాపదయు సంభవింపలేదనియు తలపోసిరి. తుదకు వారుమాత్రము లోనికిరాలేదు. నాకును చాలచిత్రముగ గన్పట్టినది. ఏది యేమయిన నేమి, ఆసంవత్సరమున కచటినుండి నాయాత్రార్థము మరలిపోయితిని. నాకును నీవైపరీత్యమునకు కారణము గోచరముకాలేదు. నామంత్రశక్తి మాత్రము దీనికి కారణము కాదని నే నెరుగుదును.

కైలాసయాత్రాసందర్భమున రెండవసారి మరల ౧౯౩౯ అక్టోబరు ౧౬, ౧౭, ౧౮ తేదులలో నచ్చటికి వెళ్లితిని. గ్రామస్థు లిద్దరికి వెనకటివలెనే కొంత ధనము నిచ్చి గుహ దగ్గరకు తీసికొనిపోయి మొలకు త్రాడు కట్టుకొని లోనికి ప్రవేశించితిని. కాని ఈ పర్యాయముమాత్రము మండుచున్న 'చీడు' కట్టెలను కూడ తీసికొని పోతిని. నిలబడియున్నంతసేపు నాకేమియు బాధగలేదు. మెల్లగ మెల్లగ వంగుచు మండుచున్న కట్టెలను నేలమీదకు దింపుట ప్రారంభించితిని. నేల కొక గజమెత్తునకు దింపుసరికి ఆ కట్టెలు ఆరిపోయినవి. మెల్లగ నాయెత్తువరకు నేనును వంగి గాలిని లోపలికి పీల్చుసరికి — గాలి ముక్కులో ప్రవేశించిన వెనువెంటనే — ఊపిరి తిరిగినది కాదు. వెంటనే తల పైకెత్తి గుహనుండి బయటికి వచ్చితిని. ఆగాలికి 'అమోనియా' వాసనగాని, గంధకపువాసనగాని లేకపోవుటవలన, కట్టెలమంట వెంటనే ఆరిపోవుటవలన, విషవాయువు క్రిందిభాగమునందే యుండుటవలనను ఆవాయువు తప్పక 'కార్బన్ డై ఆక్సైడ్' అయియుండునని యూహించితిని. కాని ఆసమయమున ఏవిధమయిన రాసాయనిక పరిశోధన చేయుటకు నాదగ్గర సాధనము లేవియులేవు. అందుచే నప్పటికి ఏమి చేయుటకును సాధ్యముకాక యాత్రకు ముందుకు సాగి పోతిని.

౧౯౪౦ నవంబరు ౧౨ తేదీని యాత్రాసందర్భమున మరల ఆగుహదగ్గరకు పోతిని. ఈమారు 'బేరియం పెరాక్సైడ్' బిళ్లను కూడ తెచ్చితిని. దానితో పరీక్షింపగా నా అనుమానము నిజమయినది. సరిగా ఆగుహలోని వాయువు 'కార్బన్ డై ఆక్సైడ్'. ఈసారి గుహలో విషవాయువు నాలుగడుగుల యెత్తువరకు వ్యాపించినది. ఈవాయువు బరువయిన దగుటవలన భూమిపైకి మిక్కిలి యెత్తునకు వ్యాపింపజాలదు. కనుక క్రిందినుండి పోవుచుండు జంతుజాలము ఆవాయువును పీల్చి ఊపిరి తిరుగక వెంటనే మరణించును.

వర్షాకాలము నాలుగు మాసములు నీరు విశేషముగ నుండుటచే నీవాయువు విస్తారముగ పుట్టుచుండును. నీరు క్రమముగ తగ్గిపోయినచో ఈ విషవాయువుకూడ తగ్గిపోవుచుండును. వర్షాకాలమున విశేషముగ ఉత్పత్తియగుచుండుటవలననే ఆ నాలుగుమాసములు

గుహనుండి బయటికికూడ ఆవిషవాయువు వ్యాపించు చుండుట కవకాశము గలుగుచున్నది.

౧౯-౩౭ సం. మొట్టమొదట నే నిచ్చటికి వచ్చినపుడు వర్షాకాలము గతించి చాలదినములగుటచేతను, ఆసంవత్సరము వర్షములుకూడ తక్కువగ కురిసియుండుటచేతను అప్పుడాగుహలో విషవాయువు ఉత్పత్తియగుట ఆగిపోయినది. కనుకనే నా కేమియు హాని కలుగలేదని నే నూహించుచున్నాను.

మొట్టమొదట ఆవిషవాయువు శరీరమునకు సోకిన ప్రమాదము వాటిల్లునేమో యని సందియము గల్గియుంచో ఈ పరిశోధనలు చేయుటకు నాకు సాహసము కలుగకపోయెడిదేమో? కాని నా కాసమయమున తెలిసికొనవలయు నను సుత్సాహముతప్ప మరి యే ఇతరములగు నాలోచనలును కలుగనేలేదు.

దీనికి సంబంధించిన విశేషపరిశోధనలను చేయుట కుద్యమించుట వైజ్ఞానికుల ముఖ్యకర్తవ్యమని తలచుచున్నాను.

కైలాసమానస సరోవరయాత్రనుండి మరలి వచ్చు యాత్రికు లందఱును ఈ 'మృత్యుగుహ' ను చూడగలుగుదురు."

కనకదండి గోపాలకృష్ణశాస్త్రి.

---

## దేశభక్తి : ధర్మసూత్రములు

౧. ఎవనికిమట్టుకు వాఁడు ఆత్మపరీక్ష చేసికొనఁ గల్గినయెడల, తా నొక దేశభక్తుఁ డయినది, కానిది సుళువుగానే తెలిసికోవచ్చును; కాని, పైనుండియే చూచువానికి ఆసంగతి నిర్ధారణచేయుట అంతగా సుకరమైన పని కాదు.

౨. ఏ యధికారినిగుఱించిగాని దూషణభూషణ తిరస్కారములలో ఏదో యొకటి చేయునేని, అది దేశభక్తి యనిపించుకొనుటకు తగిన సాక్ష్యము కాదు.

౩. పొంగిపొరలు ధనతృష్ణ గలవాఁడు జన్మములో ఎన్నటికిని దేశభక్తుఁడు గాకయుండుటకే బాగుగ పనికివచ్చును. అధికారతృష్ణ కలవాఁడుకూడ అట్టివాఁడే.

౪. దేశభక్తులుగా ఉండవలెనన్న, పరదేశికంటె స్వదేశస్థునకు, బ్రహ్మచారికంటె వివాహితునకు, నాస్తికునికంటె ఆస్తికునకు మంచి యవకాశము ఉన్నది.

౫. లాంపట్యము గలవాఁడు దేశభక్తుఁడు కానేర్చుట అసాధ్యమైన సంగతి.

౬. తన మిత్రులకే, ఇరుగుపొరుగులవారికే ద్రోహములు చేయనేర్చినవాఁడు ఆడితప్పక ప్రజాసేవ చేయుననుట కలలోని మాట.

౭. ప్రతిజ్ఞాహీనుఁడు ఎప్పటికైన పూర్తిగా ఖలుఁడే. పూర్తిగా ఖలుఁడైనవాఁడు, కోటిలోఁబెట్టువలెను, వంచకుఁడుగానే యుండితీఱును.

౮. భగవంతుఁ డున్నాఁ డన్న స్మృతిగాని, అంతఃకరణము బోధించుచున్నమాటగాని బొత్తిగా ఎఱుఁగని యే నిర్భాగ్యదామోదరయ్యనో మీ బిడ్డకు సంరక్షకుఁడుగా నుంచ ఏర్పాటుచేయఁజాలుదురా? చూచెదరే! మఱి, మీ రాష్ట్రమును సంపాదించి, సంరక్షించుకొనుటకై అట్టివానిని ఏల ఎన్నుకొందురు?

౯. స్తుతిప్రియత్వము, ప్రజాగౌరవాభిలాష యున్నయెడల, కొంత పనికిరావచ్చును; కాని, నిజముగా దేశభక్తుఁడే కావలయునన్న—తన కర్తవ్యమేదో సదా జ్ఞప్తినుంచుకొనువాఁడై అంతరాత్మశుద్ధి కలవాఁడై యుండితీఱవలెను.

౧౦. మర్యాద, మాటనిలుకడ ఉండవలయునన్నయెడల, బాల్యమునందే మనసులో మంచిధర్మములు నాటియుంచవలెను. వీని పోషణముననే యవి నిలువనేర్చునది.

౧౧. నికరముగా దేశభక్తులుగా నుండి పనులు చేయవలె నన్న, స్వదేశస్థుల నందఱిని పరమేశ్వర సంతానముగానే భావించి, వారికి తాము ఉత్తరవాదుల మను మాట మఱవక యుండవలెను.

౧౨. మాటిమాటికి హేవడిచేయుచు, గగ్గోలు గావించుచు, వృథా వేళపరులై యుండువా రెవ్వరైనసరే, దొరతనమువారినో మఱెవ్వరినో అసహ్యముగా తెగఁబడి తిట్టిపోయుచుండువా రెవ్వరైనసరే—దొడ్డ దేశభక్తు లని భ్రమపడరాదు.

౧౩. మంచిపడువాఁడు, అపహసించువాఁడు, ప్రేలఁజూచువాఁడు—ఇట్టివారుగా ఎవ్వరెవ్వరు కానవచ్చినను సరే, వారి దేశభక్తినిగుఱించి శంకింపవలసినదే.

౧౪. ఏ కూటమిలోనో చేరి, మొత్తముమీఁద ప్రజాసముదాయమునకు లాభదాయకము లయి వెలయఁదగిన క్రొత్తప్రతిపాదనల కెల్ల అడ్డు తగులుచుండు పక్షమువారు తామే దేశభక్తుల మనెడి భ్రమలోఁ బడిపోవుచుందురు!

(Berkely అను ప్రసిద్ధాచార్యుఁడు రచించిన వాని కనువాదము.)

అత్తిలి సూర్యనారాయణ.





# విమర్శనము



## శ్రీ వేంకటేశ్వర వచనములు : శ్రీ వేంకటేశ్వర ప్రభాత స్తవమును

తాళ్లపాక పెదతిరుమలాచార్యవిరచితము. తిరుపతి వేంకటేశ్వరప్రాచ్యపరిశోధనశాలవారి ప్రచురణము. వెల ౧-౮-౦.

'వచనములు' ఒక వింతయైన రచనావిశేషము. కన్నడభాషలో వీరశైవమతమువారు దాని నెక్కువ ప్రాచుర్యమునకుఁ దెచ్చిరి. ఆ భాషలో ఇవి యసంఖ్యములు. శైవముజతలో వైష్ణవముకూడ సమానస్పర్ధతో పెరిగినది గనుక వైష్ణవాచార్యులును తెలుఁగులో ఆ రచనను అనుసంధానప్రచారముల కుపయోగించిరి. కాని మొన్న మొన్నటివరకు వీని యునికే ప్రాయికముగా తెలియక యేమూలనో పడియుండెను. ఆంధ్రవైష్ణవాచార్యులలో తాళ్లపాకవంశము వారిది అగ్రస్థానము. వారి రచనలన్నియు రాగిరేకులనుండి యెత్తిప్రచురించుచుండుట తిరుపతి దేవస్థానమువారు చేయుచున్న మహోత్తరకార్యము. తాళ్లపాకవారి మూలపురుషుఁడగు అన్నమయ్యంగారి శృంగారపదములు, అధ్యాత్మపదములు మొదలు కొన్నిటి నీవరకే వారు ప్రకటించినారు. ఆ పరంపరకే చేరిన మఱొక ప్రచురణ మిది. కాని ఇదివరలో దేవాలయమువారు ప్రకటించిన తాళ్లపాకవారి రచనలు చాల తప్పుల తడకలు. 'పరిశోధించిన'వారి శ్రద్ధాలోపమునకు, శక్తిలోపమునకును వానిలో మితిలేని యుదాహరణములు లభించుచున్నవి. తుదకు పరిశోధకులు రాగిరేకులలోని యక్షరములనుగూడ సరిగా చదువలేరై రేమో యనికూడ సందేహింపవలసియున్నది. కాని ప్రకృతపుస్తకము ఆ సంప్రదాయమును త్రోసివెడలినది. సుగృహీతనామధేయులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దీనిని సంశోధించినారు. కాఁబట్టి ప్రత్యేకముగా ప్రశంసింపఁబనిలేదు. వారి విపులమైన పీఠికలో వచనాల లక్షణము, తాళ్లపాకవారి పరంపర మొదలగు విషయములు చర్చింపఁబడియున్నవి. అందందు ముద్రణదోషములు కొన్ని కలవు. మచ్చుకు:

'పవనజవననిరాఘాటయవనఘోట! వారణజయధాటి' (పీఠిక. పు. VII)

ఇది భిన్నపద మను భ్రాంతిని ఘోటశబ్దము తరువాతి ఆశ్చర్యచిహ్నము సూచించుచున్నది. కాని ఇది యేకపదము. ఇట్లే తరువాతి పీసములో 'సామిడిగ్గియ' 'సాముడిగ్గియ'గా పడినది.

తుదలో చేర్చిన శ్రీ వేంకటేశప్రభాతస్తవము చక్కని ద్విపదఛందస్సులో రచింపఁబడిన సుకుమారస్తోత్రము. ప్రాతస్స్మరణమునకు పనికివచ్చును.

'అకృశ'

---

## ముకుందమాల

అనువాదకుడు: గురుజాడ రాఘవశర్మగారు, ప్రకాశకులు: యం. శేషాచలం అండ్ కో, మచిలీపట్టణము. వెల ౦-౧౨-౦.

ఇది కులశేఖరవిరచితమైన సంస్కృతస్తోత్రమునకు తెలుగు. మూలశ్లోకము, పద్యానువాదము, గద్యానువాదము — ఈ క్రమము ననుసరించి కూర్పఁబడినది. పద్యానువాదము రమ్యముగ నున్నది. భక్తుల పారాయణ కుపయోగకరము.

---

## శ్రీ వాసుదేవనామ శతకము

కర్తయును, ప్రకాశకులునుగూడ పై వారే. వెల ౦-౮-౦.

కృష్ణాష్టోత్తర శతనామములలో ఒక్కొక్క నామమును సంపుటమొనర్చి, ఒక్కొక్క పద్యము కూర్చబడినది. గ్రంథాంతమున నామస్తోత్రము, నామావళియుగూడ చేర్చబడినవి. పద్యములు చక్కటి ధారలో నడచినవి. శ్రీ కృష్ణభక్తులీ గ్రంథమును సంతోషముతో పఠింతురనుటకు సందేహము లేదు. 'భక్తచింతామణి' మున్నగు గ్రంథముల వరుసలో దీనిని చేర్పవచ్చును.

## పరమావిష్కారము

కర్త్రి: శ్రీమాత. అనువాదకుడు: వేలూరి చంద్రశేఖరంగారు. ప్రకాశకులు: చతుర్వేదుల వేంకట కృష్ణయ్యగారు, శ్రీ అరవిందాశ్రమం, పుదుచ్చేరి. వెల ౦-౪-౦.

శ్రీ అరవిందుడు లోకమునకు తెల్పుచున్న 'పరమావిష్కారము'ను గురించి (తదాశ్రమనిర్వాహభారమును దాల్చిన) శ్రీమాతృదేవి యొనర్చిన ప్రవచనమునకు అనువాదము. అరవిందునిగూర్చియు, తద్యోగమునుగూర్చియు నేడు క్రొత్తగా ఇచ్చట తెలుపవలసిన దేమియును లేదు. రసవంతమైన అనువాదము. ఈ గ్రంథము తత్త్వజిజ్ఞాసువులకు మార్గదాయకము కాగలదు. మూలమునకు వన్నెపెట్టు తెలుగుసేతను ప్రచురించిన ప్రకాశకులకు ధన్యవాదములు.

## అహింస

కర్త: యం. యస్. రాజలింగంగారు, బి. ఎస్. సి. ప్రకాశకులు: సారస్వత సేవాసమితి, ఘనపురం, నైజాము. వెల ౧-౮-౦.

ఇది అహింసనుగురించి ప్రస్తావించుచున్న చిన్న వ్యాసము. రచయిత 'విజ్ఞప్తి'లో తమ అహింసాప్రవచనము గాంధీగారి నిర్వచనముమీద ఆధారపడలేదని ఎందుల కనినారో, గ్రంథమంతయు చదివినను బోధపడుట లేదు. అహింసను గురించి గ్రహింపవలసిన విషయములు కొన్ని ఇందు సంగ్రహముగ పేర్కొనబడియున్నవి. సంభాషణాప్రాయమగు శైలి.

సారస్వతసేవాసమితివారు ఉత్సాహమునకు తగిన ప్రయత్నప్రాబల్యమునుగూడ చేకూర్చుకొని, ఇతోధికమగు సారస్వతసేవ చేసి, ఆంధ్రి నలరింతురుగాక!

శ్రీ నిర్వికల్పానందస్వామి

## భారతకమ్యూనిస్టులు - వారి వింతవైఖరి

పేరు సార్థకముచేసికొనుచున్న చిన్న గ్రంథము. కమ్యూనిస్టుకక్ష్యలోని మంచిచెడ్డలను గ్రహింపగోరువారికి అవశ్యపఠనీయము. విశదమైన విషయవివేచన. కర్నూలు భారతసేవాసంఘమువారి ప్రచురణ. వెల పావలా.

## రత్నగర్భ

బెజవాడలోని 'కృషి' పత్రిక ప్రత్యేకసంచిక. వెల రూ. ౨-౮-౦.

రత్నగర్భయైన ఆంధ్రభూమిలోని బంగారమును, ఆంధ్రపరిశ్రమలను, ఆంధ్రపారిశ్రామికులను గురించిన పరిశ్రమవ్యాసములు గల బృహత్సంపుటి. ఆంగ, ఆంధ్రఉభయభాషాత్మకము.

# గ్రంథస్వీకారము

## అమృతానందము

కృతికర్త: కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు. బెజవాడలోని కవితిలక గ్రంథమాలవారి ప్రచురణము. పది ఆశ్వాసముల పద్యకావ్యము.

## చిన్నాజీ

కథలసంపుటి. కథకుడు: చాగంటి సోమయాజులుగారు. ప్రకాశకులు: విజ్ఞానసాహిత్యసదనం, బెజవాడ. వెల ౧౨ అణాలు.

## స్త్రీ స్వాతంత్ర్యము

పద్యత్రిశతి. కర్త: చెళ్లపిళ్ల వెంకటేశ్వరకవి గారు. ప్రకాశకులు: లోకమాన్య గ్రంథమాల, కానూరగ్రహారము, వయా నిడదవోలు.

## భారతదాస్యం

రచయిత: యల్లాప్రగడ కృష్ణమూర్తిగారు. ప్రచురణకర్తలు: ఆంధ్రజాతీయ యువజనసంఘము, ఖమ్మంమెట్టు, నైజాము. వెల ౪ అణాలు.



Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.







చక్కని రుచి, ఘుమ ఘుమలాడే
సువాసన, నేత్ర పర్వంగావుండే
రంగు, తక్కువధర, వీటి అన్నింటి
నిబట్టి లిప్టన్స్ టీ గర్ల్
మిగతా వాటిని తలదన్ని అత్యా
ధిక గౌరవాన్ని తెచ్చుకున్నది.

# లిప్టన్స్ టీ గర్ల్

మృదు మధురమైన ఇండియన్ డస్ట్ టీ



భారత చలనచిత్ర ప్రపంచంలో మధురతర స్వరంగల కుందన్‌లాల్ సైగాల్ 1908లో శ్రీనగర్‌లో జన్మించాడు. ఆయన కొంత కాలం ఇండియా గవర్నమెంటులోను, నార్త్ వెస్టర్న్ రైల్వేలోనూ పనిచేశాడు. ఆయన న్యూ థియేటర్స్, లిమిటెడ్‌లో 1931లో చేరాడు. అది మొదలుకొని తన చక్కని పాటలతో ఆయన తన దేశస్థులనందరి ఆనందోన్మాదులుగా చేస్తున్నాడు. బహుశా ప్రముఖ మొగల్ చక్రవర్తి అక్బర్ ఆస్థానంలో సంగీత విద్వాంసుడు "తాన్ సేన్" లో ఆయిన వినిపించిన సంగీతం మరి యే ఫిల్ములోనూ ఆయిన వినిపించి వుండలేదు.

# సైగాల్ పాడినప్పుడు...

ప్రపంచంలోని ప్రఖ్యాత కళాకోవిదులు [illegible] ప్రాగపమంటే అతిసంతోషపడుతారు. కళావైపుణ్యాన్ని చూపడానికి తగిన భావోద్రేకం కలిగించడంలో దానికి మించినదిలేదు. అమరగాన కుంజరం సైగాల్ ఏమని వ్రాస్తున్నాడో చదవండి: "టీ అంటె నాకు అంత అభిమాన మెందుకో చెప్తాను వినండి. నేను పాడడానికి, నటించడానిక, బ్రహ్మానందం పొందగల సమస్తానికి నాకు అది ఉత్సాహం కలిగిస్తుంది. నన్ను పాడమని అడగడానికి ముందు ఒక కప్పు టీ యివ్వండి."



# ఉత్సాహానికి... టీ

ఇండియన్ టీ మార్కెట్ ఎక్స్‌పాన్షన్ బోర్డువారి ప్రకటన.

Regd No. 1856.

జనవరి **10** వతేదినుండి

బెజవాడ.........సరస్వతి
రాజమండ్రి......మినర్వా
కాకినాడ.......మెజస్టిక్
విజయనగరం.......కృష్ణా
గుంటూరు.......సరస్వతి
నెల్లూరు.........వినాయక
మచిలీపట్నం......మినర్వా
సికింద్రాబాద్.......చిత్రా
గదగ్..........అరున్

కర్నూలు • కల్లికోట • ఎర్నాకులం
కేంద్రాలలో దర్శించండి

మద్రాస్ • బెంగుళూర్
తదితర నగరాలలో తేదికి ఎదురు చూడండి...



వాహిని
వారి

# స్వర్గసీమ